ఓమ్.

శ్రీ మద్ధన్వంతరయేనమః

# శ్రీ ద్విభాష్యం వెంకటేశ్వర్లుగారి

# జీవితచరిత్రము.

ప్రకాశకులు :

**ద్విభాష్యం వెంకటసూర్యనారాయణమూర్తిగారు**

ప్రొప్రైటర్

వేంకటేశ్వర ఆయుర్వేద నిలయము,

చింతలూరు, ఆలమూరుపోష్టు, తూర్పుగోదావరిజిల్లా.

రచయిత :

**ఓలేటి సూర్యనారాయణశాస్త్రి.**



ఆ॥ వే॥ శ్రీ ద్విభాష్యం వెంకటేశ్వర్లుగారు

**సంస్థాపకులు**

వేంకటేశ్వర ఆయుర్వేద నిలయము,

చింతలూరు.

జననము : క్రీ॥ శ **24-12-1882** మరణము : క్రీ॥ శ **15-6-1949.**

# తొలిపలుకు.

బాబుగారి జీవితచరిత్రకు తొలిపలుకు వ్రాయు భాగ్యము లభించినందులకు గర్వించుచున్నాను. శ్రీ వెంకటేశ్వర్లుగారు మాతండ్రిగారికి పినతల్లి కుమారులు. బంధురీత్యా సన్నిహితులు. వాసరీత్యా సన్నిహితగ్రామవాస్తవ్యులు. అందుచే చిన్ననాటనుండి మా యుభయులకు మైత్రి, అనుబంధము ఎక్కువ. వయస్సుచే పదిసంవత్సరములు వారికన్న చిన్న. నాయందు వారికి పుత్రవాత్సల్యము. వారియందు నాకు పితృభావము. సంబంధ బాంధవ్యములకంటె అనునిత్యము రాకపోకలచే పరస్పరస్నేహానుబంధము వృద్ధియైనది. జీవితములు సన్నిహితములైనవి. కనుక వీరి జీవితచరిత్రకు తొలిపలుకు వ్రాయుటకు చిన్ననయ్యును సాహసించితిని.

వీరి వివాహకాలమునకు నాకు కొంత ప్రాజ్ఞతవచ్చినది. ఆ వివాహమునకు నేనుకూడా మాతలిదండ్రులతో తీపర్రుగ్రామము వెళ్లితిని. వీరికి మేనమామగారి కుమార్తెనుఇచ్చిరి. మా తండ్రిగారికికూడా వారు మేనమామలు. అప్పటికే మాతండ్రిగారు కావ్యనాటకాలంకార సాహిత్యమునందు మంచి పండితులై విద్యార్థులకు పాఠములుచెప్పుచు ప్రసిద్ధికెక్కిరి. మేనమామగారును మాతండ్రిగారును వీరి వివాహవిషయమై ప్రసంగించుకొనిరి. "నాయనా! పెద్దపిల్లను నీసోదరుఁడు నారాయణమూర్తికిచ్చి, రెండవపిల్లను నీ పినతల్లి కుమారుఁడు వెంకటేశ్వర్లుకు ఇచ్చుచున్నాను. నీవు సంపన్నుడవు. సన్నిహితగ్రామవాసివి. ఆతడును సద్వంశీయుడు. పరువు ప్రతిష్ఠలుగల కుటుంబమునకుఁ జెందినవాఁడు. భాగ్యభోగ్యాలేలాగున్నా గ్రాసవాసోదైన్యంబులు లేకుండా కనిపెట్టే బాధ్యత నీది." ఈమాటలు నేను ప్రసంగవశాత్తు మాతండ్రిగారివల్ల విన్నాను. తనపిల్లలను ఏలాగున పోషించుకోగలుగుతాడా యని మేనమామగారి హృదయము ఆనాడు పరితపించెను. అప్పటికే వెంకటేశ్వర్లుగారి తల్లి గతించినది. వెంకటేశ్వర్లుగారు మరి ముగ్గురు సోదరులు తండ్రిగారు చింతలూరుగ్రామంలో వైద్యవృత్తిలో కుటుంబకాలక్షేపము చేయుచుండిరి. మా పినతల్లిగారు కాపురమునకువచ్చిన వేళావిశేషము మంచిది. వెంకటేశ్వర్లుగారి

వైద్యప్రమేయము దినదినాభివృద్ధి గాంచినది. తండ్రిగారు గతించినను సోదరులందఱు కలిసిమెలిసియుండి కుటుంబాదాయము నలువురు నాలుగువిధాల స్వార్జితముతో పెంపొందించి కుటుంబపు పరువుప్రతిష్ఠలు వృద్ధిపరచుకొనిరి. వెంకటేశ్వర్లుగారును, వీరియన్నగారు బుచ్చయ్యగారును, తాత ముత్తాతల నుండి అనుక్రమముగా వచ్చుచున్న వైద్యవృత్తిని అవలంబించి విఖ్యాతిబడసిరి. వీరు మా తండ్రిగారియొద్దకు వైద్యవ్యాపార వ్యవహారములలో తరచు వచ్చి సంప్రతించుచు వారి సలహాలను తీసికొని వారిమాటకు జవదాటక వ్యవహరించుచుండిరి. నేటివరకు మేనమామగారే బ్రతికియుంటే వెంకటేశ్వర్లుగారి సౌజన్యము, సౌశీల్యము, సంపత్తిని చూచి మహానందభరితులై ఎంతఉప్పొంగే వారో ?

“వెంకటేశ్వర్లుగారి యభ్యున్నతికి కీలకమెక్కడ ?” నేడు వీరు రెండువందల యెకరములు సుక్షేత్రము మాగాణీభూమికి భూస్వాములు. రెండుమూడులక్షల రూపాయిలు సాలీనా ఔషధవ్యాపారము, ఆంధ్రదేశమంతట సుమారు నలభైబ్రాంచీలద్వారా చేయుచు గవర్నమెంటువారికి సాలునకు దాదాపుగా ముప్పదివేలరూపాయిలు ఆదాయపుపన్ను కట్టుచున్నారు. గుమాస్తాలు, పనివాండ్రకు రోజూ వీరిచ్చేజీతాలు నూరురూపాయీలకు దాటియుండును. వైద్యవ్యాపారమే వీరి యభ్యున్నతికి మూలకారణము. వైద్యవృత్తి కొంతకాలము కొనసాగించి శాస్త్రీయమైన ఆయుర్వేద ఔషధములను దేశములో వ్యాప్తిచేయుటయే వీరి జీవిత పరమావధిగా బెట్టుకొనిరి.

ఇతః పూర్వము జమీందారుల నాశ్రయించిన రాజవైద్యులయొద్దనే సుప్రసిద్ధౌషధములుండెడివి. ఇతరులకు చాలాధనవ్యయముతోగూడిన ఔషధముల తయారుచేయుట దుర్లభముగానుండెను. గచ్చాకుపుచ్చాకువేసి, తెల్లమందు నల్లమందుకలిపి యేదోవైద్యప్రయోగముచేయుచుండుటచే ఆయుర్వేదవైద్యులన్నా, ఆయుర్వేదఔషధాలన్నా గౌరవప్రతిష్ఠలు పోయినవి. ఈ శతాబ్దారంభములో కీ॥ శే॥ పండిత డి. గోపాలాచార్యులుగారు తీవ్రమైన కృషిచేసి సుప్రసిద్ధ ఆయుర్వేద ఔషధములు తయారుచేయించి వ్యాప్తిచేసి ఆయుర్వేదఔషధముల ప్రతిష్ఠను, గౌరవము కాపాడినారు. డాక్టర్. శ్రీ ఆచంట లక్ష్మీపతిగారు అల్లోపతి వైద్యశాస్త్రప్రవీణులై యుండియు, ఆ

వైద్యవిధానము విడనాడి ఆయుర్వేదవైద్యశాస్త్రము గ్రహించి, ఆయుర్వేదఔషధముల వ్యాప్తి జేయుటకు ఫార్మసీ నొకదానిని ప్రతిష్ఠించి గొప్ప ప్రచారప్రబోధములు గావించిరి. వీరేగాక అక్కడక్కడ విరళంగా సుప్రసిద్ధ ఆయుర్వేదవైద్యులు గ్రామసీమలనంటి, ప్రాచీనాయుర్వేద సంప్రదాయములును, ఔషధములును, ఖిలంగాకుండా ఆయుర్వేద వైద్యప్రాభవమును సంరక్షించుచునేయుండిరి. పానుగల్ ప్రధానామాత్యుల హయాంలో జిల్లాబోర్డులలోను, మునిసిపాలిటీలలోను, ఆయుర్వేదఆసుపత్రులు తెరచుట కనుమతించడంమూలంగా ఆయుర్వేదఔషధములు బాహుళ్యం మీదకొనుట ప్రారంభమైనది. ఈతరుణంలోనే వెంకటేశ్వర్లుగారు విరివిగా ఆయుర్వేద ఔషధములతయారుచేసి వ్యాప్తి జేయుట ప్రారంభించిరి. యథాశాస్త్రీయముగా కల్తీలేని ఔషధములు తయారుచేసి, నిఖిలభారతాయుర్వేదఔషధ ప్రదర్శనములలోను, ఆంధ్రాయుర్వేద ఔషధప్రదర్శనములలోను తమ ఔషధములు ప్రదర్శనముగావించిరి. పది ఐదురకముల ఔషధములుతయారుచేయుటతో సంతృప్తిపడక చరక, సుశ్రుత, రోగరత్నాకరాది ఆయుర్వేద ఉద్గ్రంథములలో నిర్వచించిన ప్రకారము రసౌషధములు, ఆసవములు, అరిష్టములు, తైలములు, లేహ్యములు మున్నగు వివిధరకములైన ఔషధములు ఏటేట ప్రదర్శనములకు పంపుచుండిరి. నిఖిలభారతాయుర్వేద వైద్యసమ్మేళనము వారును ఆంధ్రాయుర్వేదవైద్య సమ్మేళనమువారును వీరియౌషధశాస్త్రీయమును, బాహుళ్యమును గుర్తించి మొదటితరగతి యోగ్యతాపత్రములు, సువర్ణపతకములు బహూకరించిరి. ఇందుమూలమున వీరియౌషధములాంధ్ర దేశమునకేకాక యావద్భారత దేశమందును ప్రఖ్యాతివడసినవి.

ఈ ప్రథమప్రపంచ యుద్ధానంతరము, రెండవ ప్రపంచయుద్ధానంతరము కూడ పాశ్చాత్యఔషధములకు "గిరాకీ" యెక్కువయ్యెను. కొన్ని యౌషధములు దొరకుటయే దుర్లభమాయెను. దేశీయవైద్యముపట్ల ఆయుర్వేదౌషధములపట్ల అభిమానము హెచ్చైనది. దేశీయవైద్య వ్యాప్తితోబాటు ఆయుర్వేదౌషధముల కొనుగోలు కూడ వృద్ధియైనది. వేంకటేశ్వరఆయుర్వేదనిలయౌషధములు సశాస్త్రీయములై చెప్పినరీతిగ ఫలితములొసంగుటచేతను, నడిపించువారికి మోసములేనివను దృఢమగునమ్మకము, విశ్వాసము కలుగుటచేతను వీరియౌషధముల కొనుగోలుశీఘ్రముగా వృద్ధిపొందినది.

డా॥ శే। కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు ఒక్క "అమృతాంజనము" అను తలనొప్పి మందుతో ప్రసిద్ధికెక్కిరి. "కేసరి" గారు 'లోధ్ర' ఔషధముతో ప్రశస్తివహించిరి. జమ్మివారు "శిరశ్శూల్యారి" ఔషధముతో పేరుగాంచిరి. ఇట్లు వెంకటేశ్వర్లుగారి ప్రతిష్ఠకు ఒక్క ఔషధముమాత్రమే ప్రత్యేకముగ పేర్కొనుటకు వీలులేదు. వేంకటేశ్వరాయుర్వేద నిలయములోని అన్ని యౌషధములకును సమానప్రతిపత్తియే గలదు.

వెంకటేశ్వర్లుగారి వైద్యప్రాభవమునకు, ఔషధప్రాశస్త్యమునకును కీలకము వీరి విశుద్ధప్రవర్తనమే. వినిర్మలహృదయులు, గర్వమెరుంగని వినయసంపన్నులు, కృత్రిమము తెలియని సరళస్వభావులు. మాయమర్మములు లేని వ్యవహర్తలు. శాస్త్రములో చెప్పిన ప్రకారము వీరు స్వయముగా పరిశీలన చేయుచు ఔషధములు తయారుచేయించుట మూలమున వీరి ఔషధప్రాభవము పెంపొందినది. ఔషధప్రాభవముతో వ్యాపారాభివృద్ధియు, దానితో ఆదాయము వృద్ధికాజొచ్చినది. ఆదాయము అభివృద్ధిఅయిన కొద్ది వినయ వినమ్రతలు త్యాగసౌశీల్యములు వృద్ధిపొందినవే కాని వీరిని గర్వభూయిష్ఠుని చేయలేదు. పూర్వస్మృతిని పోగొట్టలేదు బీదలయందు ఆదరణ, దరిద్రులయందు సానుభూతి, ఆర్తులయందు కనికరము, సేవకులయందు వాత్సల్యము, ఆపన్నార్తులయందు వితరణ, సంపత్తు పెరిగినకొద్ది వీరిజీవితములో హెచ్చుగా కార్యరూపమున ప్రకటితమగుచున్నవి వీరి యుపాస్యదేవత

"శ్రీ ధన్వంతరి."

అహరహమును ఉపాస్యదేవతను పూజించుటకు వీరిస్వగ్రామము

"చింతలూరు"

లో శ్రీధన్వంతరి దేవాలయప్రతిష్ఠగావించిరి. దేవాలయనిర్మాణమునకు కనీసము పదియేను వేలైనను ఖర్చుపరచియుందురు. పూజాపురస్కారములకు, నిత్య నైవేద్యములకు దేవాలయ కైంకర్యములకును ఇరువదియైదువేలు ఖరీదు చేయు ఎనిమిది ఎకరముల స్థిరభూవసతినిగూడ శాశ్వతదానపట్టా వ్రాసి యిచ్చిరి. ప్రాచీనములగు వేదశాస్త్రవిద్యలను పరిపోషించుటకై

"పింజరం"

గ్రామములో పాఠశాలనొకటి ప్రతిష్ఠాపించి పదివేలరూపాయీలు శాశ్వత నిధిగా నొసంగిరి. సత్రములు, సావిడులు, విద్యార్థి వేతనములు, ఆరామములు బావులు మొదలగువానికై గుప్తదానములిచ్చి, పరమేశ్వరుడిచ్చినసంపత్తి దుర్వినియోగమొనర్పక సద్వినియోగము చేయుచున్నారు.

"శ్లో॥ యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరో జనః ।
స యత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే ॥"

అను సుప్రసిద్ధగీతావచన మాదర్శముగా గైకొని, పెద్దల యడుగుజాడలలో నడచి తమజీవితమును సార్థకమొనరించు కొనుచున్నారు. చిన్ననాటిమిత్రులకు, సహపాఠులను మరువక యెందరకో యుపాధుల నేర్పరచినారు. స్వశాఖవారి నెందరినో యుద్ధరించుటకు తమ ఔషధాలయములో వేతనములిచ్చియు, వైద్యనిలయశాఖలలో నుద్యోగములిచ్చియు, పోషించుచున్నారు. సహృదయుడగు నొకవ్యక్తి యభ్యున్నతికివచ్చినయెడల ఎన్నికుటుంబములో పోషింపబడగలవు.

"పరోపకారాయ సతాంవిభూతయః."

అనువాక్యము వీరిపట్ల యథాతథముగా వర్తించుచున్నది. వీరిజీవితము సన్నిహితముగా నెఱింగినవాడనగుటచే వీరిజీవితమితరుల కాదర్శముగా నుండగలదను సంపూర్ణవిశ్వాసముతో నీవిషయము నుల్లేఖించితినేగాని ఉత్ప్రేక్షించుటకుగాని, కేవలము పొగడ్తకొఱకుగాని నేను వ్రాయనుద్దేశింపలేదు.

వీరిజీవితముతో సంబంధించిన మరియొక విషయమేమన. చింతలూరి గ్రామములో వీరితండ్రిగారి నాటినుండి ధర్మవైద్యము చేయుచుండుటచే వీరికుటుంబమునకు గౌరవము, పలుకుబడి, ప్రాభవము ఎక్కువ. అందుచే విశేషధనసంపత్తి యానాడు లేకపోయినను ప్రజాదరణ, పలుకుబడి ఉండుటచే ఆగ్రామములో నెలకొల్పబడిన సహకారసంఘమునకు వెంకటేశ్వర్లుగారు అధ్యక్షులుగను, వీరిసోదరులు సుబ్బారాయుడుగారు కార్యదర్శిగను ఎన్నుకొనబడి వ్యవహరించుచుండెడివారు. వీరి కార్యనిర్వహణ దక్షతవలన ఆ సంఘవ్యాపారము రు 30000/ల వరకు వృద్ధిపొందినది.

ఈ ప్రాంతములో నేసహకారసంఘము నూతనముగా స్థాపింపబడినను నిర్ణీతమైన గరిష్ఠసంఖ్యధనము వీరొసంగుచుండురు. అలమూరు "కోఆపరేటివు లాండుమార్టుగేజీబ్యాంకి, కోఆపరేటివుస్టోర్సు, కోఆపరేటివు రూరల్ బ్యాంకి, ఉత్పత్తికొనుగోలుదార్ల సంఘము, పశుసంపత్తివృద్ధి సహకారసంఘము"ల్లో వీరు వాటాదార్లు. కాని అధికారపదవులు వేటిని వాంఛింపరు.

వీరు వింజరం వేదశాస్త్రపాఠశాలకిచ్చిన పదివేలరూపాయీలును అలమూరు కోఆపరేటివు రూరల్ బ్యాంకిలోనే డిపాజిట్టుచేసియున్నారు. వారి సొంతధనముగూడ ఈబ్యాంకిలోనే డిపాజిట్టుచేసెదరు. వ్యాపారమునకు కావలసినధనము ఈ సహకారబ్యాంకు "కరెంటుఅక్కౌంటు"లో వేయుదురు. ఆంధ్రదేశమున వివిధప్రాంతములలోని వీరిబ్రాంచిల డబ్బంతయు డ్రాఫ్టులమూలముగా నీబ్యాంకిద్వారానే మారకమగుచున్నది. వీరు సహకారోద్యమమునకు మొదటినుండియు చేసిన చేయుచున్న సేవ యమూల్యము. వెంకటేశ్వర్లుగారి ప్రాభవము హెచ్చినను పల్లెటూరగు చింతలూరు వీరు విడిచిపెట్టలేదు. పట్టణములలో వీరు స్థాపించిన బ్రాంచిలనుండి ఈపల్లెటూరికి అనునిత్యము మనియార్డర్లు, చెక్కులు, డ్రాఫ్టులు వందలు, వేలు వస్తూనేయున్నాయి. ఈ డబ్బంతా వీరేదోవిధంగా పల్లెటూళ్లలోనే ముట్టచెబుతున్నారు. అనునిత్యం నూరుమంది ఔషధనిర్మాణంలో పనిచేస్తూ కుటుంబాలు పోషించుకొంటున్నారు. వీరిలో చాలమంది స్త్రీలు గలరు. వెంకటేశ్వర్లుగారు దేవాలయములు, సత్రాలు, సావిడులు కట్టించినా, వేదశాస్త్రపాఠశాలలు పెట్టి పోషించినా, పండితులను, కవులను సత్కరించినా, బీదసాదలను ఆదరించినా, అతిథిఅభ్యాగతులను పూజించినా ద్రవ్యమంతయు పల్లెటూళ్లలోనే వినియోగపడుతోంది. ప్రాచీనపద్ధతిని పల్లెటూళ్లలోనే ప్రాభవముపొందుటకిచ్ఛగించి పట్టణవ్యామోహితులుగాక పల్లెటూరిలోనే నివాసంగానుండుటకు దీక్షపట్టుటచే వీరి యౌన్నత్యమువలన వీరిగ్రామముకూడ ప్రసిద్ధికెక్కుటయేగాక, ఆర్థికముగాగూడ అభ్యున్నతిపొందుచున్నది. ఔషధపరిశ్రమ అత్యుత్తమగృహపరిశ్రమగా పరిఢవిల్లి వీరి సౌభాగ్యమునకు తోడ్పడుటయేగాక ఈగ్రామములో నెన్నియోకుటుంబముల యుదరపోషణకు, నిలువ నీడనిచ్చుటకు తోడ్పడుచున్నది.

పాశ్చాత్య "అల్లోపతి" వైద్యంవల్ల గ్రామసీమల్లోని ధనం కొల్ల గొట్టబడి సంతతమహాప్రవాహంగా పాశ్చాత్యదేశాలకు తరలిపోవుచున్నది. సుప్రసిద్ధదేశీయవైద్యులు శాస్త్రీయౌషధములు తయారుచేయించి ఆయుర్వేదవైద్యవిధానమునకు దోహదకముసంగినచో దేశీయవైద్యప్రాభవముతోపాటు దేశీయసంపత్తికూడ వర్ధిల్లగలదు.

వెంకటేశ్వర్లుగారీ విషయమున మార్గదర్శకులై ఆయుర్వేదౌషధగృహ పరిశ్రమను వర్ధిల్లజేసి పట్టణముల కెగబ్రాకక పల్లెటూళ్లలో నుండి గాంధి మహాత్ముని యాదేశానుసారము దేశీయవైద్యవిధానంద్వారా గ్రామోద్ధరణకు తోడ్పడినందుల కెంతయు నభినందనీయులు.

విదేశప్రభుత్వంవదలినా, పరదేశభాషా ప్రాభవం సడలినా ఇంకను మనదేశీయులకు పరదేశ వైద్యవిధానమందు వ్యామోహముతగ్గలేదు. వెంకటేశ్వర్లుగారి వంటి వేలకొలది ఆయుర్వేద వైద్యులు ఆయుర్వేద వైద్యవిధాన ప్రాశస్త్యమును వెల్లడించి, ఆయుర్వేద ఔషధప్రాశస్త్యము సర్వజన విదిత మగునట్లుగా ప్రచారప్రబోధములు గావించి దేశీయుల పాశ్చాత్య వైద్య వ్యామోహమును వదలించుటకు కృషి సలుపవలసిన బాధ్యతయెంతేని కలదు.

"శ్లో॥ యస్మిన్ దేశేహి రోగాజాతః
తజ్జం త స్యౌషధం హితమ్."

ఏదేశమున బుట్టిన మనుజునకు ఆదేశమందలి యౌషధమే హితకరమైనది, అను పరమ సత్యమును వెల్లడించినచో త్వరలోనే దేశీయుల పాశ్చాత్య వైద్య వ్యామోహము సడల గలదు.

చరక, సుశ్రుత వాగ్భటు ముఖ్యములగు ప్రాచీన వైద్యగ్రంథములెన్నియో నేటివరకు ఖిలముగాకుండనుండుటకు ముఖ్యహేతువు, ఆగ్రంథములు రచించి వ్యాప్తిజేసిన ఆయుర్వేదాచార్యుల తపఃప్రభావము ఉదారాశయములే. వారావిజ్ఞానమును పలువురకుపదేశించి వ్యాప్తిజేయుట మూలముననే నేటికిని ఆవిజ్ఞానము ఖిలముగాకుండ నిలిచియున్నది. వారట్లు బహిర్గతము సేయకుండ తమలోనే జీర్ణింపజేసికొన్నచో ఈయాయుర్వేదవిజ్ఞాన మేనాడో నశించియుండెడిది. నేటివైద్యప్రబుద్ధులు తమకు తెలిసిన యౌషధరోగరహస్యము లితరులకుజెప్పక స్వార్థముచే తమతోడనే నశింపజేయుటచే ఎన్నియో

ఔషధయోగములు విస్మృతములైనవి. తమవద్దనున్న శాస్త్రగ్రంథ మెవరుల కిచ్చినచో తమకు తెలిసినరహస్యము బైటపడి తమప్రాభవము పోవునేమో యని ఎన్ని వైద్యశాస్త్రగ్రంథములనో మనవారుపోగొట్టుకొన్నారు. ఈదుస్థితి ఒక్క వైద్యశాస్త్రమునకేగాదు. ఎన్నిరాప్రాచీనములగు వివిధశాస్త్రగ్రంథ ములుగూడ మానవునిస్వార్థపరత్వమునకు బలియయినవి. అనుభవంలో చూచు కొంటే మనకుండలలోనే అపూర్వమైనఔషధయోగాలు నేటికిని గుప్తంగా దాచబడేయున్నవి. ద్విభాష్యంవారి "శ్లేష్మగజాంకుశము"నకు విశిష్టస్థాన మున్నది. ఇతరులుగూడ నీయౌషధము తయారుచేయుచున్నను వీరియౌషధ మునకే ప్రసిద్ధి. నాగేశ్వరావుపంతులుగారి అమృతాంజనయోగము కేసరిగారి లోధ్ర, ఇతరులకు చిదంబరరహస్యమే.

ఔషధయోగములు అనేక పరిశోధనలొనర్చి యనేకప్రయోగము లొనర్చి వ్యాధినివారణకై ఒక్కొక్కమహనీయుని బుద్ధికుశలతవలన గనిపెట్ట బడినవి. మలేరియాకు "క్వైనైను" అమూల్యౌషధము. ఈలాగే కలరా, ప్లేగు, క్షయ మొదలగురోగములకు ఎందఱెందరో మహనీయులు పరిశోధనలుసేసి తమయమూల్య పరిశోధనావిజ్ఞానమును లోకమునకుచాటి ప్రపంచమున వ్యాప్తిగాంచినరోగములు నివారించుటకు తమజీవితములు బలిదానమొనరించి యశఃకాయులైరి. ప్రాచీనకాలములోగూడ మహర్షులు వైద్యశాస్త్రపరిశోధన కిట్లే తమజీవితములు ధారవోసి ఆవిజ్ఞానము శిష్యపరంపరయందు వ్యాప్తిసేసి ధన్యజీవులైరి. ఆర్షమహర్షుల యడుగుజాడలలో నడచుకొని వెంకటేశ్వర్లు గారు శిష్యబృందమునకు వైద్యరహస్యములను, ప్రక్రియలను బాహాటముగా తెలియజెప్పి ఎందఱినో శిష్యకోటిని తయారుచేసిన ధన్యజీవులు. మనయాయు ర్వేదవైద్యులు తమవైద్యవిజ్ఞాన మతిరహస్యముగానుంచుకొనక ప్రభుత్వా లంబన మింకనుపూర్తిగాలేదుగాన శిష్యకోటికుపదేశించి యాయుర్వేదవైద్య విజ్ఞానమును దేశమునాల్గుమూలల వెదజల్లవలసియున్నది. వెంకటేశ్వర్లుగారి వద్దచదివి యుత్తీర్ణులైనశిష్యప్రశిష్యులందఱుఁ దమగురువుగారివలె వైద్యరహ స్యములను దమశిష్యపరంపర కుపదేశించి, మంచిపేరుప్రఖ్యాతులు వడసి వైద్యముచేయుచున్నారు. మదరాసు మొదలుకొని పర్లాకిమిడివరకు గల యాంధ్రదేశములో వెంకటేశ్వర్లుగారు వేలకొలఁది రోగులకుఁ జికిత్సలు గావించి, దేశమునకు, మానవసంఘమునకుఁ జేసినసేవ యెంతయుఁ గొని

తూ దేదగియున్నది. వీరు గావించిన వైద్యపరిచారము ఇతరులెవ్వరు చేసి యుండలేదు. వీరికాలముననే ఆంధ్రదేశమున వాయుర్వేదవైద్యము ప్రశస్తి గాంచుచుండుట నిక్కము.

కవులజీవితములు వ్రాయబడినవి. రణరంగమున పరాక్రమించి యశఃకాయులైన యోధాగ్రేసరుల చరిత్రలు ప్రకటితములైనవి. రాజకీయవేత్తల జీవితచరిత్రములు వెలువడినవి. కళోపాసకుల జీవితవిశేషములు ప్రచురింపబడినవి. పారిశ్రామికుల ప్రాభవములు కనువిందుచేయుచున్నవి. అయితే వైద్యవరుల జీవితచరిత్రములరుదు. ఆంధ్రభాషలో అసలేలేవేమో? ఇదేప్రథమం.

“వెంకటేశ్వర్లుగా రేమంత ప్రపంచప్రఖ్యాతపురుషులా? జీవితచరిత్రము వ్రాయుటకు?” అని పలువురు శంకింపవచ్చును. వారికి నాసమాధానమిది. వెంకటేశ్వర్లుగారు సామాన్యకుటుంబమునకు చెందినవారు. విశేషపాండిత్య ప్రకర్షగలవారు కారు. ఆగర్భశ్రీమంతులుగారు. అయితే యేముంది ఈయనయందు విశిష్టతఅనిఅంటారేమో? సామాన్యకుటుంబమున జన్మించియు సంపన్నగృహస్థులైరి. విశేషపాండిత్యప్రకర్షలేకున్నను స్వయంకృషిచే చక్కని విజ్ఞానమును సముపార్జించిరి. ఆగర్భశ్రీమంతులుగాకున్నను సశాస్త్రీయఆయుర్వేదౌషధ సద్వ్యాపారనిర్వహణద్వారా లక్షలుగడియించి శ్రీమంతులైరి. నిరాడంబరవిశుద్ధజీవనమున యశఃకాయులైరి. అందుచేతనే వీరిజీవితచారిత్రము ఆంధ్రలోకమున ప్రకటితమైనచో పలువురువైద్యవరులకు మార్గదర్శకము కాగలదు.

శ్రీ కందుకూరి వీరేశలింగంపంతులుగారు, చిలకమర్తి లక్ష్మీనరసింహం గారు, శ్రీపాదకృష్ణమూర్తి శాస్త్రులుగారు, సామాన్యకుటుంబములోనేపుట్టి కవివరేణ్యులై ఆంధ్రావనియందు యశమునార్జించిరి.

తమ యసాధారణ మేధాసంపత్తిచే, అనన్యసామాన్యప్రతిభచే, పాండిత్యప్రకర్షచే యావదాంధ్రదేశమున శతావధానాదికములుచేసి కవితాప్రాభవముంజూపి, శిష్యప్రశిష్యకోటులకు కవితాభిక్షనిడినవారు తిరుపతివేంకట కవులు. అందు శ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారు కూడ సామాన్యకుటుంబములోనివారయ్యును గడించినయశస్సు అనల్పము. అగణ్యము.

తనవిశిష్ట విమర్శనాశక్తిచే విద్యార్థిలోకమున కాధ్యాత్మికవికాసోదయము కలిగించి ఆదర్శజీవితము గడపిన శ్రీకూర్మా నరసింహముగారు మన మండలములోనివారే. రాజకీయవిజ్ఞాన సభాంగణమున విహరించి యశఃకాయులైన శ్రీన్యాపతి సుబ్బారావు పంతులుగారు, మోచర్ల రామచంద్రరావు పంతులుగారు, డాక్టర్ బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యముగారును మనమండలమున జన్మించిన సామాన్యగృహస్థులే. చిత్రకళాలేఖన కళోపాసనమందు సిద్ధహస్తులైన దామెర్ల రామారావుగారును గోదావరీతీరనివాసియే.

వెంకటేశ్వర్లుగారుకూడ పైవారివలె మనమండలమందే పుట్టి, సామాన్య స్థితిలో వైద్యవృత్తి ప్రారంభించి, క్రమక్రమముగా నత్యున్నతస్థితికివచ్చి ప్రాభవోపేతులై యశఃకాయులై వైద్యమండలికెల్ల నాదర్శప్రాయులైరి. వీరిని వరవడిగా పెట్టికొని నేడు ఔషధాలయము లెన్నియో మన దేశమున నుప్పతిల్లి శాఖోపశాఖలుగా విస్తరించుచున్నవి. రాబోవుసంతతి వారికి వీరి జీవితచరిత్ర ఆదర్శప్రాయమగుగాక.

Lives of great men all remind us
We can make our lives sublime,
And, departing, leave behind us
Foot prints on the sands of time;

Foot prints, that perhaps another,
Sailing over life's solemn aim,
A forlorn and shipwrecked brother,
Seeing, shall take heart again.

Let us, then, be up and doing,
With a heart for any fate;
Still achieving, still pursuing,
Learn to labour and to wait.

నరసింహదేవర సత్యనారాయణ.



ప్రకాశకులు :

ద్విభాష్యం వెంకట సూర్యనారాయణమూర్తిగారు

ప్రొప్రైటరు.

జీవనులు. మా జనకులని కాదు గాని, యిట్టి గుణములుగల యే పురుషుడైనను, ఉన్నతస్థితికి రాఁగలుగుట సత్యము. వారియం దుండు పట్టుదల, కార్యదీక్ష, నిస్పృహత్వము, నిరాడంబరము, గర్వరాహిత్యము, వేయేల ఆత్మస్తుతి పరనిందలు లేకపోవుట, మున్నగు గుణములు పరికించుకొలఁది ఒకటి కాకపోయిన మరొకటేని యభ్యసనసాధ్యము, ఆచరణసులభము నగునని గోచరింపకపోదు. వారియడుగుల జాడలఁబట్టినడుచు మానవసంఘము ఉత్తమస్థితినందుట యబ్బురము కాదు. ఆదర్శపురుషుల మార్గములలో సంచరించు వ్యక్తులిహలోక, పరలోకములలో నందుకొనఁజాలని దేదియును నుండదు. అట్టి యాదర్శజీవులే మానవలోకమునకు ధ్రువతారలు.

అన్నదానము, గుడికట్టించుట, కృతులనందుట, వేదశాస్త్రోద్ధరణదీక్ష మున్నగు సత్కార్యములనేగాక, వారిజీవితాదర్శములగు నుత్తమలక్షణములనుగూడ గుర్తించి, భావిజనసంతతి యాసత్పథమున సంచరించుచో నాయీ జీవితచరిత్ర ప్రకాశకత్వము సఫలము కాఁగలదు. అతిశయోక్తి కొఱకుఁగాని, పొగడ్త కొఱకుఁగాని కాక, ఉన్నదున్నట్లుగ యథార్థస్థితిని వ్రాసిననే మా పితృదేవులకు సమ్మతమగునను విషయమెఱింగిన శ్రీ ప్రోటేటి సూర్యనారాయణశాస్త్రిగారిని కోరఁగా, వారద్దియే మనంబున నిడుకొని, తదనుకూలరీతిగ నీజీవితచరిత్ర వ్రాసి యొసంగినందులకు ధన్యవాదములు. ఈనాఁటికాచరిత్రను ప్రకాశింపఁగలుగుటచేత నాకృషి సఫలము, సార్థకము.

మత సహకార రాజకీయవ్యాపారములలో నిరంతరము మగ్నులైయుండికూడ, బ్రహ్మశ్రీ నరసింహదేవర సత్యనారా

యుణగారు సుమారు నలుబది సంవత్సరములనుండి మాజనకులతోఁగల యనుబంధము, దగ్గరచుట్టరికము మాటనటుంచి, తమయసామాన్య ప్రేమభావముతో నీచరిత్రకు తొలిపలుకు వ్రాసియొసఁగినందులకు, ఇట్టిగ్రంథరచనావశ్యకతను వెల్లడించుభారమును వారేవహించినందులకును కృతజ్ఞుఁడను. జీవితచరిత్రము లెట్లుండవలయునో, యేయేవిషయము లాచరణీయములో, ఎట్టివారికి జీవితచరిత్రము లవసరములో యాయావిషయములతోఁ గూడిన వారితొలిపలుకు ఈజీవితచరిత్ర భాష్యమునకు ప్రదీపము. ఉదాత్త విషయముల సంగ్రహరూపము, కాని సమగ్రవివరణము.

చక్కనిరీతిలో సకాలమున నచ్చువేసి యీగ్రంథము నిట్టి రూపములో వెలువడునట్లుచూచిన శ్రీ పట్టమట్ట శేషగిరిరావుగారికిఁ గూడ హృదయపూర్వక కృతజ్ఞత దెలుపుటభావ్యము. తమకు మాతండ్రిగారిపైఁ గలగాఢాభిమానమును వెల్లడించి శ్రీధన్వంతరి చరిత్రమువలె మంచియాకారములో స్ఫుటమైనయచ్చులో ప్రకటించి యానందమునకుఁగారకులైనారు.

ఇట్టి గ్రంథములనుజదివి యుత్తమగుణములనుగుర్తించి ఏవొకనిజీవితమునందైనను, ఏకొంతమార్పేనికలుగుచో నా యీప్రయత్నము సార్థకము. శ్రీధన్వంతరి కృపచేనట్టి ఫలము లభింపఁగలదనినిరీక్షణ. ఉపదేశములకన్న నాచరణచేసిన గుణము లలవడుట న్యాయము. అట్టియుద్దేశముతోడనే ప్రకాశితమైనగ్రంథము మార్గదర్శకమగుగాక.

సుధీవిధేయుఁడు,

ద్విభాష్యం వెంకటసూర్యనారాయణమూర్తి

ఓమ్

శ్రీమద్ధన్వంతరయేనమః

# బ్రహ్మశ్రీ ద్విభాష్యం వెంకటేశ్వర్లు గారి జీవిత చరిత్రము.

## పీఠిక

ఉ. శ్రీ యుర మెక్కఁగా యని ధ
రిత్రి శరీరము సర్వ మాత్మస
చ్ఛాయ మొనర్చ నాఁగ విల
సన్నవనీరదనీల దేహుఁడై
యేయెడఁ బొల్చు వేంకటగి
రీశుఁడు పేరిమి మీఱ సూర్యనా
రాయణు సర్వసంపదభి
రామునిఁ జేయు ద్విభాష్య వంశజున్. 1

ఉ. శాంతియు దాంతి సత్త్వమును
సత్యము రూపువహించె నా సము
ద్రాంతరసీమఁ జక్రము మ
హామథమున్ దరమున్ సుధారసా
క్రాంతఘటంబు నాలుగుక
రంబుల మించ వినిర్గమించుధ
న్వంతరి దేవదేవుఁడు ద్వి
భాష్యకులీనుని బ్రోచు సూర్యునిన్. 2

శా. చేతఃప్రీతిగ నన్నపూర్ణ గృహిణీ
శ్రీ నిర్వహింపంగ లో
కాతీతం బగువైభవంబు గని య
ష్టైశ్వర్యపర్యాప్తి సు
స్ఫీతం బైనసమృద్ధిమై మెఱయునీ
విశ్వేశ్వరస్వామి సం
ప్రీతిం బ్రోచు ద్విభాష్యవంశతిలకున్
శ్రీసూర్యనారాయణున్. 3

వ. ప్రబంధముఖలక్షణం బగునాశీర్వాదం బొనరించి కృతి
నిర్మాణకారణం బొకింత వచియింతు. 4

చ. వయసునఁ బిన్న యయ్యు గుణ
భవ్యతఁ బెద్ద యనంగ నొప్పువాఁ
డయవినయాభిరాముఁ డన
యంబు నయంబునఁ బొల్చునట్టిఁ డ
వ్యయమున కెల్ల మూలికము
నాఁగను మేల్మిగొనంబు లెల్లఁ బ్రో
వయి తనరారునట్టిసముదారుఁడు
ధీరజనాభినంద్యుఁడున్. 5

ఉ. ఆయతబుద్ధివైభవస
మంచితుఁ డంచితవర్తనుండు వి
స్ఫాయదరీణభావుఁడు ద్వి
భాష్యకులాభరణుండు సత్కవి

ధ్యేయచరిత్రుఁ డన్వయస
మేధితసచ్ఛ్రీతుఁ డైనసూర్యనా
రాయణమూర్తి పండితహి
తాచరణుం డొకనాఁడు వేడుకన్. 6

శా. విద్వత్కుంజర మైనవింజరమునన్
విఖ్యాత మై యుండునా
విద్వద్వంశములందు నొక్కఁ డగుచుం
బెంపారు "ఓలేటి" నా
సద్వంశమ్మునఁ బుట్టి వ్యాకృతిమహా
చార్యుండు నాఁ బేరవూ
ర్విద్వత్పట్టము గాంచిమించువిబుధున్
శ్రీసూర్యనారాయణున్. 7

క. నను "విద్వత్కవిశేఖరు"
ఘనతరగురుభావ మొప్పఁ గా నాహూతుం
బొనరిచి యుచితాసనముం
దన నుండఁగఁ జేసి యనె మనోగత మిట్టుల్. 8

శా. మావంశమ్మున నెందఱెందఱో మహా
మాన్యాత్ము లౌవారు దా
మావిర్భావమునందినారలు తదీ
యామేయచారిత్రముల్
మావంశానకె కాక లోకమునకున్
మార్గమ్ము చూపింపఁగా
నావిన్నాణము గాంచిమించునవి యై
యానందముం గూర్చెడున్. 9

ఉ. అందును బుచ్చయాభిధుఁడు
నాతని పుత్రుఁడు వెంకయాహ్వయుం
డుం దులలేనికీర్తి క
డుం గడియించినవార లై కులం
బెందుఁ బ్రతిష్ఠితంబు పొన
రించిరి తచ్చరితంబు లెంతయున్
విం దగుఁగాదె యోయి సుక
వీ యలవారల నెంతు నెమ్మదిన్. 10

క. మాపూర్వు లెల్లరును వి
ద్యాపారీణులె యనంగ నగు నందున వీ
రేపాఠి వైద్యకమున
నాపైమాపిత గడించె నధిక ఖ్యాతిన్. 11

మ. తనసద్వర్తన మెల్లవారలకు నా
దర్శంబుగా నింపుసొం
పునఁ బెంపారుచు నాయురాగమము దా
మూర్తీభవించం గదే
యనఁ బేరందినవైద్యరాజు కవిరా
జాలంబభూతుండు మ
జ్జనకుం డౌనలవెంకటేశ్వరుఁ బ్రశం
సం జేయఁగాఁ జెల్లదే. 12

ఉ. అంతటివాని సచ్చరిత
మయ్యది సూత్రసమంబుగాఁగ నా
కింతగఁ జెప్పఁజాలిరి క
వీంద్రులు త్వత్కృత మైసెలంగుథ

న్వాంతరిసచ్చరిత్రమున
యం దొకయింతగ నుండెఁ గాని నా
స్వాంతము తృప్తి సెందదొక
పాటియు నిక్కము దాఁప నేటికిన్. 13

చ. జనకునిసచ్చరిత్రమును
సర్వ మెఱింగినప్రోఢ వాట నీ
మునుపొనరించియున్నకృతిఁ
బొల్పుగ నిల్పినతచ్చరిత్రసూ
త్రనికర మెల్ల నెల్లరు ము
దంపడి తెల్లముగా నెఱుంగున
ట్లొనరుపుమయ్య భాష్యము స
ముజ్జ్వలగద్యమయంబు గా నొగిన్. 14

ఉ. పద్యమయంబుగా నలరు
భవ్యసుకావ్యము పండితైకసం
వేద్యము గానఁ బిన్నలును
బెద్దలు నైతగుస్త్రీలు పూరుషుల్
హృద్యముగాఁ బఠింప నగు
రీతిని నీతిసుబోధకంబుగా
గద్యమయంబు కావ్యము నొ
కం డొనరింపుము సత్కవీణ్మణీ. 15

ఉ. పెద్దలసచ్చరిత్రము లు
పిన్నల కెందుఁ బ్రమాణభూతముల్
తద్దయు నున్నతిం గన ని
దానము లైతగుఁగాదె; సర్వసం
పద్దయితుండు మజ్జనకు
మాన్యపవిత్రచరిత్ర మెల్లవా
రొద్దిక మీఱ నారసి స
మున్నతికై జతనంబు సేయరే? 16

ఉ. ఎల్లరమాట కేమి సుక
వీశ్వర మాకొలమందు ముందుముం
దుల్లసిలంగఁ జాలుసుగు
ణోదయశాలులు బాలు రేనిసం
పల్లలితాత్ము లై మనెడు
మార్గము సూపఁగనౌను గాన నా
యుల్లము పల్లవించునటు
లొప్పుగఁ జెప్పుము తచ్చరిత్రమున్. 17

మ. మును ధన్వంతరిసచ్చరిత్రము కొనెం
బో తండ్రి యానాఁడు తా
మనరే వచ్చినపెద్ద లెల్లరును ధ
న్యం బైనతద్వృత్త మెం
దున నాదర్శము కావుటం బ్రజలకుం
దోడ్పాటుగా నుండులాఁ
గున గ్రంథస్థముసేయఁ జెల్లు ననుచుం
గోర్కుల్ పిసాళింపఁగన్. 18

శా. నాఁడే నాయెడ సందడించినది యీ
నాడెంపుసంకల్ప మా
నాఁడారంభముగాఁగఁ దచ్చరిత సం
ధానింప నావస్తువుం
గ్రోడీకారము సేసినాఁడ నిదిగో
శ్రింగారిత రూపంబు తో
లాఁడన్ గూర్పుము నేర్పుమై సుకవికం
ఠాలంకృతిన్ సత్కృతిన్. 19

మ. కవిశిల్పంబున నెట్టివస్తు వయినం
గానీ మనోరంజనం
బవు నావస్తువు దానుదాత్త మగుచో
నత్యంతహృద్యంబుగాఁ
దవు నంచు న్వచియింపనేల ? సముదా
త్తం బైనమత్తాతపా
దువిశిష్టోన్నతవృత్తి మిద్ది కొని చే
తోమోదముం గూర్పవే? 20

ఉ. నా విని తన్మనోంబుజము
నం దొలుకాడుమరందమాధురీ
భావితనూత్నభావములు
భావమునం దలపోసి పోసి త
ద్భావిసమున్నతస్థితిని
దానము నాఁదగఁ నాసదూహకున్
గైవస మైనమానసము
నం బలుకాడితి వేడ్క తోడుతన్. 21

ఉ. కాఁగలవారికిం గలుగఁ
గా నగునూహలె కాక యన్య మే
లాఁగున నువ్వతిల్లు? విమ
లం బగునీదుతలంపు పెంపు ను
ద్యోగము "బాగుబా" గని ను
తు ల్వానరింపఁగఁ జెల్లు నో మహా
భాగ! సమస్తభాగ్యపరి
భాసురత న్మనుమయ్యు యెయ్యెడన్. 22

మ. జనకుం గౌనల వెంకటేశ్వరుని స
చ్చారిత్ర మెంతెంతవ
ర్ణన కేనిం దగినట్టిదే యు నెద నై
న న్నాఁటికావ్యమ్ము నం
దున నామాత్రమె ప్రస్తుతం బగుట నం
దున్ నూత్రితుల్యంబు గాఁ
గను దెల్పంబడుమాట నిక్క మని వ
క్కాణింతు నో ధీమణీ. 23

శా. ఆయుర్వేదము మూర్తిదాల్చెనను టే
యత్యంతమున్ సత్య మం
దేయాపత్తు యథార్థదూర మగుమా
టే లేదు కా దన్నచో

నీ యాంధ్రావనిఁ గాక భారతములో
నే దూరదేశమ్ములం
దో యీసీపితృపాదుపే రెటులు తా
లూఁదె న్వచింపంగ దే? 24

ఉ. తాతయుఁ దత్సతీమణియుఁ
దద్దయుఁ జేయు తపఃఫలఁబునన్
బూతమనస్కుఁ డై సుకవి
భోజుఁడు నై బుధకల్పకంబు నై
యాతతకీర్తి ధుర్యుఁ డయి
యాయురుపాహ్వయ వేదమూర్తి నా
ఖ్యాతినిగన్న మీజనకుఁ
డం దెను జన్మము వెంకటేశుఁడున్. 25

చ. జనకుఁడు వెంకయాభిధుఁడు
సర్వగుణోత్తరుఁ డౌట నెందుఁ ద
ద్ఘనతరదివ్యబోధము ల
తంద్రితుఁ డై గ్రహియించి మించె నీ
జనకుఁడు వెంకటేశ్వరుఁడు
సత్కవినుత్యము తచ్చరిత్రముం
గనుఁగొని యెన్నఁడు న్మఱఁగు
గాణవు నీ విటు లుండఁ జెల్లదే. 26

మ. అణుమాత్రంబును గాని నానుడులయం
దత్యుక్తి లే దెందు స
ద్గుణమూర్ధన్యుఁడు వెంకటేశ్వరుని బే
రో్క నెంచుమాత్రాన గ

గ్గణమంచుం బదజాత మర్థతతి దా
నై వచ్చు నామ్రోల కే
యణువో నే గ్రహియింతు నందు విది త
ధ్యం బంచు వాక్రుచ్చెదన్. 27

ఉ. ఏల బహూక్తు లింతటియు
హీనగుణాకరుఁ డింతదాతృతా
శాలియు నింతవైద్యకవి
శాంపతి యింతటిశీలసంపదు
ద్వేలుఁడు కానరాఁ డిలఁ ద
దీయచరిత్రము కూర్చు మన్న నీ
యాలలి సత్కవీశ్వరస
మాహిత మై తగు నెల్లభంగులన్. 28

చ. మును జనమేజయుండు తన
పూర్వుల దాచరితంబు భారతం
బును రచియింపఁ జేసి కుల
మున్ జగమున్ సకలంబు ధన్యముం
బొనరిచి సుస్థిరంబు యశ
ముం గనె నాఁటికి నేఁడు తత్సహా
సనమునయందున న్నిలువఁ
జాలినభాగ్యము నీకె తక్కఁ జూ. 29

# ఆశీర్వచనము

చ. కులమున కెల్ల వన్నియను
గూర్పఁగఁజాలినశీలసంపదు
జ్వల సుగుణాలవాల కుల
వర్ధని పర్వతవర్ధనాంబ ని
చ్చలు సహధర్మచారిణిగఁ
జక్కనిపుత్రులఁ గాంచి తల్లిదం
డ్రులు ముదమంద నన్వయక
రుండవుగా విలసిల్లు మెమ్మెయిన్. 30

గీ. అన్నిభాగ్యమ్ములం జెలువందునీకు
నొందు దీవించుచోఁ బునరుక్తమ యగు
నీదు జనకుండు గుణమాన్యునిన్నుఁ బోలె
నాత్మజులఁ జిరంజీవులనరయు మయ్య. 31

చ. ఒకశకపూరుషుం డనఁగ

నొప్పెడుమీపితృదేవు జీవిత

ప్రకటనదత్త మైవఱలు

గ్రంథము పండితపామరాళిరం

జకముగ నెల్లవారు శిర

సావహియింపఁగ నారవిందుతా

రక మయి పొల్చుఁగాత మమ

రం బగుచున్ ధరణీతలమ్మునన్. 32

స్వస్తి.

10-12-1948.

విద్వత్కవిశేఖర :
ఓలేటి సూర్యనారాయణశాస్త్రి.

ఓమ్ !

శ్రీమద్ధన్వంతరయేనమః

# శ్రీ ద్విభాష్యం వెంకటేశ్వర్లు గారి జీవిత చరిత్రము.



## ౧. వ ప్రకరణము.

(ఆరామద్రావిడశాఖ నిర్వచనము—శాఖలోని మహాపండితులు మహాకవులు వైద్యులు మున్నగువారి వివరణము.)

### —: ఆరామద్రావిడశాఖ: —

శ్రీమంతమై సేతుశీతాద్రిమధ్యస్థమై నానానదీనదగిరి వరపరిభూషితమై రామేశ్వర దక్షారామవారాణసీముఖ్యపవిత్రక్షేత్రమండితంబగు భరతఖండము ధరామండలమున కెల్లం దలమానికము. మంత్రద్రష్టలు స్మృతిపురాణేతిహాసకర్తలు నగువసిష్ఠపరాశరకృష్ణద్వైపాయనాదిమహర్షివర్యు లెల్లరీఖండమునందే యవతారమందిరి. వీ రేల ? పరాత్పరుండగు శ్రీమహావిష్ణువే యీభరతఖండపాశస్త్యముం గని రామకృష్ణాదిరూపంబులతో నెన్నియోమారులిట నవతారంబులు గైకొనియె సృష్ట్యారంభమునుండి నేటివరకవతరించిన మహాపురుషులలో నేయొకరిద్దఱో తక్క యెల్లరీపుణ్యధరాతలంబుననే జన్మించియుండిరి.

ఇట్టి పరమపవిత్రం బగుభరతఖండ మంగవంగకళింగ మహారాష్ట్రాదిభేదంబులచే నేఁబదియాఱు దేశములుగా విభజింపఁబడినది. శ్రీశైల దాక్షారామకాళేశ్వరంబు లనుత్రిలింగంబులకును మధ్యస్థ మగుప్రదేశము త్రిలింగదేశ మనియు, ఆంధ్రదేశ మనియు వ్యవహరింపఁబడుచున్నది. గోదావరి కృష్ణవేణి. పినాకిని మొదలగుమహానదులును తిరుమల కాలహాస్తి దాక్షారామ, కోటిఫలి, ముక్తేశ్వరము, పిఠాపురము, అన్నవరము మున్నగుపుణ్యక్షేత్రములును త్రిలింగదేశప్రతిష్ఠకు జీవగఱ్ఱలు. నదీమాతృకంబు లగుకేదారంబులు ముక్కాఱులు పండుటంజేసి యీదేశంబున క్షామదేవతకు నిలువనీడ లేదు. దుర్భిక్షసమయంబుల నన్యదేశవాసులు సస్యశ్యామలంబగునాంధ్రదేశంబునకు వచ్చి నివసింపసాగిరి. ద్రావిడులు, ఆరామద్రావిడులు, కాసలనాఁడులు, వేఁగినాఁడులు మున్నగుబ్రాహ్మణు లెల్ల రట్లు వలసవచ్చినవారే. అందు "ఆరామద్రావిడు" లనువారు పెక్కుశతాబ్దులకుఁ బూర్వము ద్రవిడదేశంబునుండి తరలివచ్చి "పంచారామ" క్షేత్రమధ్యస్థితంబగు తెలుంగుదేశంబున స్థిరనివాస మొనరించికొని రనియు "వారే ఆరామద్రావిడులు" అను పేరున వ్యవహరింపఁబడుచుండిరనియు నీక్రింది యభియుక్తశ్లోకములవలనఁ దెలియఁబడుచున్నది.

శ్లో॥ పంచారామా ఇతి ప్రోక్తాః
కిలారామపదోత్తరాః
దక్షో భీమో௨మరః క్షీరః
కుమార ఇతి పంచకమ్. ౧.

శ్లో॥ ఆరామపంచకే విప్రాః
దాౖవిడా నివసంతి యే
సకలా అభిధీయంతే
ఆరామదావిడా ఇతి. ౨.

(తా॥ దక్షారామము 2 భీమారామము 3 అమరారామము.
4 క్షీరారామము. 5 కుమారారామము. అనుపంచా
రామ మధ్యదేశంబునం దుండుదావిడు లారామదా
విడు లనిచెప్పఁబడుచున్నారు.)

ఈవిషయమున కుపష్టంభకముగాఁ గొండ్లోకప్రాచీనతాళపత్ర
గ్రంథమున నీక్రిందిశ్లోకములు గానవచ్చినవి.

శ్లో॥ పంచారామక్షేత్రవాసాః ద్రవిడా దాగతా ద్విజాః
అధీతవేదవేదాంగా ఆరామదావిడాభిధాః ॥౧॥

శ్లో॥ యాజినః కవయస్సంతో
వైద్యవిద్యావిశారదాః
ధాతువాదరతా శ్శూరా
జ్ఞానినో గానకోవిదాః ॥౨॥

శ్లో॥ పరోపకారపారీణా
రాజకార్యధురంధరాః
దైవజ్ఞశేఖరా శ్శాంతాః
ప్రతివాదిభయంకరాః ॥3॥

పైశ్లోకములంబట్టి పంచారామ మధ్యదేశనివాసులగు దావి
డులు ఆరామదావిడు లనితేలినది. వీరు విశేషించి వసిష్ఠా

నదీతీరంబునం గల కాకరపఱ్ఱు, గౌతమీనదీతీరంబునం గల వింజరము, ఆలమూరు, కేశనకుఱ్ఱు, కాట్రేనికోన మున్నగు గ్రామంబులందును, గుంటూరుజిల్లాలోని పొన్నపల్లి అగ్రహారము, వంకాయలపాడు పొదిలివారిపాలెము మున్నగుగ్రామములలోను, విశాఖపట్టణము జిల్లాలోని విజయనగరము, బొబ్బిలి, పార్వతీపురము, సాలూరు, పాలతేరు, ఇంగిలాయపల్లి మున్నగుస్థలములయందును గానవచ్చెదరు.

## —: మహావిద్వాంసులు :—

వేదవేదాంగాదిచతుర్దశవిద్యలయం దసమాన మగుపాండిత్యము గడించి విఖ్యాతి నందినమహావిద్వాంసు లెంతమండయో యీశాఖలో నవతరించి శాఖకుమాత్రమే కాక బ్రాహ్మణజాతి కెంతయుఁ బ్రతిష్ఠ కల్పించిరి. అట్టిమహనీయులలోఁ గాకరపఱ్ఱుగ్రామవాస్తవ్యులగు బ్రహ్మశ్రీ అణివిళ్ళ వేంకటయజ్వగారొకరు, వీరు వేదవేదాంగములలోను షడ్దర్శనములలోను పారంగతులై వైదికధర్మనిష్ఠాగరిష్ఠులై యనేకము లగుక్రతువు లొనరించిరి. ఆపస్తంబాదిసూత్రకర్తలు స్పృశింపక విడిచినఉత్తరక్రతుతంత్రమ్ము నిరూపించుచు "అణివిళ్ల" అనుపేరుననొక శ్రౌతకల్పగ్రంథము నిర్మించిరి. ఈ గ్రంథమాంధ్రదేశముననేకాక యితరదేశమ్ములందును దిగ్దంతుల వంటి శ్రౌతవిద్వాంసులచేఁ బ్రమాణీకరించఁబడుచున్నది.

"అప్పారాయయశశ్చంద్రోదయము" అనునలంకారశాస్త్రగ్రంథ మొకఁడు రచించి నూజివీడుసంస్థానప్రభువులకుఁ గృతిగావించిరి. ఆగ్రంథము పరిశీలించినవారలకు వేంకటయజ్వ

గారి సర్వతోముఖ మగువైదుష్యము గోచరింపఁగలదు. వీరి నిరుపమపాండిత్యముం గని శ్రీవిజయనగరంసంస్థానాధిపతులు శ్రీనూజివీడుసంస్థానప్రభువులు మున్నగుమహారాజు లెందఱో అగ్రహారము లొసంగి సత్కరించిరి. ఆయగ్రహారములు "ఆణివిళ్ల" వారు, దౌహిత్రకుటుంబములోని వారగు "చర్ల" వారల యనుభవములోనున్నవి. వేంకటయజ్వగారి కుమారులు నారాయణశాస్త్రిగారు. వీరును తండ్రిగారిబలె సర్వతంత్రస్వతంత్రులు. "సాహిత్యకల్పద్రుమము" అనునొకఅలంకార శాస్త్రగ్రంథము వీరిచే రచియింపఁబడినది.

వీరితరువాత యీకుటుంబములో శ్రీసీతారామశాస్త్రి గారు మిగులవిఖ్యాతి గనిరి. వీరు తర్కవ్యాకరణాదిశాస్త్రములలో నసమానమగుపాండితి నార్జించి యహోరాత్రములయందెడ తెఱపిలేని పాఠప్రవచనము లాచరించినమహామహోపాధ్యాయులు. వైదికకర్మనిష్ఠులు. నిరతాన్నప్రదాతలు. ఉభయభాషా కవిత్వధురంధరులు. రామాయణకథను గైకొని సంస్కృతమున "సీతారామచంపువు" అనునొకచంపూగ్రంథము నాంధ్రమున "గణపతివిలాసము, జానకీపతిశతకము" మున్నగుగ్రంథములురచించిరి. తమపూర్వులగు వేంకటయజ్వగారి "అప్పారాయ యశశ్చంద్రోదయము"ను పరిష్కరించి విబుధలోకమునకందఁజేసిన కళానిధులు, ఆణివిళ్ళవారివంశమునని ట్లెందరో మహామహులుద్భవించి శాఖకొంతయుఁ బ్రతిష్ఠ సేకూర్చిరి.

వేంకటాధ్వరివిరచిత మగు "లక్ష్మీసహస్రము"నకు వ్యాఖ్యాన మొనరించిన వేదులరామచంద్రశాస్త్రిగారు, సాహి

త్యచక్రవర్తి బిరుదాంకితు లైన వేదులసోమనాథశాస్త్రిగారును కాకరపఱ్ఱునివాసులే. విరళతరం బగుసామవేదమును పారవ్రవచనములచే నిలువంబెట్టిన వేదమూర్తులు శ్రీవేదులనారాయణమూర్తి అవధానులుగారు, శ్రీబాపయ్యావధానులుగారు మున్నగుమహామహు లెల్లఁ గాకరపఱ్ఱువాస్తవ్యులు.

స్కంధత్రయాత్మక మగుజ్యోతిషమ్మునఁ బరిశ్రమించి పంచాంగరచనాధురంధరు లైన అకొండి వ్యాసమూర్తి సిద్ధాన్తిగారు, వ్యాసభారతకర్తలు సాహిత్యచక్రవర్తిబిరుదాంచితులు గవర్నమెంటువారి రాజమండ్రిఆర్ట్సుకాలేజీలో చిరకాలము సంస్కృతాంధ్రపండితపదవి నలంకరించిన అకొండివ్యాసమూర్తిశాస్త్రిగారు మొదలగుమహాపండితుల కెల్ల జన్మభూమి కాకరపఱ్ఱుగ్రామము. జగద్దేశపండితులును మహాకవులునగు చర్లభాష్యకారశాస్త్రి మహాశయులును కాకరపఱ్ఱుగ్రామము వారే. వీరుకాకరపఱ్ఱుగ్రామమునకేగాదు; యావదాంధ్రదేశమునకుఁ గల్పించినప్రతిష్ఠ వర్ణనాతీతము.

ఇఁక వింజరం గ్రామములోని మహావిద్వాంసులలో ఓలేటి రామచంద్రశాస్త్రిగారు, వేదుల నారాయణశాస్త్రిగారును ముఖ్యులు. పెద్దాపురంసంస్థానాధిపతు లగుచతుర్భుజతిమ్మజగపతిమహారాజావారును వీరును సమకాలములోనివారు.

నాఁడు మహాపండితు లొకరు పెద్దాపురంసంస్థానమునకు వచ్చి మహారాజసందర్శన మొనరించి "రాజా! మీయాస్థానములో సమర్థు లగువిద్వాంసు లుండిన నాతో శాస్త్రార్థమునకు రప్పింపుఁడు, లేదా జయపత్త్రిక నిడి వంపివేయుఁ డని

సాహంకారముగాఁబలికెను. అప్పటికిఆస్థానపండితు లెవ్వరును లేరు. అందుచే మహారాజు పండితునిం గని "పండితాగ్రణీ! మాయాతిథ్యము నేకరించుచు నాలైదురోజు లిట నుండుఁడు. మాసంస్థానపండితు లంతలో వచ్చెద"రని చెప్పెను. తర్వాత మంత్రివరునాహ్వానించి "మనసంస్థానగౌరవము నేఁటితో నంతరించునట్లున్నది. కావున మనరాజ్యభాగమునం గలపండితప్రకాండుల రావించి ప్రతిష్ఠ నిలుప యత్నింపఁదగు" నని చెప్పెను. మంత్రియు "దేవా! "విద్వత్కుంజర"మని ప్రసిద్ధి వడసినవింజరము మనరాజ్యములోనిదే. అందలి విద్వన్మత్తేభముల ముందు నిలువంగల పండితులు మనదేశమున నరుదు. వారినాహ్వానించి రప్పించినచో సంస్థానప్రతిష్ఠ సుస్థిరముగా నుండఁగలదు" అని చెప్పి వెంటనే గౌతమీతీరవిభ్రాజితము సకలవేదవేదాంగపరినిష్ఠిత పండితప్రకాండమండితంబును నగు వింజరంగ్రామమున కరుగుదెంచియాకాలంబున సర్వవిధములఁ బెద్దలగు, ఓలేటిరామచంద్రశాస్త్రిగారిని వేదుల నారాయణశాస్త్రిగారిని దర్శించి సగౌరవముగాఁ బెద్దాపురమునకుఁ దోడ్కొనిపోయి మహారాజునకుఁగానిపించెను. మహారాజును వారలం గాంచి యభ్యుత్థానాభివందనము లాచరించి తన సంస్థానగౌరవము నిలువఁబెట్టుఁడనిసవినయముగాఁ బ్రార్థించెను. వారును రాజసత్త్వమునకభయం బిడి ఆమహాపండితునితో శాస్త్రార్థమున కుపక్రమించిరి. ఒకరోజున రామచంద్రశాస్త్రిగారు రెండవరోజున నారాయణశాస్త్రిగారును వాదము చేయసాగిరి. ఒకవారమురోజులు వారికి వీరికి శాస్త్రార్థములు జరిగినవి. తొమ్మిదవరోజున రామచంద్రశాస్త్రిగారిచే నొం

డొకపూర్వపక్షముచేయఁబడెను. అంతలో సంధ్యాసమయ
మగుటచే నాఁటిసభ చాలించిరి. మఱునాఁటిసభలో సమాధా
నము చెప్పవలసియున్నది. ఆపూర్వపక్ష ముత్తరించుట
కశక్తుఁడై ప్రత్యక్షముగాఁ బరాభవమున కోర్వఁగొనలేక యా
పండితుఁడు నాఁటిరేయి నొరులకుఁదెలియనివిధమున నదృశ్యుఁ
డాయెను. మఱునాఁడు సభాసమయమున కావిద్వాంసుఁడు
రామింజేసి పరిచారకు నాతనివసతిగృహమునకంపఁగా నిర్మ
నుష్యం బగుతన్నివాసముం గనిమహారాజునకు విన్నవించెను.
శ్రీతిమ్మజగపతి మహారాజువారమితానంద మంది వింజరం
పండితుల మిగులఁ గొనియాడి "మాసంస్థానప్రతిష్ఠ నిలువఁ
బెట్టిన తమ కీరాజ్యమంతయుధారవోసినను ఋణము దీరదు.
కాన నాయందు దయయుంచి తమ కేయది కావలయునో
కోరికొనుఁడు"అని ప్రార్థించెను.

"మహారాజా విద్యాధనుల మగుమా కేమి కావలయు
ను? పెద్దలార్జించినవృత్తి కొంత కలదు. దానితోడనే దిన
కృత్యము వెళ్ళిపోవుచున్నది. బ్రాహ్మణున కధికసంపన్నత
వలవదు. సంపద యతిశయించినకొలదియు భావిసంతతివార
లు కులానుగతము లగువిద్యలయం దనాదరము వహించెదరు.
దానంజేసిబ్రాహ్మణత్వమునకే భంగము వాటిల్లును. కావున
మా కేమియు వలదు." అని యామహావిద్వాంసులు వచించిరి,
మహారాజు వారినిస్పృహత కెంతయు సంతసించి "మీ కక్క
ఱలేకయున్నను నన్ను నావంశమును ధన్య మొనరించుటకై
నను మీరేదేని పరిగ్రహింపకతీఱ"దని బలాత్కరించి, కొంత
భూవసతియు కొంతధనము నొసంగిసత్కరించిరి. ఆభూములు

రామచంద్రశాస్త్రిగారి కుటుంబములోని వారును, నారాయణ శాస్త్రిగారి వంశములోనివారలును నేఁటికి ననుభవించుచు న్నారు. మంత్రశాస్త్రమునందుఁ బాదుకాంతదీక్షాపరులై దేవీ సాక్షాత్కార మంది నాస్తికులను సైత మాస్తికులఁగామార్పఁ జాలినతపోనిధు లగువీరయ్యగారు రామచంద్రశాస్త్రిగారి ప్రపౌత్రులు. ఓలేటి రామచంద్రశాస్త్రిగారి తమ్ములు చంద్రశే ఖరశాస్త్రిగారు. వీరికుమారులు దక్షిణామూర్తిశాస్త్రిగారు, నారాయణశాస్త్రిగారు. వీరుభయులు శాస్త్రసాహిత్యము లలో గడితేరి తగినంతసంగీతపాండితి గలవారై వాల్మీకిరామా యణము పురాణము చెప్పుచుండువారు. రామాయణమందలి విశేషార్థములు చెప్పుటలో నాకాలమున వీరిని మించినవారు లేరు. అందుచే వీరు "బాలవాల్మీకు"లని ప్రసిద్ధి వడసిరి. పీఠి కాపురసంస్థానకవులు వెంకటరామకృష్ణకవులలో నొక రగు వెంకటరామశాస్త్రిగారు నారాయణశాస్త్రిగారి మునిమను మలు.

వింజరమునందుఁ గొంతకాలము శాస్త్రజ్ఞు లగుపండి తులసంఖ్య తగ్గినది. కాని వేదాధ్యయనంబున దిట్టలైనమహా నుభావు లెంతమందియో యవతరించి గ్రామప్రతిష్ఠ నినుమడిం పఁజేసిరి. అట్టివారిలో బ్రహ్మశ్రీ పాలంకి వీరావధానులుగారు బ్ర॥ శ్రీ రామడుగుల వెంకటసుబ్రహ్మణ్యసోమయాజిగారు మున్నగువారు ముఖ్యులు.

సంగీతవిద్యయందు బ్ర॥శ్రీ వేదులశంకరదాసుగారునిరు పమానులు. వీరు తంజావూరు మున్నగుసంగీతవిద్యాస్థానముల

కరిగి చిరకాల మటఁ బరిశ్రమించి కూలంకషమగు పాండిత్య మార్జించిన మేధానిధులు.

జ్యోతిశ్శాస్త్రమున (బ్ర॥శ్రీ) ఆకొండి వ్యాసమూర్తి సిద్ధాన్తిగారు సుప్రతిష్ఠితులు. వీరు పాలకొల్లుమున్నగు గ్రామములలో సంపన్ను లగు వైశ్యశిఖామణుల కెందఱకో జాతకములు వ్రాసి మిగుల సత్కారము లందిరి. పల్లిపాలెంగ్రామములోని శ్రీవ్యాసేశ్వరాలయ ప్రతిష్ఠకు వీరే హేతుభూతులు. పాతిక ముప్పదిసం॥రము లేకధాటిగా వేదశాస్త్రపాఠశాలలు నిర్వహించి పరశ్శతవిద్యార్థులకు విద్యాదాన మొసర్చిన ధన్యజీవనులు (బ్ర॥శ్రీ) పాలంకి పేరుశర్మగారును, వింజరంగ్రామస్థులు. ఇట్లెందఱో మహనీయులు వింజరంగ్రామమున జన్మించి యచంచలంబగు విఖ్యాతి నార్జించిరి.

ఆలమూరుగ్రామమ్మునఁ గూడ విద్వాంసులు నన్నప్రదాతలు నగువా రెంతమందియో కలరు. వారిలో నృసింహదేవర పేరుశాస్త్రిగారు సుప్రతిష్ఠితుఁ:. శాస్త్ర సాహిత్యవేత్తలు. నిరతాన్నదాతలు. అనుదినము ఏగురు బ్రాహ్మణులు పంక్తిని లేనిదే భుజించువారు కారు. వారింటి కతిథులు రాని రోజుండెడిది కాదు. ఆ ట్లెపుడేని రాకపోవుట తటస్థించినయెడల గ్రామములోని బ్రాహ్మణులను బిలిచి పంక్తి నిడికొని భుజించెడివారు. జీవితాంత మట్టినియమమును బాటించి నిర్వహించుకొన్న ధన్యజీవనులు ఈ పేరుశాస్త్రిగారు ఆలమూరులో భైరవేశ్వరస్వామివారి యాలయము ప్రతిష్ఠించి ధూపదీపనైవేద్యాదికములకై భూవసతి గూడ నొసంగినమహాదా

తలు. వీరి వితరణసౌజన్యాదిక మెంతయు శ్లాఘనీయము. వీరి ద్వ్యాముష్యాయణపుత్రు లగు వెంకటశాస్త్రిగారును తండ్రిగారివలె నిరతాన్నదాత లనుకీర్తి గడించిరి. వెంకటశాస్త్రిగారనపత్యులైనకతమున ద్విభాష్యం వెంకటేశ్వర్లుగారి పెత్తల్లి కుమారులగు పేరుశాస్త్రిగారిని దత్తపుత్రులుగా స్వీకరించిరి. పేరుశాస్త్రిగారు నిరర్గళసాహితీధురంధరులై నూటులకొలఁదిశిష్యులకువిద్యాదాన మొనరించి సువిశాలయశంబు గడియించిరి. అర్ధరాత్ర మపరరాత్ర మనుమాట లేక యెపుడెంతమంది యతిథులు వచ్చినను గడుంగడుభక్తిశ్రద్ధలతో నాదరించి మృష్టాన్న మొసంగినవీరి యన్నదానతత్పరత వర్ణనాతీతము. ఆహా! ఇట్టిమహాపురుషులుదయించుటంజేసియే భరతఖండము సర్వదేశములకుఁ దలమానికముగాఁ బ్రకాశింపఁ జొచ్చినది.

పశ్చిమగోదావరిజిల్లాలోని కడియెద్దగ్రామమందును బూర్వకాలమునుండియు ఆరామద్రావిడులు కొంతమంది నివసించుచుండిరి వీరిలో చర్లవారు సుప్రసిద్ధులు. వీరిపూర్వులెవరో పెరుమాళ్లస్తంభ మాగ్రామమునఁ బ్రతిష్ఠఁగావించిరి. నాఁటినుండియు "పెరుమాళ్ల" అను పేరితో వ్యవహరింపఁబడఁ జొచ్చిరి. వీరిలో బ్రహ్మయ్యశాస్త్రిగారు మిగుల పేరువడసిన విద్వన్మణులు. శ్రీశాస్త్రిగారు కాశీపురములో 20 సం॥రములుండి అటసుప్రసిద్ధపండితు లగురాజారామశాస్త్రిగారియొద్ద తర్కము, వ్యాకరణము మున్నగుశాస్త్రములం జదివి మహాపండితులై స్వదేశమున కేతెంచి గౌతమీతీరమునం గల "ధవళేశ్వరము"న గురుకులాశ్రమపద్ధతిగా నొకపాఠశాలపెట్టి

పరిష్కృతంబు లగునంతేవాసిగణంబులకు విద్యాదాన మొనరిం చిరి, మన దేశములోని జమీందార్లను సంపన్నగృహస్థులను ప్రోత్సహించి వారిసాహాయ్యమున నన్నసత్రము గూడ నిర్వ హించుచు విద్యార్థుల కిల్లిల్లు తిరిగి వారములు చేసికొను శ్రమ లేకుండఁజేసిరి. సుప్రసిద్ధమహాకవు లగు 'తిరుపతి వేంకట కవులు' బ్రహ్మయ్యశాస్త్రిగారికి ప్రధానశిష్యులు. శ్రీశాస్త్రి గారివద్ద చదివి యుత్తీర్ణు లగుశిష్యులు సంఖ్యాతీతులు. అట్టివా రిలో రామడుగులవీరయ్యశాస్త్రిగారు సుప్రసిద్ధులు. వీరుశా కరపల్లిగ్రామమున వసించి యనేకులకు వ్యాకరణశాస్త్రము బోధించిరి.

విశాఖపట్టణంజిల్లాలోఁ గూడ ఆరామద్రావిడులందు సుప్రసిద్ధులగువిద్వాంసు లెంతమందియో కలరు. అందు విజ యనగరనివాసు లగు బ్ర॥శ్రీ కొల్లూరి కామశాస్త్రిగారు ము ఖ్యులు. వీరు విజయనగరమహారాజులలో నగ్రగణ్యులు విద్యా భోజులు నైనశ్రీమదానందగజపతి మహారాజులుం గారికి సమ కాలికులై వారిచే ననేకములగు సత్కారంబు లందియుండిరి. సకలవిద్యలకు వీరిముఖమునాట్యరంగము. వీరు వీణాతంత్రులు సారించి వాయించుచో కేవల మాసరస్వతియే పుంభావ మానె నని యనుకొనుచుండిరి. శ్రీశాస్త్రిగారుమహామ హోపాధ్యాయబిరుదాంచితు లై నిన్నమొన్నఁ గీర్తిశేషు లైన శ్రీతాతాసుబ్బరాయశాస్త్రిగారికి ఉత్తరమీమాంసలో (వే దాంతశాస్త్రము.) గురువులు. వైయాకరణసార్వభౌము లగు భాగవతుల హరిశాస్త్రిగారి వాక్యార్థచంద్రికను పరిష్కరించి యావిష్కరించిన మహావిద్వాంసులు. శూద్రకమలాకరము

మున్నగు ధర్మశాస్త్రగ్రంథముల రచియించి లోకోపకార మొనరించిన మహర్షిశిఖామణులు. మహామహోపాధ్యాయుల కాచార్యత్వ మధిగమించిన యీవిద్వత్సార్వభౌముల ప్రజ్ఞాదిక మెట్టిదో ప్రాజ్ఞలోకము గుర్తింపఁగలదు. విశాఖపట్టణం జిల్లా చోడవరము వద్ద నున్న ఫకీరుసాహేబుపేటలో బ్రహ్మశ్రీ ఆణివిళ్ళ వెంకటశాస్త్రిగారు, వీరికుమారులు నారాయణ శాస్త్రిగారు వేదములోను శ్రౌతక్రియానిర్వహణములోను సిద్ధహస్తులు. వీరు అనకాపల్లిలో సుప్రసిద్ధగృహస్థులగు వేదుల వారికి గురువులు. బొబ్బిలిలో సామవేముల బుచ్చన్నావధానులుగారు సామవేదములోను ఔద్గాత్రములోను మహా విద్వాంసులు. లింగంవలస అగ్రహారములో ఆకొండి బుచ్చన్నావధానులుగారు వేదవిద్యాధురంధరులు. మఱియు చిట్టాయివలసలో పంతుల బ్రహ్మన్నశాస్త్రిగారు మున్నగువార లెంత మందియో మహావిద్వాంసు లుండెడివారు. పాలతేరు భీమవరంలో వేదుల లక్ష్మణశాస్త్రిగారు సంగీతశాస్త్రమున నద్వితీయు లని ప్రసిద్ధిఁ బడసిన గాయకశిఖామణులు. ఆరామద్రావిడులలో నిట్లెందఱో మహావిద్వాంసులు పూర్వకాలంబుననే కాక నేఁడునుంగూడగలరు. నేఁటికాలము విద్వాంసులంగూర్చి వివరించకున్నను లోకమే యెఱుంగఁగల దని వారిపాండిత్యాదిక మిందు స్పృశింపక విడువఁబడినది.

## —♦ జగద్గురుపీఠాధిపతులు ♦—

జగద్గురుపీఠ మలంకరించిన పరమహంసపరివ్రాజకులు గూడ ఆరామద్రావిడశాఖలోఁ గొందఱు కలరని చెప్పుటకు

మిగులగర్వపడుచుంటిని. సకలవిద్యలయం దాటితేరి యిహా
ముత్రఫలభోగవిరాగము, నిత్యానిత్యవస్తువివేకము, శమాది
షట్కసంపత్తి, తీవ్రముముక్షుత్వము అనుసాధన చతుష్టయసం
పత్తి కలిగినజ్ఞానిశిరోమణులకుఁ గాని యీపీఠమధిష్ఠింపరానిది.
షణ్మతస్థాపనాచార్యులగు నాదిశంకరభగవత్పాదులవారు
మొదలు' అట్టిమహామహులేజగద్గురుపీఠ మలంకరించి యాపీఠ
గౌరవమును స్థిర మొనరించిరి. నేఁడుగూడ కామకోటిపీఠాధి
పతులు శృంగేరిజగద్గురుపీఠాధిపతులు మున్నగువార లాతగ
గతిలోనివారే. మున్ను జగద్గురు పీఠమలంకరించిన యారామ
ద్రావిడులలో నొకఋ వేదులవంశజులు. రెండవవారు ఆ
కొండివంశజు లనియుఁ దెలియనగును. వీరుభయులును గాకర
పట్టుగ్రామవాస్తవ్యులు వీరధిష్ఠించిన నాఁటినుండియు నాజగ
ద్గురుపీఠమునకుఁ గాకరపర్తి పీఠ మని కూడ వ్యవహార మేర్పడి
నది. అసలాపీఠము హంపీలో శ్రీజగద్గురువిద్యారణ్యయతీంద్రు
లచే నేర్పాటుచేయఁబడినవిరూపాక్షపీఠము.

## —: మహాకవులు :—

ఆరామద్రావిడశాఖలోఁ జిరకాలమునుండియు పండి
తులగు కవు లెంతమందియో కలరు. సంస్కృత కవితయందు
ఆణివిళ్ల వేంకటసోమయాజులుగారు, ఆణివిళ్ల నారాయణశాస్త్రి
గారు, చర్ల వెంకటశాస్త్రిగారు, ఆణివిళ్ల సీతారామశాస్త్రి
గారు, చర్ల భాష్యకారశాస్త్రిగారు, మున్నగువారు ముఖ్యులు
ఆంధ్రకవులలో చెళ్లపిళ్ళ సర్సకవిగారు, అల్లంరాజు రామకృష్ణ
కవిగారు, యీసుబ్రహ్మణ్యకవిగారు, కాకరప ్తి బుచ్చిపాత్రి

కవిగారు, యీశ్వరకృష్ణకవిగారు, సుప్రసిద్ధులు. వీరలచరిత్రము క్రీ॥ శే॥ కం॥ వీరేశలింగంపంతులుగారి ఆంధ్రకవులచరిత్రము చూచినచో బోధపడఁగలదు.

తత్త్వసంగ్రహరామాయణ కర్తలగు ఆకొండి వేంకట కవిగారు, వఝ్ఝల అన్నభట్టుగారు, విచిత్రరామాయణాద్యనేక గ్రంథకర్తలగు నరసింహదేవర వెంకటశాస్త్రిగారు, ఆంధ్ర వ్యాసభారత కర్తలగు ఆకొండివ్యాసమూర్తిశాస్త్రిగారు, ఆంధ్రసూత్రభాష్యకర్తలు పురాణపండ మల్లయ్యశాస్త్రిగారు, గయోపాఖ్యానాదిక గ్రంథకర్తలు చిలకమర్తి లక్ష్మీనరసింహకవి, పీఠికాపుర సంస్థానకవులైన వేంకటరామకృష్ణకవులు మున్నగువారలెల్ల రారామద్రావిడశాఖకుఁ జెందినవారలే.

అటు గద్వాలిటుచెన్నపట్టణము మధ్యంగల్గుదేశమ్మున నంగలసంస్థానములందుఁ బూజఁగొని కింకవీంద్రఘటాపంచాననులై దిగ్విజయంబొనర్చిన సుప్రసిద్ధశతవధానులు తిరుపతి వేంకటకవులలో నొకరగు బ్ర॥ శ్రీ శతావధాని చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారు ఆరామద్రావిడశాఖకుశిఖామణులు.

—: ఆయుర్వేదవైద్యులు :—

ఆయుర్వేదవైద్యమున శ్రీయారామద్రావిడశాఖ పుట్టినిల్లనియే చెప్పవచ్చును. ఈశాఖలో నున్నంతయాయుర్వేద వైద్యప్రచుర్య మేశాఖవారిలోఁ గాని లేదని చెప్పుచో నతిశయోక్తి గనరాదు. కులక్రమముగాఁ బెక్కుతరంబులనుండి వైద్యవిద్యను గుత్తకుఁగొన్నకుటుంబము లీశాఖలో నెన్నియో కలవు. శాస్త్రజ్ఞానము అనుభవము మేళవించినపుడే వైద్యవిద్య

రాణించును. అనుభవ రహితమగు శాస్త్రజ్ఞానము గాని శాస్త్రజ్ఞానరహితమగు ననుభవము గాని నిరుపయోగములు. ఈ రెండుశక్తులు గలిగినవైద్యశేఖరు లారామద్రావిడశాఖలో లెక్కకు మిక్కిలిగాఁ గలరు.

అమలాపురం తాలూకా కేశనకుఱ్ఱు, పోలవరంగ్రామములలోనున్న "అకొండి"వారి కుటుంబములోఁ గొన్నితరములనుండి యాయుర్వేద మనుశ్రితముగా వచ్చుచున్నది. ప్రకృతచరిత్రపురుషులగు ద్విభాష్యం వెంకటేశ్వర్లుగారికుటుంబములోఁ గొన్నితరములనుండి యాయుర్వేద మనుశ్రితముగా వచ్చుచున్నసంగతి ఈచరిత్రగ్రంథము చదివినవారి కెల్ల బోధపడును.

తుల్యారామేశ్వరం గ్రామవాస్తవ్యులగు శాకరపర్తి వారివంశములోఁగూడఁ గొన్నితరములనుండి వైద్యవిద్య యవిచ్ఛిన్నముగా విలసిల్లుచున్నది. వారిలో బాపన్నగారు పెక్కుసంస్థానములలో వైద్యత నొనరించి విశేషములగు సన్మానము లందిరి. వారియనంతరము వారికుమార్తెలలో నొక తైన కోటబాయమ్మగారు, కిర్లంపూడి, లక్ష్మీనరసాపురం మున్నగు సంస్థానముల మహారాణులచే మిగుల గౌరవించఁబడిరి. కాట్రేనికోన గ్రామవాస్తవ్యులగు అణివిళ్ళవారి కుటుంబములోఁ గూడ కొన్నితరములనుండి యాయుర్వేదవైద్యము నిరంతరముగాఁ గొనసాగుచున్నది.

మఱియు, పాలంకివారు, మధునాపంతులవారు, ఓలేటివారు, ముద్దువారు, నాగాభట్లవారు, అల్లంరాజువారు, దుడ్డు

వారు, పంతులవారు భైరవభొట్లవారు, కోటవారు, కూచిభొట్లవారు, మున్నగుకుటుంబములలో నెంతమందియో సుప్రసిద్ధులగు వైద్యులు కలరు. ఇట్లారామద్రావిడశాఖలోని పెక్కుకుటుంబములలో పురాతనకాలంబునుండియుఁ బ్రచురతరముగా నాయుర్వేదవైద్యము వచ్చుచున్నది. వీరెల్లరు శాస్త్రజ్ఞానసహిత మగునసుభవములో దిట్టలని పేరు గన్నవారే. వ్యక్తులప్రజ్ఞాదికము వివరింపఁ బూనినచో గ్రంథవిస్తారమగునని యెంచి కుటుంబనామములు మాత్రమే యుల్లేఖించితిని. ఆయీవిషయము లెల్ల సూత్రప్రాయముగా మద్విరచిత మగు శ్రీధన్వంతరిచరిత్రమునందలి యీక్రిందిపద్యముచేఁ దెలుపఁబడినవి.

శా. శ్రీమంతం బగునాంధ్రదేశమున వాసింగన్నవిప్రాన్వయ
గ్రామంబందు శ్రుతిస్మృతిప్రథితశాస్త్రజ్ఞాననిష్ణాత మా
రామద్రావిడశాఖ యొందు కరమున్ బ్రఖ్యాత మైసర్వవి
ద్యామాన్యంబయిసత్కవీడ్యమయి పెంపారున్మహోదారమై.

శ్రీ ధ. చ. ౧ ఆ 38 వ॥

---

శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి
రాజమహేంద్రి

ఓమ్

శ్రీమద్ధన్వంతరయేనమః

# శ్రీ ద్విభాష్యం వెంకటేశ్వర్లుగారి జీవిత చరిత్రము

## —♦ 1వ ప్రకరణము ♦—

(ద్విభాష్యం వంశము—పూర్వపురుషులు— ద్వి॥ వెంకటేశ్వర్లుగారి పితృ మాతృ వంశములు.—)

సకలవిద్యాసనాథులగు మహావిద్వాంసుల కెల్లఁ బుట్టినిల్లగు నారామద్రావిడశాఖలోని సుప్రసిద్ధకుటుంబములలో ద్విభాష్యంవారొకరు. వీరిది వాలఖిల్యగోత్రము. ఆపస్తంబ సూత్రము. కృష్ణయజుశ్శాఖ. ఈవంశస్థులు మహాభాష్యము శారీరకమీమాంసాభాష్యము, అనుభాష్యద్వయము పారప్రవచనములుచేయువారగుటచే "ద్విభాష్యం" అను గృహనామమేర్పడియుండెనని ప్రతీతి. ద్వివేది, చతుర్వేది, పురాణం, భారతము, మున్నగునింటిపేరులు గూడ నిట్లేఏర్పడియున్నవి. ఈద్విభాష్యంవారి పురాతనమగునభిజనము కాకరపఱ్ఱు.

## —♦ పూర్వపురుషులు ♦—

మూలపురుషులు "పట్టెయ్య"గారు. వీరియాత్మజులు కృష్ణయ్యగారు. పాపమ్మగారు కృష్ణయ్యగారి ధర్మపత్ని. ఈదంపతుల యనుంగుకొమరుఁడు బుచ్చెయ్యగారు. వీరు వైద్యవిద్యలో మిగులఁ బరిశ్రమించి యపార మగునుభవము తోడుగా నెన్నియోజమీందారుకుటుంబములలో వైద్యముచేసి సత్కా-

రము లందిరి. ఆలమూరుప్రాంతములలో విశేషించి వైద్య వ్యాప్తి కలుగుటం జేసి యీబుచ్చయ్యగారు కాకరపట్టునుండి ఆలమూరుసివారు"కొత్తూరు"గ్రామమునకు నివాసముమార్చిరి. శ్రీధన్వంతరిచరిత్రమునందు వీరివైదుష్యాదిక మీక్రిందిరీతిగా వర్ణింపఁబడినది —

శా. ఆయుర్వేదవిదగ్రణీమహితుఁడై యాంధ్రావనీభాగవి
స్ఫాయద్రాజసభాన్తరాళముల భైషజ్యంబు దీపింపఁగా
నీయుర్వీతలమం దనన్యసులభాహీనప్రతిష్ఠాస్పదుం
డై యెంతేనియుఁ దేజరిల్లె నలబుచ్చయ్యాఖ్యభూదేవుఁడున్.

అనసూయతోఁ దులఁదాగఁజాలుశీలవతి బౌనమాంబిక యీయన సహధర్మచారిణి. కృష్ణయ్య, వెంకయ్య, సుబ్బయ్య, అనుపుత్రులు, గవరమ్మ, సుబ్బమ్మ, సోమమ్మ, అనుపుత్రికలును వీరి సంతతి అందు జ్యేష్ఠులగు కృష్ణయ్యగారి భార్య రామమ్మగారు, ఈదంపతులకుఁ బురుషసంతతి లేదు. వెంకమ్మ బౌనమ్మ అను కుమార్తెలు మాత్రమే. పెద్దకూతురు వెంకమ్మగారు చింతలూరు నివాసులగు పెద్దింటిపెదరామన్నగారిభార్య. రెండవతనయ బౌనమ్మగారు పెద్దింటిచినరామన్నగారి ధర్మపత్ని. వీరలసంతతివారు చింతలూరిలోఁ గలరు.

బుచ్చయ్యగారి తృతీయపుత్రులు సుబ్బయ్యగారు. తుల్యారామేశ్వరం వాస్తవ్యులగు బ్ర॥శ్రీ॥ అల్లంరాజు సుబ్బయ్యగారి కుమారితనరసమ్మగారు వీరిభార్య, కృష్ణయ్య అను కుమారుఁడు బాపనమ్మ అనుకూతురును వీరిసంతతి. బ్ర॥ శ్రీ అల్లంరాజు తమ్మయ్యశాస్త్రిగారి మూఁడవకుమార్తె దుర్గమ్మ

గారు కృష్ణయ్యగారియర్ధాంగి. వీరిపుత్రసంతతి అన్నపూర్ణ, పుత్రులు వెంకయ్య బుల్లిసుబ్బారాయుడుగారలు. తుల్యారామేశ్వరం వాస్తవ్యు అగుఅల్లూరిరాజు వెంకట్రాయుడుగారి రెండవకుమారుడు సూర్యనారాయణగారు అన్నపూర్ణమ్మగారి భర్త.

వెంకయ్య అను పెద్దకుమారుని భార్య చింతలూరునివాసులగు పెద్దింటికృష్ణమూర్తిగారి కుమారిత యగుబానమ్మ. ఈదంపతులకు సంతానము లేదు. రెండవకుమారుడగు బుల్లిసుబ్బారాయుడుగారి భార్య పెద్దాపురంవాస్తవ్యులు చామర్తి కామయ్యగారి జ్యేష్ఠపుత్రిక యగుమహాలక్ష్మి. వీరలకు కామేశ్వర్రావు ఏకైకతనయుడు. ఈపుత్రుడు పుట్టినయచిరకాలమునకేబుల్లిసుబ్బారాయుడుగారు కీర్తిశేషులైరి. పుత్రుడగుకామేశ్వర్రావుగూడ యవివాహితుడుగానే గతించెను. ఇంతతో సుబ్బయ్యగారి వంశ మంతరించినది.

ఇక సుబ్బయ్యగారికుమార్తె యగుబాపనమ్మగారు జట్లపాలెంనివాసులు వరదాశేషయ్యగారి భార్య. ఈమె కాపురమునకు వెళ్ళిన కొద్దికాలములోనే భర్త గతించెను. బాపనమ్మగారు సహోదరీమాతృసజీవులై వెంకటేశ్వర్లుగారి పోషణమందుచున్నారు. ఈమె కిపుడు 90 సంllరములు వయస్సు. వెంకటేశ్వర్లుగారి వంశప్రాచీనచరిత్ర యీమెవలనగూడ కొంత తెలిసికొనబడినది.

బుచ్చయ్యగారి ప్రథమపుత్రిక యగుగవరమ్మగారు ఆలమూరునివాసులు కామవరపువీరయ్యగారి భార్య.

రెండవ కొమార్తె సుబ్బమ్మగారు ఆలమూరునందు దుడ్డు రాజేశ్వర శాస్త్రిగారి సహధర్మచారిణి.

సోమమ్మగారను మూఁడవకొమార్తె ఆలమూరునందలి కామవరపువారి కోడలు. భర్త వెంకటాద్రియయ్యగారు.

బుచ్చయ్యగారి ద్వితీయపుత్రులు వెంకటేశ్వర్లుగారి జనకులునగు—— **వెంకయ్యగారు**

తమతండ్రిగారియొద్ద వైద్యశాస్త్ర మభ్యసించి విశేష మగునను భవము గడియించి యాయనుభవము తోడుగాఁ గొన్ని నూతనౌషధయోగంబులు కనిపెట్టఁగలిగిరి. ద్రవ్యగుణమందును రోగనిదానమందును బూర్ణ మగుప్రజ్ఞ యలవఱచుకొన్న వైద్యశేఖరుఁడు గ్రంథస్థ మగునౌషధయోగముల పరిభావ మెఱింగి యుపయోగింపఁజాలుటయే కాక వ్యాధినివారణమున కనుగుణ మగునూతనౌషధములం గూడ సిద్ధపఱచఁగలుట కెట్టిసందియము లేదు. వెంకయ్యగా రట్టిప్రజ్ఞావంతులగుటచే "శ్లేష్మగజాంకుశము""మృతవంధ్యాసంజీవని" మున్నగునూతనౌషధముల నావిష్కరింపఁగలిగిరి. రామచంద్రపురము,ఆలమూరు, నందంపూడిఅగ్రహారము,కాపవరము, యనమదల మున్నగుగ్రామములలోను, విశాఖపట్టణము జిల్లాయందలి ఉరట్ల మున్నగుచోటులందును వెంకయ్యగారికి వైద్యవ్యాప్తి హెచ్చుగా నుండెడిది. వీరు వైద్యమునకై యెటకేనియు "లాలకీ" నెక్కి వెళ్ళుచుండెడివారు.

వెంకయ్యగారిప్రథమకళత్రము బాపనమ్మగారు. ఈమె దుడ్డువారి యాఁడుపడుచు. సన్నిహితు లగుబంధుగు లెల్లరు

చింతలూరులో నున్నందునఁ బరస్పరసాహాయ్యమున కవకాశ ముండునని యెంచి వెంకయ్యగారు తమప్రథమభార్య కాపుర మునకు వచ్చుటతోడనే కొత్తూరునివాసము మార్ప సంక ల్పించిరి. చింతలూరున గృహనిర్మాణ మారంభమైనది. అం తలో దైవవశమునఁ గళత్రవియోగము తటస్థించెను. బంధు మిత్రుల సమాశ్వాసనముచేఁ గళత్రవియోగదుఃఖ మెట్లో దిగమ్రింగి గృహనిర్మాణము పూర్తిసేయునంతట తీపఱ్ఱు గ్రా మవాస్తవ్యు లగు బ్రాశ్రీ కోట వెంకటాచలంగారి మూఁడవ కుమార్తె యైన పూర్ణమ్మగారిని వివాహమాడుటయు నా నూతనవధూమతల్లికతో నూతనగృహప్రవేశము గావించుట యు జరిగినది. ఇట్లు వెంకయ్యగారి కాలములోనే ద్వితీయ భార్యాం వారికి చింతలూరు నివాసముగా నేర్పడినది.

## ♦ చింతలూరు సరిహద్దులు ♦

చింతలూరు తూర్పుగోదావరిజిల్లా రామచంద్రపురం తాలూకాకు చెందియున్నది. ఈగ్రామమునకు తూర్పున నంది పూడి, వెదురుమూడి గ్రామములు. దక్షిణమున గౌతమీతీర మగుఆలమూరుగ్రామము. పశ్చిమమునఁ గలవచర్ల, పెనికేరు మున్నగుగ్రామములు, ఉత్తరదిశను పెదపళ్ళగ్రామము కలవు. మదరాసు దక్షిణమహారాట్టారైల్వేకు సంబంధించిన ద్వార పూడిస్టేషను చింతలూరునకు ఉత్తరదిశను 10 మైళ్ళ దూర ములో నున్నది. సత్యసంకల్పు లగు వెంకయ్యగారు చింతలూరు నకు నివాసముమార్చిన సుముహూర్త మెట్టిదియో కాని వారి కుటుంబ మున్నతి నందుటయే కాక గ్రామమునకు, కూడ

ఊహా కందరానిమహోన్నతి సేకూరినది. ఏమూరుమూల యందో ఊరుపేరులేని చింతలూరు నేఁడు భారతదేశ మెల్లక డలఁ బేరుమోఁయుటకుఁ గారణ భూతులు వెంకయ్యగారి కుమారులగు వెంకటేశ్వర్లుగారే కదా! ఈవిషయమే శ్రీధన్వంతరిచరిత్రములో నిట్లు వ్రాయఁబడెను.

ఉ. ఆరయఁ జింతలూరుపురమయ్యది యేసుకృతంబుచేసెనో?
యారహి నేపురంబు గన నెల్లజనుల్ సతతంబు "చింతలూ
ర్వారిమహౌషధమ్ము"లని వాడుక సేయుచునుందురుగా దెయీ
భూరితరప్రతిష్ఠకును మూలము మత్కృతినాథుఁడే గదా.

వెంకయ్యగారు చింతలూరున నివసించుచు నద్వితీయ మగుప్రతిభ తోడుగా ననేకస్థలములలో వైద్యముచేసి సత్కారము లందసాగిరి. వీరి వైద్యప్రతిభను గుఱించి మచ్చున కొక యితిహాసము. చింతలూరునకు సమీపమందలియొక గ్రామములో నొకరికి జ్వరము రాఁగా వెంకయ్యగారిచే వైద్యము చేయించుకొనుచుండిరి అత్తఱి నొండొక వైద్యుఁ డట కరుదెంచి రోగిబంధుగులతో వెంకయ్యగా రొనరించుచికిత్స సరిగా లేదని నుడివెను. అందుపై నుభయులకును వాదోపవాదములు జరిగినవి. అపుడు వెంకయ్యగారా వైద్యునిం గని "వాదిదౌర్బల్యము గాని వాదదుర్బలత్వముండదు. అంతము లేని యీ వాద మింతతో వదలి చికిత్సకుఁగడంగుట లెస్స. కావున నీతనికి మనముభయులము చెఱియొక పార్శ్వమునఁ జికిత్సచేయుదము. నీ వేపార్శ్వము గైకొనెదవో తెలుపు" మనిరి. పురుషునకు దక్షిణ పార్శ్వము బలిష్ఠము గానుండును గాన యాపార్శ్వమునఁ జికిత్సితము సేయుట దుర్ఘట మని

మెంచి యావైద్యుఁడు వామపార్శ్వమును గైకొనెను. వెంక య్యగారు తమకై విడువంబడిన దక్షిణపార్శ్వమున "అర్ధ నారీశ్వర రసము" అనునౌషధ మొసంగి మూఁడురోజులలో జ్వరము నివారించిరి. వామపార్శ్వమున నా వైద్యుఁడువార మైనను జ్వరము తగ్గింపలేకపోయెను. అపుడు రోగిబం దుగు లావైద్యుని సాగనంపి వెంకయ్యగారిచేతనే చికిత్ససేయిం చిరి. వ్యాధి నివారణ మైనమీఁదట గొప్పగా సత్కరించిరి. ఇ ట్లెన్ని యోపట్టులఁ బట్టుదలతోఁ జికిత్సగావించి గొప్పసన్మా నంబులు గైకొనిరి. శోఫవ్యాధులను, కాసశ్వాసలను నివారిం చుటలో వీరిది పెట్టినది పేరు. వెంకయ్యగారి ప్రజ్ఞాదికము శ్రీధన్వంతరి చరిత్రములో నిట్లు వ్రాయఁబడినది.

చ. తనసమకాలమందు విదిత బహుపేరును గన్నవైద్యు లెం
దును దమ కంక నేరదని దూరమునన్ విడనాడురోగముల్
ఘనతర వైద్యపద్ధతి నఖండితనైపుణిఁ బాయఁ జేయు న
య్యనఘునిప్రజ్ఞయెంతకొనియాడినఁ దృప్తి జనింపదేకదా?

సీ. అంచెబోయీలతో నలరారులాలకీల్
ద్వారమ్ముననె జెలువారియుండ
నాస్థానములనుండి యాహ్వానపత్రముల్
దోకొని వచ్చినదూత లుండ
నౌషధసేవకై యాయాప్రదేశమ్ము
లందుండి వచ్చినయతిథు లుండ
నతిగూఢవిషయమ్ము లభ్యసింపఁగవచ్చు
నాయురాగమవేత్త లట్టె యుండ




గీ. నందఱకు నన్నిరూపంబు లందెనో యన
నుత్తరంబులొసంగుచు నొకట విసుగు
లేక తనయంగణ మ్మొకలోకపాల
సభగ వెంకయధీరుండు చాలఁ బ్రబలె.

ఉ. సంతతసత్క్రియాచరణసంగతచిత్తుఁడు సర్వదేశవి
శ్రాంతయశస్కుఁ డన్వయవిరాజితభేషజతర్పితాంధ్రభూ
కాంతబహూకృతుండగునఖండుఁడు మత్కృతినాథుతండ్రితా
నింతటివాఁడటంచుగణియింపఁగశక్యమె వెంకయాభిధున్.

వెంకయ్యగారికి కొమార్తె లిరువురు, కుమారులు నలువురు. అందు సర్వజ్యేష్ఠురా లగుబాపనమ్మగారు కాటవరం వాస్తవ్యు లగుతాతపూడి సుబ్బారాయుఁడుగారి భార్య. ఈ దంపతులకు శేషమ్మ,మహాలక్ష్మి యనునిరువురుకొమార్తెలు. సంజీవశాస్త్రి యనుకుమారుఁడు. వెంకయ్యగారి రెండవ కూఁతురు బాపమ్మగారు. ఈమె బ్ర॥శ్రీ॥ అల్లంరాజు తమ్మయ్య శాస్త్రిగారి ద్వితీయకళత్రము, వీరిసంతతి వెంకటరమణమ్మ గారు, కామమ్మగారు అన్నపూర్ణమ్మగారు, అనుమూవురుకొమార్తెలు. వెంకయ్యగారి పుత్రులలో జ్యేష్ఠులు బుచ్చయ్యగారు. వీరిది పితామహుల నామధేయము. సమనస వాస్తవ్యులు కూచిభట్ల వెంకయ్యగారి ప్రథమపుత్రిక యగుమహాలక్ష్మి బుచ్చయ్యగారి భార్య. వీరిపుత్రిక అన్నపూర్ణ, పుత్రుఁడు వీర వెంకటసత్యనారాయణమూర్తి. కొమార్తె యగు నన్నపూర్ణ ఆఁమూరువాస్తవ్యులు కామవరపు వీరయ్యగారి కుమారులు నగు వెంకటేశ్వర్లుగారి భార్య.

కుమారుఁడు వీరవెంకటసత్యనారాయణమూర్తిగారి భార్య, మేనమామ యగుకూచిభట్ల సత్యనారాయణగారి ద్వితీయపుత్త్రిక సుబ్బమ్మగారు. సూర్యకాంతమ్మ అనుకొమారిత బుచ్చయ్య అనుపుత్త్రుఁడును వీరిసంతానము. అందు సూర్యకాంతమ్మ సమనసనివాసులు కూచిభట్ల నరసింహాంగారి కుమారుఁడగుసత్యనారాయణమూర్తి భార్య.

ఇఁక వెంకయ్యగారి రెండవకుమారులు పరిశృతచరిత్రపురుషు లగువెంకటేశ్వర్లుగారు.

వెంకటేశ్వర్లుగారి యనుజన్ములు సుబ్బారాయుఁడుగారు. సుబ్బయ్యగారనుతమకనిష్ఠసోదరులు గతించుటచేఁ దత్ప్రేమసూచకముగా వెంకయ్యగారీపిల్లవానికి సుబ్బారాయుఁడు అని నామకరణము చేసిరి. సుబ్బారాయుఁడుగారికి రెండువివాహములు. ప్రథమకళత్రము రంగాపురంవాస్తవ్యులు పురాణపండసుబ్బారాయుఁడుగారి కొమార్తె యగుసూరమ్మగారు. సీతమ్మ, సుబ్బమ్మ, అన్నపూర్ణ అనుమూవురు కొమార్తెలును, కాశీవిశ్వనాధం అనుపుత్త్రుఁడును వీరలసంతానము.

అందు సీతమ్మ అనుపెద్దకొమార్తె సమనసవాస్తవ్యులు కూచిభట్ల వెంకటేశ్వర్లుగారి ప్రథమకళత్రము. రెండవకూఁతురు సుబ్బమ్మ రాజమండ్రి నివాసులు కాకరాల శ్రీరామమూర్తిగారిభార్య.

అన్నపూర్ణ అనుతృతీయపుత్త్రిక రంగాపురం గ్రామస్థులు కోటనారాయణమూర్తిగారి ధర్మపత్ని. ఇఁక కుమారుఁడగుకాశీవిశ్వనాధంగారి భార్య అజ్జరంగ్రామవాస్తవ్య

లగుకూచిభట్ల వెంకటదీక్షితులుగారి రెండవకొమార్తె సత్యవతి. ఈసత్యవతిగారి తల్లియన్నపూర్ణమ్మగారు వెంకటేశ్వర్లుగారిసోదరులకు మేనగోడలు, అందుచే మున్నున్నబాంధవము మఱియు సన్నిహితము చేయఁబడినది. ఈకాశీవిశ్వనాథంగారి కుమారుఁడు వెంకటసుబ్రహ్మణ్యము, కొమార్తె రామసీతా వెంకటసుబ్బలక్ష్మి.

సుబ్బారాయుఁడుగారికి నలువది సం॥రములు వయస్సు నకు లోపుగనే ప్రథమకళత్రవియోగము తటసించినది. అందుచే వీరు మఱల వివాహము చేసికొనిరి. ద్వితీయకళత్రము తుల్యారామేశ్వరం వాస్తవ్యులు అల్లంరాజు సూర్యనారాయణగారి ప్రథమపుత్రిక భావాయమ్మగారు. వీరికి సంతతి సూర్యకాంతం, అన్నపూర్ణ యనునిరువురు కొమార్తెలు, సూర్యనారాయణమూర్తి అనుకుమారుఁడు.

ఇందు సూర్యకాంతం అనుకుమార్తె కాట్రేనికోన గ్రామస్థులు ఆణివిళ్ళ సూర్యనారాయణగారి కుమారుఁడగు సూర్యనారాయణమూర్తి భార్య.

వెంకటేశ్వర్లుగారి కనిష్ఠసోదరులు వెంకటాచలంగారు. వీరిది మాతామహుని పేరు. పిఠాపురం నివాసులు కోటఅబ్బన్నగారి రెండవకొమార్తె సీతమ్మగారు వీరిభార్య. అన్నపూర్ణ, సూర్యకాంతం అనుకొమార్తెలు వేంకటేశ్వర్లు అనుపుత్రుఁడును వీరిసంతానము.

అందుఁ బెద్దకొమార్తెఅన్నపూర్ణ గోకవరంవాస్తవ్యులు నాగాభట్ల ధర్మరాజుశర్మగారి భార్య. ద్వితీయపుత్రిక సూర్య

కాంతం కాతేరునివాసులు కాకరాల సత్యనారాయణమూర్తి గారి భార్య. కాకరపఱ్ఱు గ్రామవాస్తవ్యులగు బ్రహ్మశ్రీ వేదులరామశాస్త్రిగారి కొమార్తె యగుశేషామణి వెంకటాచలంగారి కుమారుఁడగు వెంకటేశ్వర్లుగారిభార్య.

ఇట్లు వెంకయ్యగారివంశము దోసతోటం బలె నమితమగునభివృద్ధి నందియున్నది.

—: వెంకటేశ్వర్లుగారి మాతామహ వంశము :—

వెంకటేశ్వర్లుగారి మాతామహులు బ్ర॥శ్రీ కోట వెంకటాచలంగారు. తణుకు తాలూకా తీపఱ్ఱు వీరి నివాసగ్రామము. నర్సమ్మగారు వీరిధర్మపత్ని. వీరికిఁ గొమార్తె లైదుగురు, ఒకకుమారుఁడు.

అందు జ్యేష్ఠపుత్రిక యగువెంకమ్మగారు కాకరపఱ్ఱు నివాసులైనపురాణపండ బాపన్నగారి భార్య. వీరికిసంతతిలేదు.

రెండవకొమార్తె లక్ష్మీనరసమ్మగారు ఈమె వెలగదుఱ్ఱుగ్రామనివాసులు విచిత్రరామాయణాది గ్రంధకర్తలు నగుబ్రహ్మశ్రీ నరసింహదేవర వెంకటశాస్త్రిగారిభార్య. వీరి కొమార్తె రత్తమ్మగారు కాకరపఱ్ఱువాస్తవ్యులు, మహాపండితులు నగుచర్లకామశాస్త్రిగారి ధర్మపత్ని. కుమారులు, పరబ్రహ్మశాస్త్రిగారు. పేరుశాస్త్రిగారు, శేషయ్యశాస్త్రిగారు, వెంకటరమణయ్యగారు, నారాయణమూర్తిగారు, ఉమామహేశ్వరశాస్త్రిగారు అనువారు. వీరిలో ద్వితీయులగు పేరుశాస్త్రిగారు ఆఁమూరుగ్రామస్థులగు నరసింహదేవర వెంకటశాస్త్రిగారి దత్తపుత్రులు.

కోట వెంకటాచలంగారి తృతీయపుత్రిక పతివ్రతచరిత్రిపురుషు లగు ద్వి॥ వెంకటేశ్వర్లుగారి మాతృదేవి.

నాల్గవకొమార్తె లక్ష్మమ్మగారు ఖండవిల్లి వాస్తవ్యులు కాకరపర్తి అచ్యుతరామయ్యగారిభార్య. వీరికి సీతాపతిగారు, వెంకటాచలంగారను పుత్రులిరువురు, కామమ్మగారు అను కొమార్తె యొకరు.

ఐదవకూతురు రత్నమ్మగారు ఖండవిల్లిగ్రామములోని కాకరపర్తి శాస్త్రిలుగారి భార్య. వీరికి స్త్రీసంతానము బాపనమ్మగారు. పుత్రులు రామమూర్తి, శ్రీరామమూర్తి, వెంకటాచలంగారలుమూవురు. కోట వెంకటాచలంగారి పుత్రుఁడు శాస్త్రిలుగారు. పెంచికలపాడు గ్రామనివాసులు చక్రవర్తుల వెంకయ్యగారి కొమారిత వీరమ్మగారు. శాస్త్రిలుగారిభార్య. వీరికి వెంకటాచలను వెంకటసుబ్బారాయుఁడు అనునిరువురు పుత్రులు, సుబ్బమ్మగారు, సూరమ్మగారు అను కొమార్తె లిద్దఱు. ఇందుఁ బెద్దకుమారుఁడు వెంకటాచలంగారి భార్య వింజరం గ్రామనివాసు లైన వేదుల వెంకట్రామయ్యగారి కొమార్తె సూరమ్మగారు.

శాస్త్రిలుగారి ద్వితీయపుత్రిలు వెంకటసుబ్బారాయుఁడుగారు. వెలగదుర్రువాస్తవ్యులు దుడ్డు చినకామయ్యగారికొమార్తె కనకమ్మగారు వీరిభార్య. ఈదంపతులకు పురాణపండ భద్రయ్యశాస్త్రిగారి కుమారుడగు మాధవశాస్త్రిగారు దత్తపుత్రిలు.

దుడ్డు కామేశ్వర్రావుగారి కొమార్తె సుబ్బమ్మ మాధవశాస్త్రిగారి భార్య.

శాస్త్రులుగారి పెద్ద కొమార్తె సుబ్బమ్మగారు నృసింహదేవర నారాయణమూర్తిగారి భార్య.

రెండవకొమార్తె యగునూరమ్మగారు ప్రకృతచరిత్ర పురుషు లగు ద్వి॥ వెంకటేశ్వర్లుగారి ధర్మపత్ని.

ఇట్లు వెంకటేశ్వర్లుగారి మాతామహవంశము శాఖోప శాఖలుగా విస్తరిల్లినది.

---

ఓం !

శ్రీమద్ధన్వంతరయేనమః

# శ్రీ ద్విభాష్యం వెంకటేశ్వర్లు గారి జీవిత చరిత్రము.

## 3. ప్రకరణము

(వెంకటేశ్వర్లుగారి జననము, విద్యాభ్యాసము, మాతృవియోగము, ఉపనయనము, ఆయుర్వేదాధ్యయనము, వివాహము, వైద్యప్రచారము, పితృవియోగము.)

**1882–1904**

శ్రీ ద్విభాష్యం వెంకయ్యగారికి జ్యేష్ఠపుత్రులగు బుచ్చయ్యగారు ప్రజోత్పత్తి నామసంవత్సరమున జన్మించిన పిదప నాల్గైదు సంతానము లక్కఱకు రాలేదు. అంతలోఁ దమకు దగ్గరచుట్టములయింట శుభకార్యమునకని వాడపల్లిలో విజయంచేసియున్న శ్రీ వేంకటేశ్వరస్వామివారి సన్నిధికి వెంకయ్యగారిదంపతు లేఁగుట తటస్థించినది. అప్పుడు వెంకయ్యగారిధర్మపత్నియగు పూర్ణమ్మగారు శ్రీవేంకటేశ్వరస్వామివారిదర్శన మాచరించి "దేవా! చిరంజీవియు గుణవంతుఁడు నగుపుత్రు నొసంగి నాకష్టము లెల్లఁ దొలఁగింపుము, నీవరమున జనియించు బిడ్డ నీపేరనే పరఁగి యఖండ మగుకీర్తి నార్జించు నట్లనుగ్రహింపుము" అని సునిశ్చల మగుభక్తితో మ్రొక్కుకొనిరి. భగవంతుఁడు భక్తపరాధీనుఁడు గదా!

శ్లో॥ అనన్యా శ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే।
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్॥

తా॥ ఇతరచింతలు వీడి న న్నుపాసించుటయందే యాసక్తిగలవారలై యెవ్వ రుందురో నిశ్చలబుద్ధి గలయట్టివారల యోగక్షేమములు నేనే వహించెదను.

భగవంతుఁడే తనభక్తపరతంత్రత నీరీతిగా నుద్ఘోషించియుండెను. తదనుగుణముగఁ దన్నుఁ గొలుచు భక్తశిఖామణుల నెందఱనో కాపాడినట్లు పురాణేతిహాసములు వాక్రుచ్చుచున్నవి. ప్రత్యక్షదృష్టాంతములును జూడఁబడుచున్నవి.

## — జ న న ము —

శ్రీ వేంకటేశ్వరస్వామివారియనుగ్రహమునఁ బూర్ణమ్మగారు మఱల గర్భము ధరియించిరి. తొమ్మిదినెలలు పూర్తియగునంతనే స్వస్తిశ్రీ చాంద్రమాన చిత్రభానునామ సం॥ర మార్గశిర శుద్ధపూర్ణిమా స్థిరవారం (24-12-1882) ఉదయాది. ౨౫-౫౨ విఘటికలకు మృగశీర్షనక్షత్రద్వితీయచరణయుక్తకన్యాలగ్నమున వెంకటేశ్వర్లుగారు జన్మించిరి.

(ఆనాఁడు గ్రహసంపత్తి యీక్రిందిరీతిగా నుండెను.)

| | | |
|---|---|---|
| గు / చం | కే శ | |
| | రాశి | |
| ల | రా | శు / రబు కు |

| | | |
|---|---|---|
| రకు / రా | | |
| | అంశ | |
| బు / చం | | కే శుగు / శ |

| | | |
|---|---|---|
| రా / భా | వ్య | ఆ.ల |
| మం | ఆరూఢము | |
| దా | | క్షో పా |

జననకాల కుజమహాదశాశేషము (4 సం॥ 2 నె॥ 11 రో॥ 40 గ॥) పురుటిరోజులు పదియుఁ జల్లగాఁ గడచినవి. "దశమేహాని ద్వాదశేవా పుత్రస్య జాతస్య నామ విదధ్యాత్" అనుస్మృతి వాక్యానుసారము పదునొకండవరోజున వెంకయ్యగారు వేంకటేశ్వరవరప్రసాదసంజనితుఁ డగు నీకుమారునకు "వెంకటేశ్వర్లు" అని నామకరణ మొనరించిరి.

మఱియుఁ బుట్టినఏడాదిలోపుననే యీబాలుని వెంటఁబెట్టుకొని వాడపల్లి వెళ్ళి శ్రీవేంకటేశ్వరస్వామివారిదర్శనము చేయించిరి. తరువాతకూడ యపుడపుడు వేంకటేశ్వరస్వామి వారిదర్శనము చేయించుచుండెడివారు. వెంకటేశ్వర్లుగారుకూడ తమజననాదికవృత్తము విని యున్నవారగుటచే వేంకటేశ్వర భక్తులై పలుమారులు వాడపల్లి వెళ్ళి శ్రీవేంకటేశ్వరస్వామి వారిదర్శనము చేయుచుండిరి. వెంకటేశ్వర్లుగారు పుట్టినదాదిగాఁ దండ్రిగారికి వైద్యవ్యాప్తి హెచ్చుగాఁ జొచ్చినది. తన్మూలకముగాఁ బూర్వముకన్న మిన్నగా ధనసంపాదనము జరుగుచుండెను. అది హేతువుగాఁ దల్లిదండ్రులు వెంకటేశ్వర్లుగారి యందు మిక్కుటమగు ప్రేమతో నుండెడివారు. యుక్తకాలములందు అన్నప్రాశనము మున్నగుసంస్కారము లందుచు శుక్లపక్షసుధాకరునిమాడ్కి వెంకటేశ్వర్లుగారు క్రమాభివృద్ధి నందుచుండిరి.

## —♦ విద్యాభ్యాసము ♦—

వెంకటేశ్వర్లుగారికి ఐదవసంవత్సరము వచ్చుటతోడనే అక్షరస్వీకార మహోత్సవము జరుపఁబడినది. ఆకాలమున

నింతగాఁ బ్రతిగ్రామమందును బోర్డువారిప్రాథమిక పాఠశాల లేర్పడియుండలేదు. చింతలూరునందు గూడూరు సుబ్బారాయుఁడుగారు వీధిబడి పెట్టి పిల్లలకు విద్యగఱపుచుండెడివారు. వీరు తెలుఁగుబాసలో నొకింత సాహిత్యము సంపాదించి గణితము, భూగోళము, చరిత్రము మున్నగువిషయములందుఁ గూడ పరిశ్రమచేసి తమకుఁదెలియని సంగతులు పెద్దలవలనఁ దెలిసికొనుచుఁ దమయొద్ద చదువుకొను విద్యార్థులకుపదేశించుచుండిరి. భూగోళాదివిషయములు బాలురచేఁ గంఠస్థములు చేయించుతలంపుతోఁ జిన్నశ్లోకములుగాఁ గూర్చి చదివించుచుండిరి. ఆశ్లోకములు వెంకటేశ్వర్లుగారికిని, వారిసోదరులగు సుబ్బారాయుఁడుగారికిని నేఁటికిని గంఠస్థములు. విద్యార్థులెట్లైన నభివృద్ధికి వచ్చుటయే నాఁటి గురువులయాశయము. గురువులమాట దాటక శ్రద్ధాభక్తులతోఁ జదువుకొనుచుండుటయే నాటియంతేవాసుల పద్ధతి. అందుననే వీధిబడిలో నాల్గవతరగతి చదివి ప్రైమరీపరీక్ష నిచ్చిన విద్యార్థి సంస్కృతాంధ్రములలో మంచిజ్ఞానము సంపాదింపఁ జాలెడువాఁడు. గురుశిష్యపద్ధతిలోను, విద్యావిధానములోను నాఁటికిని నేఁటికిని హస్తిమశకాంతర మగుతారతమ్య మేర్పడినది.

శ్లో॥ గుశబ్ద స్త్వంధకారః స్యాత్ రుశబ్ద స్తన్నివర్తకః।
అంధకారనివర్తిత్వా ద్గురు రిత్యభిధీయతే॥

"గు"అనఁగా నంధకారము: "రు"అనఁగా అంధకారమును పోఁగొట్టువాఁడు. అంధకారమును పోఁగొట్టువాఁడగుటచే విద్యోపదేష్ట "గురు"వని చెప్పఁబడుచున్నాఁడు. (ఇట

నంధకారమనఁగా అజ్ఞానమను నంధకారము) జ్ఞానవిహీనుఁడగు బాలునకు జ్ఞానోపదేశక నగువిద్యనొసఁగి పోషించువాఁడగుటచే గురువు తండ్రికన్నను బరమపూజ్యుఁడు. కావుననే

శ్లో॥ గురుర్బ్రహ్మా గురుర్విష్ణు ర్గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్పరం బ్రహ్మ తస్మై శ్రీగురవే నమః॥

అని గురువు హరిహరబ్రహ్మాత్మకుఁడని చెప్పఁబడినది. శిష్యుఁడనఁగా గురువుచే శాసింపఁదగినవాఁడు. ప్రాచీన గురుశిష్యపద్ధతి నైయర్థము ననుసరించి ప్రవర్తించుచుండెడిది. శిష్యుఁడగు ప్రతివ్యక్తియు గురునిదైవతముగాఁ దలఁచి కడుంగడు భక్తిశ్రద్ధలతోఁ గొలుచుచుండువాఁడు. గురువైనప్రతివ్యక్తియు శిష్యుని బుత్రునిఁబలె వాత్సల్యముతోఁ గాంచి విద్యాబుద్ధు లొసంగుచుండెను. కాలప్రభావమున నావద్ధతు లెల్లఁ బూర్తిగా మాఱిపోయినవి. తత్త్వధాస్త్రమ్, వెంకటేశ్వర్లుగారు గూడూరి సుబ్బారాయుఁడుగారి వీధిబడిలోఁ బ్రవేశించి ప్రాచీనగురుశిష్యపద్ధతిలోఁ జదువుకొనుచుండిరి. పెద్దింటి తమ్మన్నగారు, పెద్దింటి వెంకన్నగారు, ద్విభాష్యం సుబ్బారాయుఁడుగారు (వెం॥ గారిసోదరులు) చింతలూరు వెంకటనీలాచలంగారు, నామాల వీరన్నగారు మున్నగువారు వీరికి సహాధ్యాయులు. వెంకటేశ్వర్లుగారీసహాధ్యాయులతో నేవిధమగు భేదభావములేక మిగులమైత్రితోఁ గలిసిమెలసి వర్తించుచుండిరి.

శ్లో॥ గురుశుశ్రూషయా విద్యా పుష్కలేన ధనేన వా।
అథవా విద్యయా విద్యా చతుర్థం నోపలభ్యతే॥

(గురుసేవచేఁ గాని, పుష్కల మగుద్రవ్యముచేఁ గాని, విద్యావినిమయముచేఁగాని విద్య సాధింపవచ్చును. విద్య సాధించుట కింతకన్న వేఱొండుపాయము లేదు.)

అను వచనానుసారముగా గురుశుశ్రూష విద్యాసాధనోపాయములలో మిన్నయగుట యెఱింగి తోడివిద్యార్థులం గూర్చికొని గురువుగారు చెప్పినపని యెల్ల నెఱవేర్చుచుండెడి వారు. అధ్యాపకులగు సుబ్బారాయుఁడుగారికి కొద్దిపాటి సొంత సేద్యముండెడిది. వెంకటేశ్వర్లుగారును వీరిసహపాఠులును గాయకష్టంబులు లెక్కసేయక గురువుగారిపొలములోఁ గలుపు తీత, కోత, మున్నగువ్యవసాయపుపనులు చేయుచుండెడి వారు. వీరిభక్తిశ్రద్ధలకు మెచ్చి సుబ్బారాయుఁడుగారును మిగులప్రేమా దరంబులతో విద్య చెప్పుచుండిరి.

## —♦ మాతృవియోగము ♦—

వెంకటేశ్వర్లుగారు వీధిబడిలోఁ జదువుకొనుచుండు నా కాలముననే వికృతినామ సం॥ర ఆషాఢబహుళ తదియనాఁడు వీరిజననీమతల్లికయుఁ బతివ్రతాతిలకము నగుపూర్ణమ్మగారు భౌతికదేహము వీడి యశోమయశరీరంబు గైకొనిరి. అప్పటికి వెంకటేశ్వర్లుగారి వయస్సు ఎనిమిది సంవత్సరములు. వీరిసోదరులు సుబ్బారాయుఁడుగారికి అయిదుసంవత్సరములు. వెంకటాచలంగారికి మూఁడుసంవత్సరములు.

భర్తృసేవాపరాయణయై అకాలమందైన నతిథివచ్చినచో నాదరముతో మృష్టాన్నమొసంగి యన్నపూర్ణాదేవియే

యీరూపున నవతరించెనని జనులెల్లఁ దన్నుమెచ్చుకొనఁగా జీవితము వెళ్లఁబుచ్చిన పూర్ణమ్మగారి మరణవార్తవిని విచారింపనివారును, భర్తృసమక్షమున నైదువతనముతో దేహయాత్ర ముగించి నందులకుఁ బ్రశంసింపనివారును లేరు. తల్లిగారు పోయినతరువాత వెంకటేశ్వర్లుగారిని వీరిచిన్నతమ్ములను పిన తండ్రిగారికుమార్తెయగు వరదా బాపనమ్మగారు మాతృనిర్విశేషముగా సంరక్షణ మొనరించిరి.

బాపనమ్మగారు గావించిన సంరక్షణాదికమునకుఁ గృతజ్ఞులై వెంకటేశ్వర్లుగారామెను మాతృభక్తితో నారాధించుచుఁ బోషించుచున్నారు. "ధర్మజ్ఞశ్చ కృతజ్ఞశ్చ" అని వాల్మీకి మహర్షిచే నుడువఁబడిన మహాపురుషలక్షణములు వెంకటేశ్వర్లుగారి కుగ్గుఁబాలతోడనే యలవడియున్నవి. ఇట్టి వారి చరిత్రములే లోకుల కాదర్శభూతములు—

వెంకటేశ్వర్లుగారు గూడూరు సుబ్బారాయుఁడుగారి యొద్ద నాలుగవతరగతి పూర్తిచేసి, గవర్నమెంటువారిచే నేర్పాటుచేయఁబడిన ప్రైమరీపరీక్షకుఁ గట్టిరి. ఆరోజులలో ప్రైమరీపరీక్షలు కొన్నికొన్ని కేంద్రములలో మాత్రమే జరుపఁబడుచుండెడివి. స్కూలుఫైనలు, ఇంటరు, బి యే, పరీక్షలకుఁ బోలె ప్రశ్నపత్రములు పైనుండి వచ్చెడివి. సమీక్షకులు (వాచర్లు) మొదలగు నేర్పాటులన్నియు కట్టుదిట్టముగా నుండెడివి. పరీక్షకుఁ బాఠ్యగ్రంథములుకూడ ఉత్తమతరగతికిఁ జెందినవిగా నుండెడివి. తెలుఁగులో భారతములోని కొన్నిభాగ

ములు, భాగవతమునందు నితరప్రబంధములలోను గొన్నిపం
దల పద్యములు పఠనీయములు. గణితములో నించుమించుగా
నిప్పటిస్కూలుఫైనలుతరగతికి నిర్ణయించిన లెఖ్ఖలతో సమ
మగు పాఠ్యక్రమము, భూగోళము, చరిత్రము మున్నగు నితర
విషయములు కూడ చాలినంతగనుండెడివి. వ్యాకరణాదికము
కూడ భాషకు వలయునంతగా నుండెడిది. అందుచే నాఁడు
ప్రైమరీపరీక్షలో జయమందుట బహుకష్టసాధ్యముగా నుం
డెను. పరీక్షకు వెళ్లినవారిలో నూటికి ఏపదిమందియో యుత్తీ
ర్ణులగుచుండిరి. వెంకటేశ్వర్లుగారు "మండపేట" కేంద్రము
నకు వెళ్లి ప్రశ్నపత్రములు వ్రాసి పరీక్షలో జయమందిరి.

## —♦ ఉ ప న య న ము ♦—

వెంకటేశ్వర్లుగారికి 12 వ సంవత్సరమువయస్సు వచ్చి
నంతనే జయనామసం॥రములో నుపనయనము జరిగినది. అది
మొదలుఁగా బిత్రుపాదు లగు వెంకయ్యగారియొద్ద ఆయుర్వేదా
ధ్యయమున కుపక్రమించిరి. చిన్నతనమునుండియు వెంకటే
శ్వర్లుగారు వినయాదిగుణములు సూక్ష్మబుద్ధియుఁ గలవా
రగుటచేఁ దమకుటుంబములోని వైద్యవిద్య నిలువఁబెట్టుటకుఁ
దగినవా రని యెంచి తండ్రిగారు వీరికే వైద్యశాస్త్ర ముప దే
శింపఁ గడంగిరి.

## —♦ ఆయుర్వేదాధ్యయనము ♦—

నిఘంటువు, ద్రవ్యగుణము మున్నగు నవి కంఠస్థములు
చేయుచు నౌషధనిర్మాణాదివిషయములలో ననుభవమందుచు

చరకసంహిత, బసవరాజీయము, వైద్యచింతామణి మున్నగు శాస్త్రగ్రంథములు పఠించుచుండిరి. రామచంద్రపురము, నందంపూడిఅగ్రహారము మున్నగు తావులకుఁ దండ్రి గారితోఁ బాటు వెళ్ళి యట రోగులఁ గాంచుచు వ్యాధినిదానము చికిత్స మున్నగువిషయములలో నమిత మగుకౌశల్య మందనేర్చిరి. మఱియు వైద్యశాస్త్రము చదువుకొనుకాలము నందే తమభావుకు లగుబ్రహ్మశ్రీ అల్లంరాజు తమ్మయ్యశాస్త్రి గారియొద్ద వేదాధ్యయనము సేయుచుఁ గావ్యపరిచయము కూడ కొంతవఱ కలవరచుకొనిరి. ఈతమ్మయ్యశాస్త్రిగారు కృష్ణయజుర్వేదము సంపూర్తిగా నధ్యయనముచేసి కావ్యనాటకాలంకారములయందు సాహితి గడించిన మహావిద్వాంసులు. వీరిది పండితకుటుంబము. వీరిసోదరులలో నొక రగు బ్ర॥శ్రీ అల్లంరాజు శేషావధానులుగారు అశీతిద్వయము పద క్రమముతో సహా వేదమెంతటికో చెప్పిరి. శేషావధానులుగారి జ్యేష్ఠకుమారు లగురామమూర్తిఅవధాన్లుగారును వేద మెల్లఁ జదివిఉర్లాముసంస్థానములోఁ బరీక్ష నిచ్చి సత్కార మందుకొనిరి. తమ్మయ్యశాస్త్రిగారిసోదరులలో నొకరు కాశీలోఁ దర్క-వ్యాకరణములఁ జదివి మంచిపండితు లైరి. ఇట్లు వీరివంశములో నెందఱో మహావిద్వాంసు లుండెడివారు.

తమ్మయ్యశాస్త్రిగా రెంతయుఁ గర్మఠులై నియమనిష్ఠలతో జీవిత మంతయు గడపిన ధన్యజీవనులు. చింతలూరు గ్రామమునకు సుమారు రెండుమైళ్ళదూరములో గౌతమీనది కలదు. శాస్త్రిగా రనుదిన మానదికేఁగి స్నానసంధ్యాదికానుష్ఠానము నిర్వర్తించుకొనుచుండిరి. తమజీవితచరమదివస

మందుఁ గూడ గౌతమి కరిగి నియమపరిపాలన మొనర్చుకొన్న మహాతపస్వులు.

శ్లో॥ కింక్షణస్య కుతో విద్యా కింకణస్య కుతో ధనమ్।
క్షణశః కణశ్శ్చైవ విద్యా మర్థంచ సాధయేత్ ॥

అన్నట్లుగా క్షణకాల మైనను వ్యర్థపుచ్చక వెంకటేశ్వర్లుగారు మిక్కిలిశ్రద్ధతో నాయుర్వేద మభ్యసించుచుండిరి. కాని యొకనాఁడు మిత్రులప్రోత్సాహముచే "చీట్లపేక" ఆడసాగిరి. అది కర్ణాకర్ణిని దండ్రిగారికిఁ దెలిసి "అబ్బాయీ నీవు పేకాడు చున్నట్లు తెలిసినది. నిజమేనా?" అని ప్రశ్నించిరి. అసత్య మాడుటకు వెంకటేశ్వర్లుగారు వెనుకాడుచుండిరి. కాని తండ్రి గా రేమందురో? అనుభయముచే "లేదండి" అని నెమ్మదిగాఁ బలికిరి. అప్పుడు తండ్రిగారు "పేకాడుట యొకతప్పు, అది కప్పిపుచ్చుటకై యసత్యమాడుట మఱియొకతప్పు" అని మందలించి "ఈరోజు మొదలు చీట్లపేక యాడననియు అసత్యము పలుకననియు శపథముచేయు" మనిరి. వెంటనే వెంకటేశ్వర్లు గారటులు ప్రతిజ్ఞచేసిరి. చేయుటయే కాదు. నాఁటినుండియు నేఁటివఱకు సరదాకైనను చీట్లపేక ముట్టుకొనలేదు. శపథ మనఁగా నిట్టిదియే కదా.

"పితృదేవోభవ"

అను శ్రుతివాక్యసారము గ్రహించి జనకులే దైవత మనియు తద్వచనమే వేదవాక్య మనియు విశ్వసించి వెంకటే శ్వర్లుగారు సర్వదా మెలంగుచుందురు. ఇంతటిపితృభక్తి కలవా రికాలములో బహువిరళముగా నుందురు.

## — వి వా హ ము —

అది వికారివత్సరము. వెంకటేశ్వర్లుగారికి పదునేడు వత్సరములప్రాయము. ఆయుర్వేదము కొంతవఱకభ్యసించిరి. తండ్రిగారితోఁ గలిసి యనేకస్థలములకరిగి చికిత్సాపద్ధతు లభ్యసింపఁజొచ్చిరి. ఆతరుణమందు వెంకటేశ్వర్లుగారి మేనమామలు కోట శాస్త్రులుగారు చింతలూరువచ్చి మేనల్లుఁడగు వెంకటేశ్వర్లుగారి విద్యాదికము బుద్ధిమత్తయు నరసి భావుకు లగువెంకయ్యగారితో నిట్లనిరి.

బావగారూ! మీరెండవకుమారుఁడు వెంకటేశ్వర్లునకు నారెండవపుత్త్రిక సూరమ్మనిచ్చి పెండ్లిచేయవలె నని యున్నది. ఇదివరలో నాపెద్దకుమార్తెను మాఅక్కగారి కుమారుఁడు న॥ నారాయణమూర్తికిచ్చితిని గదా. ఈవివాహము కూడ జరిగినచో మేనఱికములు రెండును గలిసినట్లగును. వివాహము త్వరలోనే చేయవలె నని యున్నది. మా తండ్రిగారు స్వర్గతులైన యీసంవత్సరమధ్యమునఁ జేసినచో వారియాత్మయు నానందించును.

వెంకయ్యగారు: "బావా! నీవుచెప్పినది బాగుగనే యున్నది, కాని మావెంకటేశ్వర్లున కిప్పుడు 17సంవత్సరములు మీయమ్మాయి యున్ననో మూఁడుసంవత్సరములది. వధూవరులకు పదునాలుగేండ్లు తేడా కనఁబడుచున్నది. ఇంత తారతమ్యముతోఁ బెండ్లిచేయుట తగదు. నీకంతగా మాతో మేనఱికము కలుపుకొనవలె ననియున్నచో నితని తర్వాత వారలకుఁ జేయవచ్చును.

కో॥ శాస్త్రులుగారు: బావగారూ! తమమాట కెదురుచెప్పు వాఁడను కాను కాని త్వరలోఁ బెండ్లిచేయుటకుఁ గలకారణము మున్నే మనవిచేసియుంటిని. తర్వాతివారి కిచ్చినచో నిపుడు పెండ్లిసేయుట కవకాశము కలుగదు. ఇంక వయస్తారతమ్యము గూర్చియైనను దాము సంకోచించుట వలదు.

శ్లో॥ త్రింశద్వర్షోద్వహేత్కన్యాం హృద్యాంద్వాదశవార్షికీమ్॥

(ముప్పదియేండ్లు కలవరుఁడు పదిరెండేడుల కన్యను వివాహమాడఁదగును.)

అని కదా మనుమహర్షి శాసనము. 18 సం॥ రములు వధూవరులకుఁ దారతమ్య ముండఁదగు నని యీవచనము వలనఁ దెల్లమగుచున్నది. మనపిల్లలకుఁ బదునాలుగేండ్లే తారతమ్యము. కావున మారుమాట వచింపక వివాహమున కంగీకరింపుఁడు. వెంకయ్యగారపుడు వెంకటేశ్వర్లుగారిని పిలిచి "అబ్బాయీ మీమేనమామ పిల్ల నిచ్చెద నని చెప్పుచున్నాఁడు నీకిష్టమేనా?" అని అడిగిరి. పదునేడు సంవత్సరములు వయస్సు కలిగి వైద్యశాస్త్రము నభ్యసించుచున్న వెంకటేశ్వర్లుగారు నేఁటిపెండ్లికొడుకులవలె పిల్ల చిన్నదని కాని పిల్ల నొక్కసారి చూడవలె నని కాని యనక "నాయనగారూ! తమ కిష్టమగుచో నాకును అంగీకారమే" అనిరి. వెంకయ్యగారు "తథాస్తు" అని పెండ్లి కంగీకరించిరి. వివాహ మైదురోజులు తీపఱ్ఱుగ్రామములోఁ గన్యాదాతల గృహమునందు మహావైభవముగా జరిగినది.



శ్రీ ద్విభాష్యం వెంకటేశ్వర

దంపతులు.

## — వైద్యపరిచారము —

వివాహ మైనతర్వాతగూడ వెంకటేశ్వర్లుగారు విద్యాభ్యాసము మానలేదు. కొఱవడియున్న ఆయుర్వేదభాగములు చదువుచుఁ బూర్ణముగ ననుభవము సంపాదించుచుండిరి. ఆకాలమునం దింతగా ముద్రాయంత్రములు లేవు అందుచే అచ్చుపుస్తకములు దొరకుట దుర్లభముగా నుండెను. తాళపత్రములలో వ్రాయబడినగ్రంథములే నాఁటి పాఠ్యగ్రంథములు. "నీలిగోవా పాలకోవా" అను పేర్లతోఁ గాగితములు వచ్చుచుండెడివి. వెంకటేశ్వర్లుగారు తాళపత్రలిఖితము లగు వైద్యగ్రంథములను కాగితములలో వ్రాయ మొదలిడిరి. "బసవరాజీయము" మున్నగుగ్రంథములు పెక్కు కాగితపుస్తకముల కెక్కించిరి. ఈవ్రాతవలన జరిగిన యుపకార మమూల్యము. వెంకటేశ్వర్లుగారి కెన్నియోశ్లోకములు కంఠస్థము లైనవి. ఇన్ని వైద్యశ్లోకములు కంఠస్థముగానున్న వైద్యు లరుదు. ధారణాశక్తిలోగూడ వెంకటేశ్వర్లుగారద్వితీయులు. ఐదవసంవత్సరము వయస్సు వచ్చినది మొదలుకొని జరిగినవిషయములెల్ల వారికి హృద్గతములు. ముప్పదిసారు లచ్చుపుస్తకములోఁజూచి చదువుటకంటె యొకసారి వ్రాయుట మేలు, వ్రాసికొని చదివినది హృద్గతమైనటులు తక్కినది కానేరదు. వెనుకటిమహావిద్వాంసులెల్ల తాటియాకులలోనో భూర్జపత్రములలోనో వ్రాసి చదివికొన్నవారు. కావుననే వారిలో నెంతమందియో స్వయముగా గ్రంథములు రచింపఁజాలు ధీమంతులైరి. ఇపుడెక్కడఁ జూచిన నచ్చుపుస్తకములే. వ్రాసి చదువుకొను.

నవసరముపోయినది. కంఠస్థము సేయవలె ననుభావమే లేదు. పల్లవగ్రాహి పాండిత్యముగల పండితమ్మన్యులకుఁ గొఱంత లేదు. తఁ స్వప్నీయగు పాండిత్యము పూజ్యమైనది. కాలమిట్లో యున్నచోఁ గొంతకాలమునకు శాస్త్రములు చెప్పఁగలిగిన విద్వాంసులు లభింపరనియే తోఁచుచున్నది.

శ్లో॥ కంఠస్థా యా భవే ద్విద్యా సాప్రకాశ్యాసదాబుధైః।
యా గురౌ పుస్తకే విద్యా తయామూఢః ప్రతార్యతే॥

తా॥ ఏవిద్య యైనను కంఠస్థమైననే ప్రకాశించును. గురువుగారు మహాపండితులగుటచేఁగాని, పుస్తకములో నుంటచేఁగాని ప్రయోజనము లేదు. ఆయీవిషయము లెల్ల నెఱింగి వేంకటేశ్వర్లుగారు మిగుల కష్టించి వైద్యశాస్త్రమం దసమానమగు పాండిత్యము సంపాదించి వైద్యప్రచారమారంభించిరి.

## —♦ పితృవియోగము ♦—

వెంకటేశ్వర్లుగారి కిప్పటికి 21 సంవత్సరములు. విద్య పూర్తియైనది. స్వతంత్రముగా వైద్య మొనర్పఁదగు సమర్థులైరి. సంసారము చక్కఁగా నడచుచున్నది. కుమారుఁడు వెంకటేశ్వర్లుగారు తనయంతవాఁడైనాఁడని తండ్రి వెంకయ్యగారు సంతసించుచుండిరి. వైద్యప్రచారభారము వెంకటేశ్వర్లుగారి కప్పగించి విశ్రాంతి తీసికొనఁదలంచిరి. అంతయు ననుకూలముగానున్నది. కుమార్తెలకు, కుమారులు మువ్వురకును వివాహము లైనవి.

శోభకృన్నామ సం॥రము కొంతవరకు శోభాకరము గనే గడచినది. వసంతము, గ్రీష్మము, వెళ్ళినవి. వర్షర్తువు వచ్చినది. మంగళగౌరీవ్రతములు, వరలక్ష్మీవ్రతములు శోభాయమానముగా జరిగినవి. వినాయకచతుర్థి విభవోజ్జ్వలముగా నడిచినది. మహాలయపక్షమును భాద్రపదాపరపక్ష మేతెంచెను. సర్వసంపదలలో మునిగితేలువారికిఁ గూడ నీపక్షము కొంతచీఁకాకు గల్పించును. ఈయింటిమీఁది కాకి యాయింటిమీఁది కెగురలేనంతటి ముసుళ్ళు పట్టి యెంతటి గృహస్థునకైనను విసుగు కల్పించును. మరణముల సంఖ్య యీపక్షములో మిక్కుటముగా నుండును. అంతవరకు సుఖించుచున్న ప్రాణులకు దుఃఖపురుచి చూపింపఁజాలున దీపక్షము. పితృవియోగమున కడలుపుత్త్రులు భర్తృవియోగమునఁ గుందు పడఁతులు పత్నీవియోగదందహ్యమానమానసు లగువిధురులు నీపక్షమున నెక్కడఁ జూచిన నక్కడఁ గానవచ్చెదరు. ఏకాంతిక మగుసుఖ ముండనేర దని తెలుపుటకే పరమేశ్వరుఁ డీపక్షము సృజించియుండనోపును సర్వప్రపంచమునకిదియొక కరాళకాళరాత్రి. అట్టియీ యపరపక్షమునందలి "నవమి" తిథినాఁడు వెంకటేశ్వర్లుగారి జనకులగు వెంకయ్యగారి భౌతిక శరీరము కాలగర్భమునఁ గలిసిపోయెను. వారి ప్రశాంతమగు నాత్మ పరమాత్మతో నేకీభవించెను.

"పితాఽరత త్రిభువన మంధకారమ్"

అన్నట్లుగా వెంకటేశ్వర్లుగారికిని వారిసోదరులకును పితృవియోగము దుర్భరదుఃఖ మాపాదించినది. లోక మెల్ల నంధకారబంధురముగాఁ గానవచ్చెను. సహజధైర్య లగు

వెంకటేశ్వర్లుగారును సోదరులును దుఃఖ మడంచుకొని పితృమేధక్రతువు సక్రమముగా నిర్వర్తించిరి. క్రతువులన్నిటికంటె పితృమేధ ముత్తమోత్తమము

"పుత్ర మంతేచ కర్మణి"

పితరుల అంత్యకర్మము చేసినవాఁడే పుత్రశబ్ద వాచ్యుఁడు. పుత్రునిపుత్రత్వ మప్పటికిఁ గాని పూర్తి కానేరదు. వంశాభివృద్ధి నపేక్షించు ప్రతివ్యక్తియుఁ బితృదేవతా రాధనము శ్రద్ధమై నొనరింపవలయును. పితరులు జీవించియుండఁగా వారు చెప్పినట్లు వర్తించుటయు, ప్రమీతులగు నపుడు వారల సంతృప్తికై కర్మ మాచరించుటయు పుత్రులకు విధి విహిత మగుకృత్యము, ఇదియే పితృదేవతారాధనము. పితృదేవతారాధకులలో వెంకటేశ్వర్లుగా రద్వితీయులు.

శ్రీమద్ధన్వంతరయేనమః

# శ్రీ ద్విభాష్యం వెంకటేశ్వర్లుగారి జీవిత చరిత్రము.

## —:o: నాలవప్రకరణము :o:—

(కుటుంబస్థితిగతులు, ఉద్యోగము, వైద్యవ్యాప్తి, చికిత్సా నైపుణి, పునస్సంధానము, నూతనగృహనిర్మాణము.)

**1905—1915**

వెంకయ్యగారినాఁడు వీరికుటుంబమునకుఁ గలస్థిరవసతి పదునైదెకరములు. కనిష్ఠసోదరులు సుబ్బయ్యగారును వెంకయ్యగారును విభక్తులు కాలేదు. అందుచే నీభూమి యుభయులకుటుంబములకుఁ జెందియున్నది. ఆరోజులలో భూముల వలన నంతగా రాబడియుండెడిదికాదు. వెంకయ్యగారికి వైద్య వ్యాపకమువలన రాబడిహెచ్చుగనే వచ్చుచుండెను. కాని కుటుంబబాహుళ్యమువలనను భూములవలని యాదాయము స్వల్ప మగుటచేతను శుభకార్యవ్యయములవలనను ఋణము చేయవలసివచ్చినది. అందువలన వెంకయ్యగారిజీవితకాలమందే యె 4-50 సెంట్లు భూమి విక్రయించి కుటుంబఋణము కొంతవఱకుఁ దీర్చివైచిరి. వెంకయ్యగారియనంతరము, వెంకటేశ్వర్లుగారిసోదరులు తమపినతండ్రిగారికుమారులు కృష్ణయ్య

గారితో 11-3-1918 సం॥రమున విభాగము చేసికొనిరి. ఈ విభాగము జరుగువరకును కృష్ణయ్యగారును వీరును పినతండ్రి పెదతండ్రిబిడ్డ లని లోక మెఱుంగదు. ఏకోదరులవలె నభిన్న మనస్కులై వ్యవహరించుచుండిరి.

విభాగమునాఁటి కున్న భూమి యక 10-50 సెంట్లు. ఇందులోసగమును వెంకయ్యగారుకట్టిన పెంకుటియిల్లును కృష్ణయ్యగారి వాటాకు వదిలి, ఇంటికి ఉత్తరదిశయం దున్నని వేశనము, భూమిలోసగము వీరుసోదరులు తీసికొనిరి. తండ్రిగారొనర్చిన ఋణము కొంత మిగిలియున్నది. ఆఋణభారము వీరిసోదరులే వహించుట కొప్పుకొనిరి. అందుచే వీరివాటాకు వచ్చినభూమి కొంత విక్రయించఁబడెను. ఋణము తీర్చగా మిగిలియున్న భూమి తుల్యారామేశ్వరం గ్రామములో యక2-50 సెంట్లు. అది యేని సరిగాఁ బండునది కాదు. ఒకొక్కపుడు పన్నుగూడ ఇంటినుండి తీసికొనివెళ్ళి కట్టుచుండిరి.

ఇట్లున్నను వెంకటేశ్వర్లుగారిసోదరులు నలువురు నేకముగా నుండి వైద్యవ్యాపకమువల్లఁ గుటుంబనిర్వహణము గావించుచుండిరి. జ్యేష్ఠు లగుబుచ్చియ్యగారు మాత్ర మిప్పటి పశ్చిమగోదావరిజిల్లా ఆలమూరు గ్రామమునందు ప్రైవిడెంటు కంపెనీలో గుమాస్తాగాఁ బ్రవేశించి పనిచేయసాగిరి.

## —♦ ఉద్యోగము ♦—

అన్నగారిని జూచుతలంపుతో వెంకటేశ్వర్లుగారొకతడి "ఆలమూరు" వెళ్ళిరి. ప్రైవిడెంటు కంపెనీ మానేజరు శ్రీ పెనుమచ్చ సుబ్బరాజుగారు కొంచెమస్వస్థులుగానున్న సమయ

మది. అన్నగారిద్వారా వెంకటేశ్వర్లుగారికి రాజుగారితోఁ బరిచయ మేర్పడినది.

ఆపరిచయమును పురస్కరించుకొని ఆహారవిహారము లలోను జికిత్సావిధానములోను దగు సలహా లొసంగుచు వెంకటేశ్వర్లుగారు రాజుగారివ్యాధినివారణమున కెంతయుఁ దోడుపడిరి. రాజుగారెంతయు సంతసించి వెంకటేశ్వర్లుగారిని కూడ ప్రావిడెంటుకంపెనీలో నుండవలసినదిగాఁ గోరిరి. వెంకటేశ్వర్లుగారిభార్య అప్పటికిఁ గాపురమునకు రాలేదు. స్వంతముగా వంటచేసికొనునలవాటు లేదు. అప్పుడేకాదు ఇప్పటికిని వెంకటేశ్వర్లుగారికి వంట యపరిచితము. తమ్ములు వండిపెట్టుచుండువారు. ఆలమూరులో నైనచో నట్టిబాధ లుండవు. వదినెగారు కాపురమునకు వచ్చియుండిరి. ఆయీకారణములు పురస్కరించుకొని సుబ్బరాజుగారికోరికకు సమ్మతించి వెంకటేశ్వర్లుగారు ప్రావిడెంటుకంపెనీలో గుమాస్తాగాఁ బ్రవేశించిరి. కంపెనీపనులు శ్రద్ధగా నిర్వహించుచుఁ దీరికగలసమయములోఁ గొద్దిగా వైద్యవ్యాపకము చేసికొనుచు 1905_1906 సం॥రములు రెండును నటుఁగడపిరి. కంపెనీ యటనుండి కోటిపల్లి వాడకు మార్చఁబడెను. కంపెనీ స్థితి కొంచె మస్తవ్యస్తముగా నుండెను. అది గమనించి వెంకటేశ్వర్లుగారును, సోదరులుఁబుచ్చయ్యగారును కంపెనీ విడిచి 1907 సం॥ రములో స్వగ్రామమునఁ జేరుకొనిరి.

—♦ వై ద్య వ్యా ప్తి ♦—

ప్రావిడెంటుకంపెనీలో పనిమానునప్పటికి వెంకటేశ్వర్లుబుచ్చయ్యగార్లయొద్ద నున్ననిల్వ రు150_0_0 లు. ఆసొమ్ము

పెట్టఁబడిగా ఔషధములు కొన్ని సిద్ధపఱచుకొని చింతలూరు నందునుఁ బరిసరగ్రామములందును వైద్యము చేయసాగిరి. అనుశ్రుతముగా వచ్చుచున్న వైద్యము. తగినంత శాస్త్రజ్ఞానము, విశేష మగు ననుభవము, ఉత్తమమగు గుణసంపత్తి, వైద్యున కుండఁదగు సర్వలక్షణములు వెంకటేశ్వర్లుగారిలో మూర్తీభవించియున్నవి. అందుచే నంతవఱ కితర వైద్యులచేఁ జికిత్స నందుచున్న యాప్రాంతమువారెల్ల వెంకటేశ్వర్లుగారు స్వగ్రామము చేరి వైద్య మారంభించిరని తెలియుటతోడనే వీరివద్దకు రా మొదలిడిరి. ఆనాఁటి కానాఁడు వైద్య మభివృద్ధి నందఁజొచ్చినది. ఆలమూరుగ్రామములో శ్రీరాజా కాకర్లపూడి జగన్నాథరాజబహద్దరు వారు వీరిని తమయాస్థానవైద్యులుగా నుండఁగోరి ప్రతిసం॥రము గరిసెఁడుధాన్యము వార్షికముగాఁ బంపుచుండిరి.

పెదపళ్లగ్రామమున శ్రీరాజా పతేల్నా వెంకటరామస్వామిగారు, యీ వెంకటసుబ్బారావుగారును జమీందార్లు, “తర్కాలంకారవాగీశ” బిరుదాంచితులగు రామరుద్రభట్టాచారిగా రీజమీందార్లకుఁ బూర్వపురుషులు, భట్టాచారిగారు సర్వతంత్రస్వతంత్రులై “దినకరీయము” అనుముక్తావళివ్యాఖ్యానగ్రంథమునకు “రామరుద్రీయము” అనువ్యాఖ్యానము రచియించిరి. పెక్కుసంస్థానాధిపతులచే గౌరవించఁబడిరి. ఈజమీందార్లనుభవించు అగ్రహారములు భట్టాచారిగారిచే సంపాదింపఁబడినవి. వెంకటేశ్వర్లుగా రీజమీందార్లకుఁ గుటుంబవైద్యులై ఏఁటేట గరిసెఁడుధాన్యము వార్షికముగా నందసాగిరి. మఱియుఁ బెక్కుసంపన్నగృహస్థులకుఁ గుటుంబవైద్యు

లుగా నుండి వారివలనంగూడఁ దగుసన్మానము లందుచుండిరి. క్రమముగా వీరి వైద్యప్రతిభ దూరప్రదేశములకుఁ గూడ వ్యాపింపఁజొచ్చెను.

## —♦ చి కి త్సా నై పు ణి ♦—

మ॥రా॥శ్రీ యల్లమిల్లి సూర్యప్రకాశరావుగారు గవర్నమెంటురెవిన్యూశాఖలో నుద్యోగించి పెన్షను తీసికొనుచుఁ గాకినాడలో నుండువారు. వీరు మంచిధార్మికులు. కాకినాడ లాకులవద్ద శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరస్వామిని ప్రతిష్ఠించి యాలయము కట్టించిన పుణ్యపురుషులు. పాముకాటునకు మంత్రము వేయుటలో సిద్ధహస్తులు. "యల్లమిల్లి సూర్యప్రకాశరావు ఆజ్ఞయైనది. నిర్విషుఁడవై లెమ్ము" అని చెవిలోఁ జెప్పినంతనే యంతదనుక నిశ్చేష్టుఁడై పడియున్న సర్పదష్టుఁడు లేచికూర్చుండువాఁడట. ఆహా. మంత్రమహిమ యెట్టిదో! అట్టిమహామంత్రసిద్ధి నందినప్రకాశరావుగా రెంతయు శ్లాఘ్యులు. దీక్షతో మంత్రము జపించి సిద్ధి నందుటయే కష్టము. మంత్రసిద్ధి గలిగినచో సాధ్యముకాని దేమియు నుండదు. మంత్రసిద్ధులగు మహనీయులు గావించిన యద్భుతకార్యములు లెన్నియో యున్నవి. అందుఁ గొన్ని మన సమకాలికులగు మహనీయులవలనఁ బ్రత్యక్షములు. పోలిరెడ్డిపాలెంలో నున్న పాములసర్పయ్యగారి మంత్రప్రభావము కన్నులారఁ జూచినదే. సుమా రేఁబదివత్సరములకుఁ బూర్వము ఫ్రెంచియానాం వచ్చి సర్వరోగములు విషబాధలు మున్నగునవెల్ల మంత్రమహిమచేఁ గుదిర్చిన రెట్టియాపట్టసామి" ప్రతిభ నెఱింగినవారు కొందఱైన నుం

డకపోరు. వింజరంగ్రామస్థులైన బ్ర. శ్రీ. ఓలేటి వీరయ్యగారు మంత్రసిద్ధిచే దేవీసాక్షాత్కారమంది కావించినయద్భుతవిషయములెన్నియో యీగ్రామములోని పెద్ద లిప్పటికినిఁ జెప్పుచుందురు. అవి తిరుపతివేంకటకవులలో నొకరగు బ్రహ్మశ్రీ శతావధాని చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు వింజరములో నివాసముగా నున్నరోజులు. దేవీభాగవతము తెలిఁగించుచుండిరి. వ్యాసఘట్టమొకఁడు పాషాణప్రాయముగా నడ్డుతగిలినది. వీరయ్యగారి దేవీసాక్షాత్కార మెట్టిదో చూడవలె ననికూడ తలంపుదయించినది. వెంకటశాస్త్రిగా రాశ్లోకము తెచ్చి వీరయ్యగారికి చూపించి మీ దేవిచే నీశ్లోకార్థము చెప్పించు మనిరి. వెంటనే వీరయ్యగారు చదు వేమియు రానియొక స్త్రీపై దేవి నావాహనముచేసిరి. ఆమె యాశ్లోకమునం గలగంభీరార్థము వెల్లడించినంతనే శ్రీశాస్త్రిగారేమి యింకను నటనున్న గ్రామస్థులేమి యత్యాశ్చర్యపరవశులైరి. వీరయ్యగారిట్టి యద్భుతసన్నివేశము లెన్నియో దేవీసాక్షాత్కారముచేఁ గావించియుండిరి. ఇవి యన్నియు నిన్న మొన్నటివృత్తాంతములు. మంత్రప్రభావ మిట్టిదని యెఱింగియు నేఁ డట్టిదీక్షతో మంత్రజపముచేయువార లరుదైరి. అందుచే మంత్రప్రభావములు కూడ నదృశ్యమైనవి. తత్తథాస్తామ్.

మంత్రసిద్ధు లగుప్రకాశరావుగారికి హఠాత్తుగా పక్షవాతముసంభవించినది. అందుచే వాగ్బంధము కూడ తటస్థించెను. పెక్కుమంది వైద్యులువచ్చి చికిత్సచేసిరి. మాటమాత్రమైనను వచ్చినయెడల పాముమంత్ర ముపదేశ మందవచ్చునని ప్రజలెల్లరు తహతహలాడుచుండిరి. కాని ఫలము

సాధ్యము. అంతట ద్విభాష్యం వెంకయ్యగారి ప్రజ్ఞాదికమట నెల్లూరులో ప్రశంసించి "వారు వచ్చినగాని తప్పక యీవ్యాధి కుదరదు"నని చెప్పిరి. వెంటనే చింతలూరువచ్చి వెంకయ్యగారి కుమారులగు వెంకటేశ్వర్లుగారిని తీసికొనివెళ్ళిరి. వెంకటేశ్వర్లుగారు తమయొక్క మానసచికిత్సానైపుణిచే కొద్దిరోజులలోవాగ్బంధము పోగొట్టి అచిరకాలములో నేపటువాతవ్యాధి పూర్తిగా శమియింపజేసిరి. తరువాత ప్రకాశరావుగారు పాముమంత్రము కొందఱ కుపదేశించిరి. వెంకటేశ్వర్లుగారి చికిత్సవలన ప్రకాశరావుగారి యారోగ్యముతోపాటు లోకమున కెంతయు నుపకారము జరిగినది.

లోకలుఫండువర్క్సు షాపు మానేజరు మంధా సుబ్బారావుగారింట ప్రకాశరావుగారి బస. అందుచే వెంకటేశ్వర్లుగారికిని సుబ్బారావుగారికిని పరిచయమేర్పడినది. సుబ్బారావుగారిభార్య "శ్వాస"వ్యాధిచే బాధపడుచుండెను. వెంకటేశ్వర్లుగారామెకును చికిత్సచేసి వ్యాధి నివారణ మొనరించిరి. అదిమొదలుగా కాకినాడపురములో వెంకటేశ్వర్లుగారి వైద్య ప్రచార మానాటికానాడు విస్తరించినది.

అది కీలకనామసంవత్సరము. క్రీస్తుశకము 1908. వెంకటేశ్వర్లుగారి చిన్నతమ్ములు వెంకటాచలంగారి వివాహ మాసంవత్సరమందే జరిగెను. ప్రకాశరావుగారీమహోత్సవసమయమున వెంకటేశ్వర్లుగారికి రెండునూటపదియార్లు, పట్టుతాపితాంబరమును బహూకరించిరి. మంధా సుబ్బారావుగారును యథోచితముగా బహుమానములొసంగిరి.

## —: పునస్సంధానము :—

వెంకటేశ్వర్లుగారికి 27 వ వత్సరము. క్రీ. శ. 1909. సౌమ్యవత్సరము. ఈసంవత్సరములో వెంకటేశ్వర్లుగారికిఁ బునస్సంధానమహోత్సవము జరిగినది.

"కన్నుదోయికి నన్యకాంత లడ్డంబైన
మాతృభావము సేసి మఱలువాఁడు."

అనుసూక్తికి లక్ష్యభూతులై వెంకటేశ్వర్లుగా రంతవయస్సు వచ్చువఱకు మనోవాక్కాయము లనుత్రికరణంబులఁ బరిశుద్ధవర్తనులై జితేంద్రియులై మెలంగిరి. ఏవ్యక్తికైన సమున్నతికిఁగాని యధఃపతనస్థితికిఁగాని జితేంద్రియత్వమే హేతువు. జితేంద్రియుఁ డెట్టి యుత్తమస్థితినేని యందఁగలుగును. జితేంద్రియత బహుకష్టసాధ్యము.

శ్లో॥ బలవా నింద్రియగ్రామో విద్వాంసమపి కర్షతి.

అని మహర్షిమౌళి వేదవ్యాసుఁ డొకతఱి శిష్యులకుఁ బాఠసమయమున నుడివెను. అంతట వేదవేదాంతాది సమస్తవిద్యానిధు లగు జైమినివైశంపాయనాదులగు నంతేవాసులు.

గురువరా! ఈమనుడివినశ్లోకభాగములో
"విద్వాంసం నాపకర్షతి"

అని యుండుట లెస్స. విద్వాంసుఁ డెన్నఁడుగాని యింద్రియవశుఁడు గాఁజాలఁడు. యుక్తాయుక్తము లెఱిఁగి మెలంగువాఁడే కదా విద్వాంసుఁడు? అతఁడే యింద్రియములకు వశుఁడైనచో నిఁక జితేంద్రియుఁడే యుండఁజాలఁడు అనిరి. అనుభవశూన్యు

లగుటచే శిష్యు లటులు పలుకఁజొచ్చిరి. అనుభవముచేతనే వీరి నొప్పింపఁదగును" అని యెంచి వ్యాసుఁ డప్పు డేమియు సమాధాన మీయలేదు. ఒకనాఁడు పని యేదో యున్నదను మిషతో నాశ్రమము నుండి వెడలి ? తపోమహిమచే నాకస మంతయు మేఘములచే నాచ్ఛాదితం బొనరించెను. ఉరుములు, మెఱపులు తెఱపిలేని ధారాసంపాతము, కన్నుపొడుచుకొన్నను గనఁబడని కటికిచీఁకటి అట్టి మహాభీకరసమయములో నొండొకయబల యార్తధ్వని యాశ్రమమునందలి శిష్యుల చెవులలోఁ బడెను తలుపు తెఱచిరి. ధారావర్షముచేఁ దడిసి గడగడవడకు నొకసుందరి యెదుటఁ గానఁబడెను. దయనీయమగునాయబల నుగహస్తను దలిగొని లోనికి రాననుజ్ఞనిడి ధౌతవస్త్రము లొసంగిరి. అనుపమ సౌందర్యఖనియగు యువతిసొబగు మునులమనంబుల నొకింత కదలించెను. కాని సహజధైర్యు లగుటచే నామనోవికారం మణఁచుకొని యామె నొకగదిలోఁ బరుండుమని చెప్పిరి. గదిలోపలిగడియ వైచి యాభామిని పరుండెను

"ఈతరుణి యెవ్వతె ? ఈమెను జెట్టపట్టినయదృష్టశాలి యెవ్వఁడు ? ఈభయంకరకాళరాత్రి నొంటిమైఁ జనుదెంచుటకుఁ గారణ మేమి ? ఒక్కమాటేని యడుగకపోతిమి. అడిగినంతలోఁ దప్పేమి ? ఇట్లెన్నెని భావనలతో నామునుల హృదయములు మొదలంటఁ గదలనయ్యెను.

అంత నంతటిజితేంద్రియులును వివేక మెల్లఁ బొల్లుగా నాగదియొద్ద కరిగి పిలువఁజొచ్చిరి. సమాధానములేదు. వీరల యుద్రేకము హెచ్చిపోయెను. అధికోద్రిక్తుఁ డగు జైమిని

గోడమీఁది కెక్కి లోనికుఱికెను. అది యేమి వింతయో? అచ్చట నామహాత్ముఁ డింటికిఁ గంటికిఁ గనఁబడలేదు. ఇటులఁ గమండలుధరుం డగు గురువరుం డెట్టయెదుట సాక్షాత్కరించెను. జైమిని ముని లజ్జాభరంబునఁ గొంతికాల మట్లు నిశ్చేష్టుఁడై యుండి యెట్టకేలకు స్మృతిఁ గలిగి దేశికు చరణసరసిజయుగళంబులం బడి సాష్టాంగప్రణామము లొనరించి,

గురుదేవా! మాయపరాధంబు సయిరింపుము. అహంభావదోషదూషితుల మై ప్రతివాద మాచరించిన మాయజ్ఞాన మీలలిఁ దొలంచి కరుణించిన మీ కివే నమశ్శతములు.

"విద్వాంసమపి" అనుచోట "అపి" శబ్దమున కేవకారార్థము చెప్పినను యుక్తమే అని క్షమాపణము చెప్పికొనియెను. జితేంద్రియత్వ మెంతయు దుస్సాధ మనువిషయ మనుభవపూర్వకముగాఁ గృష్ణద్వైపాయనుఁడు తనశిష్యునకిట్లు తెలియఁజేసెను. జితేంద్రియత్వము సర్వసులభము కాని యొక మహోత్తమ సంపద. అది యలవడుట కిహజన్మాభ్యాసము పురాకృతము కూడఁ దోడుపడుట ముఖ్యము. వెంకటేశ్వర్లు గారి సుకృతవిశేష మెట్టిదో కాని జితేంద్రియత్వము వారికి నిసర్గసిద్ధముగా నలవడినది.

వైద్యవృత్తి నవలంబించు ప్రతివ్యక్తియు,
"మాతృవత్పరదారాంశ్చ"
(పరదారలను దల్లివలెఁ గాననగును.)

అను నీతిని బాటించువాఁడై మెలంగుట ముఖ్యము. పోతుటీగకుఁ గూడఁ బ్రవేశ మంగీకరింపని మహారాజాంతఃపురంబు

పతివ్రతాశిరోమణి యగు సూరమ్మగారు సహధర్మచారిణిగా వెంకటేశ్వర్లుగారు సకలసౌఖ్యము లనుభవించుచు సోదరులందఱితో మిగులసౌహార్ద్రముతో మెలంగుచు వైద్య మభివృద్ధి చేయుచుండిరి.

## — ♦ నూతన గృహనిర్మాణము ♦ —

వైద్యము సర్వతోముఖముగా వ్యాపించినది. రాబడి యొకనాటి కొకనాడు హెచ్చుచున్నది. నలువురుసోదరుల దొకటే మాట. సంసారస్థితులు సర్వవిధముల ననుకూలముగా నున్నతరుణము. 1915 సం॥రము చాంద్రమానముచే ఆనందవత్సరము. వెంకటేశ్వర్లుగారికి నూతనగృహనిర్మాణ మొనరించుతలంపు గలిగినది. తమసోదరులందఱివాటాకు వచ్చియున్నవేశనములో బెంకుటిల్లు కట్టుట కారంభించిరి. శ్రీరాజా కాకర్లపూడి జగన్నాధరాజుబహద్దరువారును, పెదపళ్ల జమీందార్లు శ్రీరాజా పర్వతాలా వెంకటరామస్వామిగారు, వెంకటసుబ్బారావుగార్లును గృహనిర్మాణమునకు మిక్కిలిగా ధనసహాయ మొనరించిరి. గృహనిర్మాణము త్వరలోనే పూర్తియైనది. గృహప్రవేశమహోత్సవమునకు బంధుమిత్రాదులెల్ల రరుదెంచిరి సలక్షణముగా మహావైభవముతో గృహప్రవేశము జరిగినది. ఆశుభసమయములో వెంకటేశ్వర్లుగారికి నందంపూడిఅగ్రహారము, ఆలమూరు, పెదపళ్ల కపిలేశ్వరపురం, కాకినాడ మున్నగుగ్రామములనుండివచ్చిన వైద్యపరిచితులు చదివించినకట్నములు మొత్తము సుమారురెండువేల రూపాయిలు. నూతనగృహప్రవేశ మిట్లుమందానందబంధురముగా నెఱవేఱినది.

---

ఓం

శ్రీమద్ధన్వంతరయేనమః

# శ్రీ ద్విభాష్యం వెంకటేశ్వర్లు గారి జీవిత చరిత్రము.

## ౫. ప్రకరణము

(దూరప్రదేశములలో వైద్యవ్యాప్తి, మృతవంధ్యాసంజీవని, పుత్రజననము, సోదరుల వియోగము.)

**1915–1924**

శ్రీ వెంకటేశ్వర్లుగారి వైద్యకౌశలము క్రమక్రమముగ దూరప్రదేశములకుఁ గూడ వ్యాపింపసాగెను. సర్వసిద్ధిరాయవరము, విశాఖపట్టణము జిల్లాలోనియొక గ్రామము. శ్రీ నేమాని సూర్యనారాయణగారీగ్రామములో గొప్ప సంపన్నగృహస్థులు కళత్రమునకనారోగ్యమేర్పడి పాశ్చాత్యవైద్యులచేఁ జికిత్స చేయించిరి. ఉపయోగము శూన్యము. తమయాప్తులమూలముగా వెంకటేశ్వర్లుగారిచికిత్సానైపుణ్యము నెఱింగి యాహ్వానించి చికిత్స చేయించిరి. అనతికాలమునకే యామె కారోగ్యము చేకూరెను. శ్రీసూర్యనారాయణగారు వెంకటేశ్వర్లుగారి నిరుపమాన నిదానచికిత్సానైపుణికి మిగుల నానందించి (రూ 116-0-0) నూటపదియాఱులు బహుమానముసేసిరి.

ఇది మొదలుగా విశాఖపట్టణంజిల్లాలో వెంకటేశ్వర్లు గారికి వైద్యవ్యాప్తి హెచ్చఁజొచ్చెను.

చేపట్టినరోగ మొక్కటియు బీరుపోకుండఁ జికిత్సఁగావించుచుఁ బెక్కుమందిసంపన్నగృహస్థులచే (రూ116-0-0) నూటపదియాఱులు సత్కారము లందికొనుచు వెంకటేశ్వర్లుగారు “అమృతహస్తు”లనుప్రఖ్యాతి గడింపసాగిరి.

మఱియు వీరితండ్రిగారగు వెంకయ్యగారి కాలమునఁ స్వతంత్రముగాఁ గనిపెట్టఁబడిన “మృతసంధ్యాసంజీవని” యను నౌషధరాజ మొసఁగి చేసినచికిత్స లెన్నియో కలవు. మహాత్ముల్యులగు వెంకయ్యగారిచే నీదివ్యౌషధ మెట్టిపుణ్యసమయమున గనిపెట్టఁబడినదో కాని యీయౌషధము సేవించి సంతానలాభ మందియానందించినవా రెందఱో లేరు. ఇట్టి మహాత్మ్యప్రభావసంపన్నంబగునీయౌషధరాజమును గూర్చి కేటలాగులో నీక్రింద ప్రకటించిరి.

— ♦ మృతసంధ్యాసంజీవని ♦ —

“ఈయౌషధమునకు సామ్యమైనదిగా నీయునక్క అ లేదు. గుణమును గనఁబడినతర్వాత సంతోషపూర్వకముగా బహుమాన మీయవలెను. బహుమానము రూ116-0-0.

ప్రకృతిచేతఁ గాని మఱి యేయితరకారణములచేతఁ గాని నవమాసములు ప్రాప్తికాకముందే గర్భస్రావము పాతము కలుగుటయు మాసపూర్ణమైనపిదప ప్రసవించియు శిశువు వెంటనే మరణించుటయు కొన్నిచోట్ల తటస్థ మగుచున్నది. అట్టివారికి గర్భగతము లగు సమస్తదోషములు హరించి సంతానము చిరాయుష్మంతము గ నుండుటకై యిది యెంతయు నుత్తమ మగు మహత్తరయోగము. మావంశ

పారంపర్యముగ నీయౌషధ మనేకుల కుపయోగింపఁబడి సంపూర్ణఫలసిద్ధి నొసంగుచున్నది. ఈయౌషధ మంతటి కమోఘముగా బనిచేయఁగలదను దృఢమగు నమ్మిక ముండుటచే ముందుగా సొమ్ము పుచ్చుకొనక ఔషధమువాడి సంతానముఁ గలిగి సుఖముగ నున్న నెలలోపున సంతోషపూర్వకముగ వారిబహుమానమును గోరుచున్నాము"

చూచితిరా! యీపత్రికలందలి సారస్యము. చిరకాలము నుండి యెందఱికో యీ యౌషధ మొసంగి యొక్కటిఁగూడ నపజయంబును మాటలంగక సర్వత్ర సాఫల్య మందుచుండియు నొక్కింతయహంభావము గాని యాడంబరము గాని ప్రదర్శింపక వస్తుగుణము మాత్రము వెల్లడించు వీరి గర్వరాహిత్య మెంతయుఁ బ్రశంసాపాత్రము.

"శ్లో॥ సూతికాం గూతికాం చైవ నదీతీరేచ నావికం
ఉపాధ్యాయంచ వైద్యంచ కార్యాంతే తు విసర్జయేత్॥"

అనునట్లు తమయవసరము తీఱినతోడనే వైద్యుల మొగమైనం గూడ చూడఁబోనియిక్కాలంబునందు వైద్యము నందు కర్చైని ముందుగాఁ గైకొనక "మృతవంధ్యాసంజీవని" నెందఱికో యిచ్చి ప్రకటించినతీరున రూ116-0-0లు బహుమానములంది యుండుట మిగుల నాశ్చర్యావహము. వెంకటేశ్వర్లుగారిసమర్థపటువర్తనమే దీని కంతకు మూలకారణము.

"మృతవంధ్యాసంజీవని" సేవించి సంతానవంతులై రూ 116-0-0 లు బహూకరించిన వారిలోఁ గొందఱిపేరులు మాత్రము.

1. శ్రీ బిక్కిని వెంకటరత్నంగారు, ఎమ్. ఎల్. ఏ.
మదరాసురాష్ట్రప్రభుత్వ మంత్రి, చోడవరం.
2. శ్రీ బలుసు బుచ్చివెంకటకృష్ణయ్యగారు, కపిలేశ్వరపురం.
3. శ్రీ నైట్ల రామన్నగారు, కొండులపాలెం.
4. శ్రీ నైట్ల శేషయ్యగారు, ,,
5. శ్రీ నైట్ల వెంకటాద్రియుడుగారు ,,
6. శ్రీ వాలిచేటి వెంకన్నగారు, పేకేరు.
7. శ్రీ పోచిరాజు వెంకయ్యగారు,
జిల్లాకలెక్టరాఫీసు శిరస్తాదారు, కాకినాడ.
8. శ్రీ నేమాని రామస్వామిగారు, గంగవరం.
9. శ్రీ తటవర్తి సత్యనారాయణగారు, బి ఏ.,బి.ఎల్.
హైకోర్టు అడ్వోకేటు, మదరాసు.
10. శ్రీ ఉప్పలపాటి సత్యనారాయణగారు, ఏడిద.

మఱియు బంధువులు స్నేహితులు మున్నగువారలెంత మందియో వీరి "మృతసంధ్యాసంజీవని" సేవించి సంతాన భాగ్య మందజాలిరి. గ్రంథవిస్తృతియగునని యెంచి వారిపేరు లన్నియు నిం దుదాహరింపఁబడ లేదు.

రామచంద్రపురం తాలూకా బోర్డునకుఁ జిరకాలమధ్యక్ష పీఠ మలంకరించి మదరాసురాష్ట్రీయశాసనసభకుఁ బలుసారులు మెంబరుగా నుండి కొంతకాలము మంత్రిపదవి నధిష్ఠించిన శ్రీ బిక్కిని వెంకటరత్నంగారు తమకును దమకుటుంబము వారలకుఁ బెక్కుమారులు వైద్యముచేయించికొని విశేషముగా సన్మానించిరి.

వెంకటేశ్వర్లుగారి యౌషధప్రశస్త్యమును గూర్చియు "మృతవంధ్యాసంజీవని" మహాత్మ్యపరిభావము గ్రహించియు వ్రాసిన యోగ్యతాపత్రమును గాంచినచో వారు పొందిన యానంద మెట్టిదో తెలియఁగలదు.

—:యోగ్యతాపత్రము:—

నేను చిరకాలమునుంచి చింతలూరు కాపురస్థులు "వైద్యరాజ" ద్విభాష్యం వెంకటేశ్వర్లుగారిని యెఱుఁగుదును. వారి యాయుర్వేదమందులు బహుశాస్త్రీయముగ దయారు చేయబడుచున్నవి. ఏ యే మందు లే యే గుణములు చేయునని చెప్పబడునో ఆ యా మందు లా యా గుణములు తప్పక చేయునని నేను నా స్వానుభవమువల్ల రూఢిగ చెప్పగలను. ప్రత్యేకముగా వారి "మృతవంధ్యాసంజీవని" సంతానము జీవించని స్త్రీలు గర్భిణులుగా నుండఁగ సేవించినయెడల ఆశిశువులు తప్పక జీవించెద రని నా కుటుంబానుభవమువల్లనున్నూ, నా బంధుమిత్రుల కుటుంబానుభవమువల్లనున్నూ నేను రూఢిగ చెప్పుచున్నాను. అట్టిపరిస్థితులుగల వారందరును ఈ "మృతవంధ్యాసంజీవని"ని సేవించి సంతానానందమును బడయుదురుగాక యని కోరుచున్నాను.

చోడవరం,
10-10-1925.

సం|| బిక్కిని వెంకటరత్నం, ఎం.ఎల్.సి.
ప్రెసిడెంటు, తాలూకాబోర్డు,
రామచంద్రపురం.

ఇట్లెంతమందియో సంపన్నగృహస్థుల కుటుంబములలో వైద్యము చేయుచు వారివలన సన్మానములు యోగ్యతాపత్రిములను బడయుచు వెంకటేశ్వర్లుగారు తమవైద్యమును విస్తరింపఁజేసిరి.

—: పుత్రజననము. :—

స్వస్తిశ్రీ చాంద్రమాన పింగళనామసం॥ర జ్యేష్ఠ బహుళ నవమీ భానువాసరమున (1917 సం॥రం) శతభిష నక్షత్రయుక్త ప్రథమపాదమందు వెంకటేశ్వర్లుగారికి గార్హస్థ్యఫలంబగు పుత్రసంతానము కలిగినది. ఈకుమారునిపేరు " వెంకటసూర్యనారాయణమూర్తి." ఈయన జన్మించినదాదిగా నాయేటికానేఁడు వెంకటేశ్వర్లుగారిసంపదయభివృద్ధి కాఁజొచ్చినది. కుమారుని నామకరణమహోత్సవమునకు బంధుగులు మిత్రులు నగునట్టి యెంతమందియో విచ్చేసి వివిధములగుస్వర్ణాలంకారములు కానుకలొసంగిరి. ఇట్లతివైభవోపేతముగ నందను నామకరణమహోత్సవము జరిగినది

—♦ విభాగము ♦—

వెంకటేశ్వర్లుగారు వారిసోదరులు 29-9-1918 సంవత్సరమున విభక్తులైరి. అప్పటికి సోదరులు నలువురకు భార్యలు కాపురమునకు వచ్చిరి. ఏసోకొంతయాస్తి యేర్పడినది. విభక్తులైనను మునుపటిసౌభ్రాత్రముతోనే మెలఁగుచు సర్వోన్నత సాహాయ్యముతో వ్యవహరించుచుండిరి. సోదరులందఱిలోఁ పెద్దలగు బుచ్చన్నగారును, వెంకటేశ్వర్లుగారును భాగస్వాములుగా నుండి వైద్యవ్యాపకము చేయుచుండిరి. గోదావరి

జిల్లాలోను, విశాఖపట్టణంజిల్లాలోను వెంకటేశ్వర్లుగారికి వైద్య వ్యాప్తి యధికముగా నున్నందున వీరు ఆయాగ్రామాంతరములు తిరుగుచుండిరి. ఇంటివద్ద ఔషధసర్వాణము పంపునట్టి పనులు బుచ్చయ్యగారు నిర్వహించుచుండిరి. వెంకటేశ్వర్లు గారి యనుజన్ములగు శ్రీ సుబ్బారాయుడుగారు అలమూరు మేజస్ట్రేటుకోర్టులో వకీలుగ బనిచేయుచుండిరి. మ॥ రా॥ శ్రీ పోచిరాజు వెంకయ్యగారు మేజస్ట్రేటు. వెంకటేశ్వర్లుగారు వీరికి వైద్యమొనరించి పలుమారులు సత్కరించబడుచుండిరి. అయినా పరిచయమును పురస్కరించుకొని సుబ్బారాయుడుగారాలమూరుకోర్టులో బ్రవేశించిరి

కనిష్ఠసోదరులు వెంకటాచలంగారు బోర్డుపాఠశాలలో నుపాధ్యాయులుగా బ్రవేశించిరి. మ॥ రా॥ శ్రీ తోకలనాగభూషణంగారు రామచంద్రపురంరేంజి సబ్ అసిస్టెంటు ఇనస్పెక్టరుగారు, వీరికి వెంకటేశ్వర్లుగారు వైద్యము గావించి గౌరవమందియుండిరి. పైపరిచయము మూలముగా వెంకటాచలంగారుపాధ్యాయపదవి నంగీకరించి పనిచేయుట సంభవించినది. ఇట్లు సోదరులెవరికివారు స్వతంత్రులుగా నుండి మిక్కిలి సౌహార్ద్రముతో మెలంగుచుండిరి.

ఓమ్

శ్రీమద్ధన్వంతరయేనమః

# శ్రీ ద్విభాష్యం వెంకటేశ్వర్లుగారి జీవిత చరిత్రము.

## ఆరవ ప్రకరణము.

(చికిత్సావిశేషములు, మదరాసు మొదలు పర్లాకిమిడివరకుఁ
గల ఆంధ్రదేశమునఁ గావించిన వైద్యప్రచారము,
సత్కారములు.)

1917—1925.

మదరాసు.

మ॥ రా॥ రా॥ శ్రీ రావుబహదూరు కృత్తివెంటి నాగేశ్వరరావుపంతులుగారు, వీరు కాకినాడలో కోఆపరేటివ్ రిజస్ట్రారుగాను నర్సరావుపేట మున్నగుస్థలములలో డిప్యూటీకలెక్టరుగాను మదరాసుగవర్నరుగారియొద్ద అండర్ సెక్రిటరీగాను బనిచేసియుండిరి. వీరికి శ్విత్రవ్యాధి యంకురించినది. అది కాకినాడలో కోఆపరేటివ్ రిజస్ట్రారుగఁ బనిచేయుచున్న సమయము. స్థానికులగు వైద్యులచేఁ జికిత్సపడసిరి. ఈషన్మాత్రముగాని గుణము కానఁబడలేదు. వ్యాధి ఘనీభవించినచో ఉన్నయుద్యోగ మూడిపోవుటయేకాక జీవితమెల్ల నిరర్థకమగునని యు మిగులఁ దిగులుపడుచుండిరి. అంతలో నొకతఱి నాగేశ్వరరావుగారు పెదపళ్ళగ్రామమున కేఁగుట తటస్థించినది. అచట శ్రీ రాజా ప శేల్వానా వెంకటరామస్వామి జమీందారు

గారివలన వెంకటేశ్వర్లుగారి ప్రజ్ఞాదికము విని వెంటనే వీరి వలనఁ జికిత్స నారంభించిరి. రెండుమూఁడు మాసములకు వ్యాధి పూర్తిగా నివారించెను. అంధకారబంధుర మగుతమవిషణ్ణ జీవితమున కీరీతిఁ బ్రభాతికకాంతలు చూపి కాపాడిన వెంకటేశ్వర్లుగారి కెంతయుఁ గృతజ్ఞులై యథోచితముగా సత్కరించిరి. నాఁటినుండియుఁ దమయింట నెవరికి జబ్బుచేసినను వెంటనే టెలిగ్రామిచ్చి వెంకటేశ్వర్లుగారి నాహ్వానించి చికిత్స చేయించుచుండిరి.

నాగేశ్వరరావుగారు మదరాసుగవర్నరుగారివద్ద "అండర్ సెక్రిటరీ"గాఁ బనిచేయుచున్న సమయమున, కొమార్తె హనుమాయమ్మకు కామిలావ్యాధి. మదరాసులోని యొకసుప్రసిద్ధవైద్యుఁడు చికిత్స సేయసాఁగెను. వ్యాధి తీవ్రముగా విజృంభింపఁజొచ్చెను. వెంటనే చింతలూరు టెలిగ్రాము మిచ్చి వెంకటేశ్వర్లుగారిని రప్పించి చికిత్స సేయించిరి. కొలదిరోజులలో నామె యారోగ్యవంతురాలాయెను.

వెంకటేశ్వర్లుగారి నెప్పుడాహ్వానించినను "సెకండుక్లాసులో రాకపోకల కగుకర్చులు "టెలిగ్రాఫిక్" మనిఆర్డరుద్వారా పంపుచుఁ దమయింట నున్నరోజులలో రోజు 1కి (15-0-0) పదియేనురూపాయల నొసంగుచు వ్యాధి నివారణానంతరము తగుసత్కారమాచరించుచుండిరి. ఇట్లు నాగేశ్వరరావుగారింటఁ జిరకాలము వెంకటేశ్వర్లుగారు వైద్యచికిత్స గావించిరి. నరసరావుపేటలో డిప్యూటీకలెక్టరుగా నున్న తఱి నొసంగిన యీక్రిందియోగ్యతాపత్రిమువలన నాగేశ్వరరావు

గారికి వెంకటేశ్వర్లుగారియందుగల ప్రామాణ్యము బోధ పడును.

మా॥రా॥రా॥శ్రీ రావు బహద్దూరు

కృష్ణవెంటి నాగేశ్వరరావు పంతులుగారు, బి. యే.

డిప్యూటీ కలెక్టరు, నరసారావుపేట.

నేను వైద్యరాజ ద్విభాష్యం వెంకటేశ్వర్లుగారిని అనేక సంవత్సరములనుండి బాగా ఎరుగుదును. వీరి ఔషధములు నాకున్నూ, నా కుటుంబములో వారికిన్ని, అపారమైన యుపయోగమును చేసినవి. వీరి మందులు శాస్త్రోక్తముగాను, మిక్కిలి జాగ్రత్తగాను తయారు చేయబడినవి. ఎల్లప్పుడును చేయవలసిన గుణము చేయుచుండును. వీరు అసాధారణప్రజ్ఞ గల సుప్రసిద్ధ వైద్యులు.

బెజవాడ.
1-10-1925.

సం॥ కే. నాగేశ్వరరావు.

మా॥రా॥రా॥శ్రీ వాడ్రేవు విజ్యన్నపంతులుగారు, బి ఏ బి.ఎల్ అడ్వొకేటు హైకోర్టు మున్నగువారలెంతమందియో మదరాసులోని ప్రముఖులు వెంకటేశ్వర్లుగారిచే వైద్యసహాయము బడసి సత్కరించిరి.

బందరు.

శ్రీ వంగూరి నారాయణమూర్తిగారు.

జిల్లాబోర్డుఆఫీసులో మానేజరు. వీరు తమభార్యకు జబ్బుచేయుటచే సకుటుంబముగా చింతలూరు వచ్చి వెంకటే

శ్వర్లుగారిచే వైద్యసహాయమువడసి యౌషధమూల్యమంతయు నొసంగి పైగా నూటపదియాఱులు సన్మానము గావించిరి. తర్వాతగూడ వెంకటేశ్వర్లుగారిని బందరు పిలిపించి వైద్యసహాయము వడయుచు తగురీతిగ సన్మానించుచుండిరి. వీరిమూలమున బందరులో ననేకసంపన్నగృహస్థులయిండ్లలో వెంకటేశ్వర్లుగారు చికిత్స చేయుటయు సన్మానములుగైకొనుటయు జరిగినది. చికిత్సవడసినవారి పేరు లెల్ల నుదాహరించినచో గ్రంథవిస్తర మగునని సూత్రప్రాయముగా వ్రాయఁబడినవి.

గుడివాడ.

శ్రీ పుచ్చా ఆంజనేయులుగారు.

కోఆపరేటివ్ ఛీఫ్ ఇనస్పెక్టరు. వీరిభార్యకు శ్వాసవ్యాధి. వెంకటేశ్వర్లుగారి నాహ్వానించి చికిత్సచేయించిరి. వ్యాధినివారణ మైనంతనే 116 0-0 లు సన్మానము గావించిరి. వీరిమూలమున గుడివాడలోను, వానపాముల కలువపాముల కొర్నిపాడు మున్నగుతత్పరిసరగ్రామములలోను పెక్కుసంపన్నులయిండ్ల వెంకటేశ్వర్లుగారు వైద్యముగావించి సత్కారము లందసాగిరి.

బెజవాడ.

శ్రీ ఘంటసాల నరసింహంగారు.

పి. డబ్ల్యు. ఆఫీసులో నుద్యోగులు. వీరు చిరకాలము చలిజ్వరము (మలేరియా.) చే బాధపడి తుదకు వెంకటేశ్వర్లుగారిచేఁ జికిత్స వడసిరి, వ్యాధి సంపూర్తిగా నివారణ మయినది. తోడనే తమకు రెండుమాసములకు వచ్చెడి వేతనము

పాతోషికముచేసి కృతజ్ఞతను వెల్లడించిరి. వీరిపరిచయమును బట్టి బెడవాడలోఁ గూడ ననేకస్థలములయందు వెంకటేశ్వర్లు గారు వైద్య మొనరించి సన్మానింపఁబడిరి.

ఏలూరు.

శ్రీ గోటేటి కృష్ణమూర్తిగారు.

పి. డబ్ల్యు. ఓవర్‌సీరు. వీరియింట వెంకటేశ్వర్లుగారు పలుసారులు వైద్యముచేసి సన్మానింపఁబడిరి.

రాజమహేంద్రవరము.

శ్రీ కాశీవజ్ఝల సోమేశ్వరరావుగారు, ప్లీడరు.
శ్రీ దేవత శ్రీరామమూర్తిగారు, హైకోర్టువకీలు.
శ్రీ లక్కరాజు వెంకటాచలంపంతులుగారు, ప్లీడరు.
శ్రీ గంటి చినవెంకటరామయ్యగారు, ప్లీడరు.

మున్నగు సుప్రసిద్ధగృహస్థుల కుటుంబములలో వెంకటేశ్వర్లుగారు పలుమారులు వైద్య మొనరించి సన్మానింపఁబడిరి.

మఱియు రాజమహేంద్రవరమున వైద్యమారంభించి నదిమొదలు వెంకటేశ్వర్లుగారు శ్రీరాంభొట్ల వీరయ్యగారింట బస చేయుచుండిరి.

వీరయ్యగారు సదాచార పరాయణులు. అనుదినము పార్థివలింగపూజ శ్రీమద్రామాయణపారాయణము గావించు నియమనిష్ఠులు, సహృదయులు. ఇట్టిసదాచారసంపత్తిగలవారి యందు వెంకటేశ్వర్లుగారికి మిగుల నాదరము. వీరయ్యగారి యోగ్యతాదికము గమనించి రాజమండ్రిలో నెలకొల్పఁబడిన

తమయాయుర్వేదనిలయము బ్రాంచిలోఁ బ్రతినిధిగా నియమించిరి.

కాకినాడ.

మ॥ రా॥ శ్రీ॥ దివాన్ బహదూరు దురుశేటి శేషగిరిరావు పంతులుగారు, హైకోర్టువకీలు కైజరు హిందూ మెడలిస్టు.

వెంకటేశ్వర్లుగారు వీరికుటుంబమున నెన్నియో మారులు వైద్యమొనరించి గౌరవించఁబడిరి.

మఱియు శ్రీ శేషగిరిరావుగారు జిల్లాబోర్డు ప్రెసిడెంటుగా నున్నసమయమున సుప్రసిద్ధులగు నాయుర్వేదవైద్యులకు ప్రతిసం॥రము గ్రాంటులొసగు నేర్పాటు చేయఁబడినది. ఈ గ్రాంటులు మూఁడుతరగతులుగా నుండెడివి. మొదటితరగతి 200 రెండవతరగతి 100 మూఁడవతరగతి 50. శ్రీ శేషగిరిరావుగారు వెం॥గారి వైద్యచాతుర్యము పూర్తిగా నెఱింగిన వారగుటచే మొదటితరగతివారి కీయఁదగు 200 లు గ్రాంటుగానిచ్చుచుండిరి. జిల్లాబోర్డువా రేర్పరించిన మార్గము ననుసరించి తాలూకాబోర్డులుకూడ సిట్టిగ్రాంటు లొసంగుచుండెడివి. చింతలూరు రామచంద్రపురంతాలూకా గ్రామమగుటచే రామచంద్రపురంతాలూకాబోర్డువారుకూడ వెంకటేశ్వర్లుగారికి ప్రతిసం॥రము గ్రాంటు నీయసాఁగిరి.

వెంకటేశ్వర్లుగారి వైద్యప్రతిభ నౌషధనిర్మాణచాతురిని గమనించి శ్రీ శేషగిరిరావుపంతులుగారు వ్రాసిన యోగ్యతాపత్రి మీక్రింద నీయఁబడుచున్నది.

మ. రా. రా. శ్రీ దివాన్ బహదూరు
దురుశేటి శేషగిరిరావు పంతులుగారు హైకోర్టువకీలు,
కైజర్ హిందు మెడలిస్టు, కాకినాడ.

చింతలూరు వాస్తవ్యులగు వైద్యరాజ ద్విభాష్యం వేంకటేశ్వర్లుగారిని నేను చాల సంవత్సరములనుంచి యెరుగుదును. వీరు సుప్రసిద్ధ ఆయుర్వేద వైద్యులు. అనేక ఇతరడాక్టర్లు ఆశలేదని నిర్ధారణచేసిన యెన్నియో వ్యాధులను వీరు జయప్రదముగ కుదర్చిరి. వీరిఔషధములు మంచిపనిచేయును. ఇవి శాస్త్రయుక్తముగా యథావిధిగా తయారుచేయబడినవి.

25–9–1925 (సం.) డి. శేషగిరిరావు.

శ్రీ విజ్జపు సత్యానందంగారు సుప్రసిద్ధవదాన్యులు ధనవంతులునగు వైశ్యశిఖామణులు—కాకినాడ. వీరికి గజ చర్మవ్యాధి సంప్రాప్తమైనది. అనేకులచే చికిత్సచేయించిరి. కాని గుణము కానరాలేదు. వెంకటేశ్వర్లుగారిపేరు వీరివైద్యసామర్థ్యము నంతయువిన్న వారగుటచే వెంటనేచింతలూరునకు స్వయముగావచ్చి యిట వీరి నిదానపద్ధతి, యౌషధనిర్మాణాది చాతుర్యము కన్నులారంగని మిగులనానందించి చికిత్సచేయించుకొన నారంభించిరి. తొమ్మిదిమాసము లౌషధసేవ గావించునప్పటికి సంపూర్ణమగు నారోగ్యము చేకూరినది. కష్టసాధ్యమగు నావ్యాధి నీరీతి నశ్రమంబుగ నివారించిన వెంకటేశ్వర్లుగారి యద్భుతచికిత్సానైపుణి కెంతయు నానందించి ఆఱువేయి నూటపదియాఱులు పారితోషికము గావించిరి.

మఱియు వెంకటేశ్వర్లుగారిని కాకినాడలో నివాసముం డవలెననియు సం॥రము 1కి 200 లు వార్షికముగా నొసంగి గృహము మున్నగునేర్పాటులు గావింతు మనియు సత్కారం దంగా రెంతయు భక్తితోఁ బ్రార్థించిరి. కాని తాతతండ్రుల నాఁటినుండియు నివాసమగు [illegible]టలూరు విడిచి వెళ్ళుటకు వెంకటేశ్వర్లుగా రంగీకరింపలేదు.

శ్రీ ముత్తా సర్వారాయఁడుగారు శ్రీమంతులగు వైశ్య శిరోమణులు.

వీరు వెంకటేశ్వర్లుగారిచే వైద్యసహాయము వడసి గొప్పగా సన్మానించిరి. కాకినాడ నగరమున నిల్లెందఱకో వెంక టేశ్వర్లుగారు వైద్య మొనరించి యనేకములగు పారితోషికము లందుకొనిరి.

కాకినాడలో వైద్య మారంభించిన కొలది కాలములో గన్నవరపు మందయ్యగారితో వెంకటేశ్వర్లుగారికి మైత్రి యేర్ప డినది. అందుచేఁ గాకినాడ యెప్పుడు వెళ్ళినను ఈమందయ్య గారింటనే బసచేయుచుండువారు. వీరే కాక వెంకటేశ్వర్లు గారికిఁ గాకినాడలోఁ బలుమంది మిత్రసత్తములు కలరు. అందు

శ్రీ పైండా సూర్యనారాయణమూర్తి జమీందారువారు
శ్రీ కట్టా అమ్మన్నగారు
శ్రీ కందాళ శ్రీరామమూర్తిగారు
శ్రీ మంగు నరసింహంగారు
శ్రీ మర్ల నరసింహశాస్త్రిగారు
శ్రీ మర్ల నారాయణశాస్త్రిగారు
శ్రీ రావి వెంకయ్యగారు

మున్నగువారు ముఖ్యులు. ఇటీవలి పరిచితులలో మ॥ రా॥ శ్రీ రావుసాహేబు పట్టుపట్టు శేషగిరిరావుపంతులుగారు ముఖ్యస్నేహితులు.

పల్లిపాలెం.

శ్రీ చింతపల్లి అచ్చిరెడ్డిగారు.

పాకనాటిరెడ్డికులజులు, గొప్పభూస్వాములు వీరిసోదరులు వీరాస్వామిగారికి "ఆమవాతవ్యాధి" కీళ్ళనొప్పులు, నావు మున్నగుబాధలు కలిగి యొందఱచేతనో చికిత్సచేయించి విసివిరి. తుదకు వెంకటేశ్వర్లుగారి ప్రజ్ఞాదికము విని యాహ్వానించి వైద్యసహాయ మందిరి. అచిరకాలములో వ్యాధి నివారింపఁబడెను. అధికానందముతో మూఁడునూటపదియారులు పారితోషికముగా నొసంగిరి

రామచంద్రపురం.

శ్రీరాజా కాకర్లపూడి చిన్నరామచంద్రరాజు బహద్దరువారు. వీరిభార్యకు "అపస్మారము" సంభవింపఁగా వెంకటేశ్వర్లుగారిచేఁ జికిత్ససేయించి యారోగ్యము కలిగినతోడనే రెండునూటపదియారులు సత్కరించిరి. శ్రీ జొన్నలగడ్డ రామచంద్రరావుగారు మున్నగు సుప్రసిద్ధ న్యాయవాదుల యిండ్ల వెంకటేశ్వర్లుగారిదే వైద్యము.

కపిలేశ్వరపురము.

శ్రీరాజా బలుసు బుచ్చిసర్వారాయుడుగారు, కపిలేశ్వరపురం జమీన్దారువారు.

వీరితల్లిగారికి బహుకష్టసాధ్యమగు "అగుచి. భర్ది" సంభవించినవి. గ్రామస్థవైద్యులు స్థానవైద్యులును చికిత్సలను గావించిరి కాని వ్యాధి యేమాత్రము కూడ శమించలేదు. తర్వాత వెంకటేశ్వర్లుగారిని రావించి చికిత్సచేయించిరి. వ్యాధి నివారించుటతోడనే యానందపూర్వకముగా 500 లు సన్మానము గావించిరి. అప్పటినుండియు [illegible] జమీందారువారు వెంకటేశ్వర్లుగారి యౌషధముల నుపయోగించుచుందురు. వారు తమయనుభవమును దెలియజేయుచు నొసగిన యీ క్రిందియోగ్యతాపత్రము పరికింప నగును.

మ॥రా॥రా॥శ్రీ జబ్బతుల్ యకరాన్ శ్రీ బలుసు బుచ్చిసర్వారాయుడు జమీందారువారు, కపిలేశ్వరపురం,

కేశనకుర్రు యస్టేటు.

చింతలూరు ఆయుర్వేద నిలయమునందు వైద్యరాజ ద్విభాష్యం వెంకటేశ్వర్లుగారిచే తయారుచేయబడుచున్న ఔషధములను మేము వాడిచూచితిమి. అవి చాలా విలువగలిగినవియును, శ్రేష్ఠములైనవియునై యున్నవని మేము అనుభవమువలన దెలిసికొంటిమి. పిలచిన పలుకునట్లు పనిచేసెడి యీ యౌషధముల నందరును వాడదగినవి. ధరలుకూడ చాలసరసముగ నున్నవి.

కపిలేశ్వరపురం,
16—10—25

సం॥ బి. బి. సర్వారాయుడు.

శ్రీ మేకా పాపారాయుడుగారు. సంపన్నులగు కమ్మ కులజులు. వీరియింటిలోడలికి తీవ్రమైన "అతిసారము" వెంక టేశ్వర్లుగారు నివారించి రు 116 లు సన్మానము గైకొనిరి.

శ్రీ బలుసు బుచ్చిపట్టాభి రామయ్యగారు.

వీరికి కీళ్ళనొప్పులు. వెంకటేశ్వర్లుగారి చికిత్సవలన నారో గ్యవంతులై రెండు నూటపదియారులు సత్కారము గావించిరి

మఱియు శ్రీక్రొవ్విడి సుబ్బారావుగారు, గారపాటి రామయ్యగారు మున్నగుసంపన్నగృహస్థులయిండ్లలో వైద్య సహాయము గావించి నూటపదియారులు లెన్నియో సత్కారము గాఁ గైకొనిరి.

ఈతకోట.

శ్రీ తిరువూరి సూర్యనారాయణ రావుగారు

వీరిభార్యకు "శోఫవ్యాధి" (ఉబ్బు) సంభవింపఁగా సకు టుంబులై చింతలూరువచ్చి వెంకటేశ్వర్లుగారిచే వైద్యచికిత్స వడసి యారోగ్యముకలిగినతర్వాత రు 116 లు సత్కారము గావించిరి.

మఱియు నీగ్రామస్థులగు కాట్రావులపల్లి అయ్యపరాజు గారు, నారాయణమూర్తిగార్ల కుటుంబములందు వైద్యమొన రించి తగుసత్కారములందిరి.

జొన్నాడ.

శ్రీ తాడి రమణయ్యగారు తమ తమ్ముఁడు చంద్రయ్య గారికి వెంకటేశ్వర్లుగారిచే వైద్యముచేయించి వ్యాధి నివారణ మైనతోడనే రూ 116 లు బహూకరించిరి.

దుళ్ల.

శ్రీ మునుసూరి వెంకటనారాయణగారు

అజీర్తి, అరుచి నివారించి యారోగ్యస్థితికలుగఁజేయుటచే వెంకటేశ్వర్లుగారికి రూ 116 లు పారితోషికము గావించిరి.

పెద్దేవము.

శ్రీ కొచ్చెర్లకోట లక్ష్మీపతిగారు

వీరికుమారునకు శుక్లమేహము, అందువలన కీళ్ళనొప్పులున్ సంభవింపఁగా వెంకటేశ్వర్లుగారు చికిత్సచేసి యారోగ్యవంతున్ నొనరించిరి. వారును సంతోషపూర్వకముగా రూ 116 లు సత్కారము గావించిరి.

పులుగుర్త.

శ్రీ పులుగుర్త కామేశ్వరరావుగారి కుటుంబవైద్యులై వెంకటేశ్వర్లుగా రనేకములగు సన్మానములందిరి.

లొల్ల.

శ్రీ బంధకవి కామరాజుగారి కుటుంబములోఁ బెక్కు సారులు వైద్యముచేసి వెంకటేశ్వర్లుగారు బహూకరణము లందు కొనిరి.

తాపేశ్వరము.

శ్రీ బోడా సుబ్బారావుగారు
,, కనకరాజుగారు
,, వెంకటరాజుగారు

సంపన్నులగు నీవైశ్యశిఖామణుల కుటుంబ వైద్యులై పలుమారులు వైద్యమునరించి పెక్కుబహుమానములందిరి.

కడియం,

శతావధాని చెళ్లపిళ్ళ వెంకటశాస్త్రిగారు. వీరి పెద్దకొమరునకు శ్వాసవ్యాధి సంభవించి చిరకాలము పీడించినది. వెంకటేశ్వర్లుగారి నాహ్వానించి చికిత్సచేయించి వ్యాధి యుపశమించుటచే సంతసించి రూ 116 లు ధనము, జలతారుపట్టుసేలువ బహుమానము గావించిరి. ఈవిషయములు శ్రీ వెంకటశాస్త్రిగారు తమ జీవితచరిత్రప్రతిపాదకమగు "జాతకచర్య" అను గ్రంథమున నుత్తరార్ధములో నిటులు వ్రాసియున్నారు.

గీ॥ తాను నూటాఱు గైకొనఁ దగ్గుఁ డగుట
నొరుల కష్టపు నూటారు లొసఁగుభాగ్య
మితనికి ఘటించె గురుదశ యిదియ కాదు
రాహుదశ కూడ నీయుదారత ఘటించె॥

క॥ ఈయీవి తనకుఁ గొమరుల
కాయత మారోగ్యమిడిన యాయుర్వేద
శ్రీయుతుఁడు వేంకటేశుఁకు

... ... ...

మఱియు వెంకటశాస్త్రిగారు పలుమాఱులు వీరియుత్తమౌషధములు సేవించి తమయనుభవమును వెల్లడించుచు నీక్రింది యోగ్యతాపత్రి మొసఁగిరి.

చ. అరసితి నే స్వయమ్ముగ మహత్తరమైన ద్విభాష్య వెంకటే
శ్వర నిలయౌషధావళిని శాస్త్ర మెటుల్ వచియించునట్టులే
సరిగ నొనర్చి లోకుల కొసంగును రెండును మోసగింప రెం
డటు జనులో సుఖంబు గననౌ నని చెప్పెద వీరి హేతువే॥

రంగాపురము.

ఒకరాజకుటుంబిని కష్టసాధ్యమగు నుదరవ్యాధి సంభవింపఁగా స్వయముగఁ జింతలూరువచ్చి వెంకటేశ్వర్లుగారి వైద్యసహాయమున నారోగ్యమునందఁ గలిగిరి.

నరేంద్రపురం.

శ్రీ రాణి గోపన్నదీక్షితులుగారు
శ్రీ రాణి సుబ్బావధానులుగారు
శ్రీ నిడదవోలు వెంకన్నగారు

మున్నగు సంపన్నులయిండ్లలో వెంకటేశ్వర్లుగారు తఱచు వైద్యము చేయుచు సత్కరించఁబడిరి.

శ్రీ మంగిపూడి విస్సన్నదీక్షితులుగారికి శ్లేష్మవ్యాధి నివారణ మొనరించి రు 116 లు సత్కారము వడసిరి.

రావిపాడు.

శ్రీ అయ్యగారి సూర్యప్రకాశంగారు.

వీరి యనుజన్ములు యోగిసోమయాజులుగారికి "అతిమూత్రవ్యాధి." వెంకటేశ్వర్లుగారిచే వైద్యసాహాయ్యము వడసి రు 116 లు సత్కరించిరి.

నందంపూడి అగ్రహారము.

శ్రీ వడ్లమాని విశ్వేశంగారు
,, లక్ష్మయ్యగారు
,, బుల్లెవ్వగారు

మొదలగువారి కుటుంబములలో వైద్య మొనరించి మిగులసన్మానము లందిరి.

అనాతవరము,

శ్రీ అనప్పిండి జగ్గయ్యగారు
,, శివరామయ్యగారు

వీరికుటుంబములలోఁ దఱచు వైద్య మొనరించి వెంకటేశ్వర్లుగారు సత్కారము లందుకొనిరి.

మార్టేరు.

శ్రీ తోలేటి గోవిందరావుగారు,
ఇంపీరియల్ బ్యాంకి మానేజరు.

వీరికుటుంబములో వెంకటేశ్వర్లుగారు వైద్యమొనరించి రు 116 లు సత్కారము గైకొనిరి.

పెద్దాపురము.

శ్రీ శ్యాంజీ శ్రీనివాసరావుపంతులుగారు
శ్రీ బంధకవి వెంకటరాయుఁడుగారు
,, సుబ్బారావుగారు

మున్నగుసంపన్నగృహస్థుల కుటుంబములలోను వీరిపరిచయము పురస్కరించికొని పెద్దాపురమున ననేకధనికకుటుంబములలోను వెంకటేశ్వర్లుగారు వైద్యముచేసి సత్కారము లందిరి.

లింగంపర్తి.

శ్రీ అవసరాల బ్రహ్మాజీరావుపంతులుగారు.

పక్షవాతవ్యాధి సంభవించుటచే చింతలూరు సకుటుంబముగా వచ్చి వెంకటేశ్వర్లుగారిచే వైద్యసాహాయ్యము పొంది

యారోగ్యవంతులై కృతజ్ఞతతో రు 116 లు సన్మానించిరి. వీరిమూలమున లింగంపర్తిలోఁ బలుతావుల వైద్యమొనరించుటయు సన్మానింపఁబడుటయు జరిగినది.

పిఠాపురం.

శ్రీ కుంటముక్కల పట్టాభిరామయ్యగారు
డిప్యూటీ తహాసీలుదారు, ఆలమూరు.

వీరిస్వగ్రామము పెద్దాపురంతాలూకా దొంతమూరు. పిల్లల చదువులకై వీరికుటుంబము పిఠాపురములో నుండెడిది. పట్టాభిరామయ్యగారు ఆలమూరులో డిప్యూటీతహసీల్దారుగా నుండువారు. వీరిభార్యకు "శోఫవ్యాధి" సంభవించుటచే వెంకటేశ్వర్లుగారి నాహ్వానించి చికిత్సచేయించి ఆరోగ్యము కలిగిన వెంటనే రూ 116 లును, బంగారుపదకమొకండును బహుమానించిరి.

వీరియల్లుఁడును కిర్లంపూడి సంస్థానాస్థానకవీంద్రులైన శ్రీ సత్యవోలు కామేశ్వరరావుగారి కుమారుఁడునగు వెంకట్రావుగారికి "అజీర్ణవ్యాధి" సంప్రాప్తింపఁగా వెంకటేశ్వర్లుగారు చికిత్సచేసి వ్యాధినివారణముగావించి రూ 150 లు సత్కారముగాఁ గైకొనిరి. అదిమొదలు పట్టాభిరామయ్య గారింటనెవరికేరుగ్మతకలిగినను వెంకటేశ్వర్లుగారి నాహ్వానించి వైద్యము చేయించుకొనుచు ప్రతిసం॥రము రూ 116 లు వార్షికముగా నొసంగుచుండువారు. తనకుమారుఁడగు వెంకట్రావుగారి కారోగ్యము కలిగించుటకెంతయు సంతసించి సత్యవోలు

కామేశ్వరరావుగారికి క్రింద నుదాహరించిన పద్యము లుపహార మొసరించిరి.

మ. రా. రా. శ్రీ సత్యవోలు కామేశ్వరరావుగారు,
కిర్లంపూడి సంస్థానకవి.

సీ. విపులశాస్త్రక్రియా నిపుణత్వము వహించి
ఘనవైద్యుఁ డను ఖ్యాతి గాంచినాఁడు
క్రొత్తవైద్యము గాక కొన్నినాఁటంబుల
నుంచి యుంటను వైద్యమున్నవాడు
శాంతభూతదయాది సద్గుణంబులు గల్గి
చెలిమియొప్ప చికిత్సచేయువాడు
శ్రీఘ్రమీరగ సుప్రసిద్ధౌషధములు శా
స్త్రహితమ్ముగా జేయ జాలువాడు
తే. గీ. వైద్యరాజబిరుదవ ద్ద్విభాష్యం వేంక
టేశ్వర భిషగ్వరుఁడు జనహితుఁడు చతురు
డమల హృదయుఁడు బుధనమ్రుఁడమృతహస్తు
డితని యౌషధరాజంబు లతులితములు.

క. విలువవిశేషము గలిగిన
పలువస్తువులిందుఁ జేర్పబడునను చునెవో
బలుమాటలాడ నేటికి
ఫలితమె ప్రకటించు నెట్టి పరమౌషధమో.

క. మణియుఁడురు గా కేదియొ
తృణమఁదురుగాక నుడుల దెల్పగ నేలా

యిట్టిసూత్రిమేమి రోగికి
గుణమిచ్చిన యట్టిమందె గురుతరముగదా.

క. మామక కనిష్ఠతనయున
కేమందులు గుణమొసంగ కీయనదగు మే
లౌషధారోగ్యంబిడి
క్షేమం బొసగూర్చె వెఙ్కటేశు డగనేలా.

శ్రీ మల్యాల వెంకటేశ్వర్లుగారు.

వీరి కళత్రమునకు జీర్ణజ్వరము. వెంకటేశ్వర్లుగారిచే చికిత్సపడసి యారోగ్యముకలుగంగనే మిక్కిలిగ సత్కరించిరి.

శ్రీ మల్యాల వెంకటరావుగారు.

వీరిభార్యకు "అస్యస్ఫోటము" సంభవించినది. వెంకటేశ్వర్లుగారావ్యాధి పరిశోధన మొనరించి తన్నివారణ కనుగుణమగు నౌషధము కనిపెట్టి చికిత్సనొనరించిరి. ఆరోగ్యమంది తగువిధమున సత్కరించిరి.

శ్రీ అకొండి వెంకటరత్నంగారు,
లక్ష్మీనరసాపురం ఎస్టేటు దివానుగారు.

వెంకటేశ్వర్లుగారి యౌషధములప్రశస్త్యము పూర్తిగా నెఱింగినవారై యెల్లయపుడు వీరియౌషధములనే వాడుచుండువారు

అన్నవరం.

శ్రీ ఈరంకి వెంకటసుబ్బారావుగారు (వామనమూర్తి)

వీరియొక్కయు వీరిసోదరునియొక్కయు కుటుంబములలో వైద్యమొనరించి వెంకటేశ్వర్లుగారు తగుసత్కారములు

గైకొనిరి. వీరిపరిచయమూలకముగా నాప్రాంతములోఁ బహుతావుల వైద్యమొనరించి సత్కరించఁ బడుచుండిరి.

**తుని.**

శ్రీ దేవులపల్లి లక్ష్మీపతిశాస్త్రిగారు, గొప్పసంపన్న కుటుంబులు. పిఠాపురంతాలూకాబోర్డునకుఁ గొంతకాలము ప్రెసిడెంటుగా నుండిరి. వెంకటేశ్వర్లుగారు వీరికుటుంబమునఁ బలుమారులు వైద్యమొనర్చి సత్కరించ బడిరి. తునిలో బ్రాంచి పెట్టుటకు వీ రెంతయుఁ బ్రోత్సహించిరి.

శ్రీ ఆతే వెంకటరావుగారు. తునిలో సుప్రసిద్ధు లగు వ్యాపారధురీణులు. వీరికుటుంబమున వెంకటేశ్వర్లుగారు పెక్కుసారులు వైద్య మొనర్చి సత్కరించఁబడిరి.

తంగేడు,

అల్లమూరురాజావారికి సన్నిహితబంధువులును మొఖాసాదారులు నగు శ్రీసాగివారి రాజకుటుంబములో వైద్య మొనరించి వెంకటేశ్వర్లుగా రధికసత్కారము లందిరి.

**పాయకరావుపేట.**

శ్రీ ఓలేటి రామరాజుపంతులుగారు,

గోడేవారియెస్టేటుతానాదారులు.

వీరి కుటుంబమునఁ బెక్కురకు శ్లేష్మజ్వరములు పీడింపఁగా వెంకటేశ్వర్లుగారిని బిలిపించి చికిత్స సేయించి యారోగ్య వంతులై రు 116 లు పారితోషిక మొసంగిరి,

నర్సీపట్నము.

శ్రీ ధవళ వేంకటనర్సయ్యగారు.

వీరికుమారునకు "గళగండమాల" సంభవింపఁగా రెండుమూఁడుమారులు శస్త్రచికిత్స గావింపఁబడినను వ్యాధి సమూలముగా నశింపలేదు. అంతట వెంకటేశ్వర్లుగారి వైద్య కౌశల మాప్తులవలనఁ దెలిసికొని వీరి నాహ్వానించి చికిత్స చేయించిరి. సంపూర్ణమగు నారోగ్యమందినమీఁద తగురీతిని సత్కారము గావించిరి.

ఎలమంచిలి.

శ్రీ పొట్టిముత్తు సూర్యనారాయణగారు, వకీలు.

వీరియింటికోడలికి శ్లేష్మవ్యాధి. వెంకటేశ్వర్లుగారు చికిత్సచేసి రు 116 లు సత్కారము వడసిరి.

మఱియు శ్రీ ఆచార్య సీతారామయ్యగారు మొదలగు పెద్దగృహస్థులయిండ్లలో వైద్య మొనరించి విశేషము లగు సత్కారములు గైకొనిరి.

ఖసింకోట.

శ్రీ దురుశేటి నరసింహారావుపంతులుగారు.

వీరు వెంకటేశ్వర్లుగారి వైద్యసహాయము వడసి తగురీతిగ సన్మానించిరి. అవసరమగునపు డెల్ల వీరియౌషధములే ఉపయోగించుచుందురు.

అనకాపల్లి.

శ్రీ తాటికొండ నూకరాజుగారు

,, జగ్గారాయుడుగారు

మున్నగు పెద్దపెద్దసంపన్నుల కుటుంబములలోఁ బెక్కుమారులు వెంకటేశ్వర్లుగారు వైద్యము చేసి యధికములగు సత్కారములందిరి. అనకాపల్లిలో బ్రాంచి యేర్పాటుచేయుటలో వీరెంతయుఁ బ్రోత్సాహ మొసంగిరి.

విశాఖపట్టణము.

రావుబహదూరు బుద్ధవరపు నారాయణమూర్తిపంతులు గారు, రిటైర్డు డిప్యూటీకలెక్టరు, గోడేవారి యెస్టేటుదివాను.

వీరికుటుంబములోను వెంకటేశ్వర్లుగారి యౌషధములను, తఱచు వాడుచుందురు.

శ్రీ తోలేటి కైలాసరావుగారు,

సూపరెంటెంటెంటు ఇంజనీరింగు ఆఫీసు మానేజరు.

వీరికుటుంబమునందు వెంకటేశ్వర్లుగా రెన్నియో పర్యాయములు వైద్యము చేసి సత్కారములందిరి. వీరిపరిచయమును బట్టి యింజనీరింగు ఆఫీసులోని యుద్యోగుల పలువుర ఇండ్లలో వెంకటేశ్వర్లుగారు వైద్యమొనర్చి గౌరవింపఁబడుచుండిరి.

మ॥ రా॥ రా॥ శ్రీ ఇజ్జితాసార్ శ్రీకంకుమూరి బాల కృష్ణప్రసాదరు మహారాజు బహద్దరుగారు ఆఫ్ దేవిడివస్తైరా దేవిడిహౌసు, విశాఖపట్టణము.

వీరు వెంకటేశ్వర్లుగారి ప్రజ్ఞాదికము విని యౌషధమిచ్చించి బలవర్ధకమగు చికిత్సనంది పూర్ణబలముచేకూరినమీఁద ఔషధపుకర్చులును నూటపదియాఱులు సత్కారము గావించిరి. తరువాత నవసరమగునప్పుడెల్ల వీరియౌషధముల నే వాడుచుండిరి. వీరి యౌషధముల ప్రాశస్త్యమునుగుఱించి తమకుఁగల సదభిప్రాయము వెల్లడించుచు నీక్రింది యోగ్యతాపత్రమొసంగిరి.

మ. రా. రా. శ్రీ ఇజ్జితాసార్ శ్రీ కందుకూరి బాలసూర్యప్రసాద రావు పంతులు బహద్దరుగారు ఆఫ్ దేవిడివగైరా

దేవిడీహౌసు, విశాఖపట్టణము, ది 15 మార్చి 1926 సం॥రం

చింతలూరు వాస్తవ్యులు వైద్యరాజ ద్విభాష్యం వేంకటేశ్వర్లుగారి యౌషధములను నేను వాడితిని. శాస్త్రోక్తముగా చేయబడుచున్న నీయౌషధములుచక్కఁగాపనిచేయునని నేనెఱుగుదును. ఆంధ్రదేశ మీవైద్యశిఖామణిని గౌరవించుగాక. వీరియౌషధములు నమ్మకమైనవని తెలుపుటకు నా కేసంశయమూ లేదు.

(సం.) ఇజ్జితాసార్ శ్రీకందుకూరి బాలసూర్యప్రసాదరావు ఆఫ్ దేవిడీ వగైరా.

విజయనగరము,

శ్రీ చావలి రామమూర్తిగారు
శ్రీ నేమాని సుబ్బారావుగారు

శ్రీ అప్పల జోగన్న శాస్త్రిగారు (సంస్కృత కాలేజీపండితులు) మున్నగు గృహస్థుల కుటుంబములలో వెంకటేశ్వర్లు గారు పలుతడవులు వైద్యముచేసి సత్కారములందిరి.

పర్లాకిమిడి.

శ్రీ గాడిచర్ల సుబ్బారావుగారు
అగ్రికల్చరల్ డిమాన్‌స్ట్రేటరు.

వీరికుటుంబములో వెంకటేశ్వర్లుగారు వైద్యముగావించి సత్కరించఁబడిరి. పర్లాకిమిడి "ఏజన్సీ"ప్రాంతమగుటచే నచటి యడవులలోని కపుడప్పువెళ్లి నూతనమూలికలస్వరూపస్వభావము లచటికొండజాతులవారివలనఁ దెలిసికొనుచుండువారు.

ఇట్లు మదరాసు మొదలుకొని పర్లాకిమిడివరకుఁగల యాంధ్రదేశమ్మునందెల్లయెడల రమారమి యిరువది సం॥రములవిచ్ఛిన్నముగా వైద్యవ్యాప్తిగావించి విశేషమగు విఖ్యాతియు ధనమును సంపాదింపఁగలిగిరి.

---

ఓం

శ్రీమద్ధన్వంతరయేనమః

# శ్రీ ద్విభాష్యం వెంకటేశ్వర్లు గారి జీవిత చరిత్రము.

——:౦: ఏడవ పరిచ్ఛేదము :౦:——

(ఆయుర్వేదవైద్యసమ్మేళనములు, ఔషధప్రదర్శనములు, స్వర్ణపతకాది సన్మానములు.)

భరతఖండమున ననాదిసిద్ధమయి మహర్షిసంప్రదాయాగతమగు నాయుర్వేదము రాజావలంబనము కొఱవడుటచే క్రమక్రమముగా క్షీణదశ నందఁజొచ్చినది. ఆ దుఃస్థితి నవలోకించి మహామహులగు నాయుర్వేదవైద్యశేఖరులు కొందఱు తమందఱు యాయుర్వేదసమున్నతి గావింపనెంచి భారతదేశమునకంతకు సంబంధించిన సంస్థ నొకదాని నేర్పఱచిరి. అదియే "నిఖిలభారతాయుర్వేద వైద్యసమ్మేళనము."

భారతదేశమునఁ దలిసుప్రసిద్ధవైద్యు లెందఱేని యీ సంస్థలో సభ్యులుగాఁ జేరి ప్రతిసంవత్సర మొక్కొకమహానగరమున మహాసభాసమావేశములు జరుపుచుండిరి. అట్లు కొన్ని సం॥రములు గడచినమీఁదట నాసంస్థ కనుబంధములుగాఁ బ్రతిదేశమందును శాఖాసంస్థ లేర్పాటుచేయఁబడినవి. మనయాంధ్రదేశమునందును "ఆంధ్రాయుర్వేదవైద్యసమ్మేళనము" అను పేరితో నొకయనుబంధశాఖ నెలకొల్పఁబడెను. 1917 సం॥

రము నవంబరునెలలో వైద్యరత్న పండిత డి. గోపాలాచార్యులవారి యాధిపత్యమున ప్రథమాంధ్రాయుర్వేదవైద్యసమ్మేళనము బెజవాడలో జరుపఁబడునని ఆంధ్రపత్రికలోఁ బ్రకటింపఁబడినది. వెంకటేశ్వర్లుగా రప్పటికి పెద్దాపురంతాలూకా లింగంపర్తిలో అవసరాలవారింట వైద్యము చేయుచుండిరి. ఆంధ్రపత్రికలోని యాప్రకటనము వారికంటఁబడినది. సమ్మేళనము మఱునాఁడే యగుటచే వెనువెంటనే రెండెడ్లబండి కట్టించుకొని యచ్చట కిరువదిమైళ్ళదూరమం దున్నసామల్కోటస్టేషనునకు సాయంత్రమగుసరికిఁ జేరిరి. కాని నాఁటిరైలు దాటిపోయినది. మఱునాఁ డుదయముబండిలో బయలుదేరి మధ్యాహ్నమగుసరికి బెజవాడ చేరికొని సభాసమావేశములలోఁ బాలుగొనిరి.

ఔషధప్రదర్శనమున కేర్పాటుచేయఁబడిన సమయము మించిపోవుటచే వెంకటేశ్వర్లుగారియౌషధము లాసమ్మేళనములోఁ బ్రదర్శించునవకాశము కలుగలేదు. కాని యధ్యక్షులగుగోపాలాచార్యులుగారును, ఆచంట లక్ష్మీపతిగారును మాత్రము స్వయముగాఁ బరీక్షించి చూచి సంతసించిరి. రాఁబోవుసమ్మేళమునకుఁ దప్పక యౌషధప్రదర్శనము చేయవలసినదని ప్రోత్సహించిరి.

గోదావరిజిల్లా వైద్యులపక్షమున శ్రీ పైండా సూర్యనారాయణమూర్తిజమీందారువారు ద్వితీయాంధ్రాయుర్వేదవైద్యసమ్మేళనము కాకినాడలో జరుపవలసినదిగా నాహ్వానించిరి. సభాసమావేశములన్నియు జయప్రదముగా నెఱవేరినవి.

## 1918

### కాకినాడలో ద్వితీయాంధ్రాయుర్వేద వైద్యసమ్మేళనము.

ఈమహాసభకు శాళహాస్తివాస్తవ్యులు బ్రహ్మశ్రీ కొంపెల్ల చెంచురామశాస్త్రిగా రధ్యక్షతవహించిరి. పండిత డి. గోపాలాచార్యులుగారు, డాక్టరు ఆచంట లక్ష్మీపతిగారుమున్నగు వైద్యప్రముఖు లెల్ల రరుదెంచి సభ నలంకరించిరి. కౌమారభృత్యము త్రిదోషతత్త్వము మున్నగువిషయములలో వ్యాసరచనకు పోటీపరీక్షలు జరుపఁబడినవి. పరీక్షయం దుత్తీర్ణులగువారికి ప్రత్యేకవ్యక్తులుగాని వైద్యసంఘములుగాని పారితోషిక మొసంగుటకు నిర్ణయించఁబడెను ఔషధప్రదర్శనములో నుత్తమతరగతివారికిఁగూడ బహుమానము లేర్పాటుచేయఁబడినవి. వెంకటేశ్వర్లుగారి సమ్మేళనముందుఁ బాల్గొని "కౌమారభృత్యము"ను గుఱించి వ్యాసరచనముఁగావించి పోటీకి నిలఁబడిరి. పరీక్షకులచే వీరివ్యాసము తద్విషయకవ్యాసములలో నుత్తమతరగతిగా నిర్ణయింపఁబడుటచే "ఏలూరు వైద్యసంఘమువారు" సువర్ణపదకము బహూకరించిరి, ఔషధప్రదర్శనమునందును 150 రకముల యౌషధములఁ బ్రదర్శించి యుత్తమతరగతిగా నిర్ణయింపఁబడుటచే సువర్ణపతకముబహుమానముగాఁ గైకొనిరి.

మఱియు నీసమ్మేళనమున "త్రిదోషతత్త్వము" అనువిషయములో వరంగల్ నివాసులు, విద్వత్కవికుంజర కామసముద్రం వెంకటకృష్ణమాచార్యులుగారిచే వ్రాయఁబడిన వ్యాసముత్తమతరగతిగాఁ బరీక్షకులచే నిర్ణయించఁబడుటచే నావ్యాసకర్తల కొసఁగఁదగు స్వర్ణపదకము వెంకటేశ్వర్లుగారిచే నీయఁ

బడెను. వెంకటేశ్వర్లుగారు తాము బహుమానముగైకొనుట యేకాక యితరులకుఁగూడ బహుమానము లొసంగినవారై సమ్మేళనమున నెంతయు శ్లాఘాపాత్రులైరి. కాకినాడయందలి సంపన్నగృహస్థు లెంతమందియో యీసమ్మేళనమునకు వచ్చి సభాకార్యక్రమము చూచి మిగుల నానందించిరి. అట్టివారిలో మ. రా. శ్రీ శ్రీపాద నరసింహంగా రొకరు వీరు కాకినాడలో సుప్రసిద్ధులగు వ్యాపారులు. వెంకటేశ్వర్లుగారి వైద్యప్రతిభ యౌషధప్రాశస్త్యము సభాముఖమున నెఱింగి తమగృహమున కాహ్వానించి తమసోదరికి భార్యకును వైద్యము చేయించిరి. వ్యాధినివారణమైన తరువాత గొప్పగ సన్మానించిరి. నాఁటి నుండియు శ్రీపాద నరసింహంగారి కుటుంబములో వెంకటేశ్వర్లుగారి యౌషధములనే యుపయోగించుచుందురు.

1919

ఈసంవత్సరమున నిఖిలభారతాయుర్వేదవైద్యసమ్మేళనము భారతదేశరాజధానియగు ఢిల్లీలో మ॥ రా॥ శ్రీ హకీమ్ అజ్మల్ ఖాన్ గారి అధ్యక్షతను జరుపఁబడినది. వెంకటేశ్వర్లుగారీసమ్మేళనమునకుఁ దమయౌషధములంపి ప్రదర్శించిరి. అచటి పరీక్షకులు వీరియౌషధముల నత్యుత్తమతరగతిగా నిర్ణయించి యోగ్యతాపత్ర మొసంగిరి

1920

శ్రీకాకుళములో చతుర్థాంధ్రాయుర్వేద వైద్యసమ్మేళనము. (శ్రీ) కందుకూరి బాలసూర్యప్రసాదరావుపంతులు బహాదర్ జమీందారు ఆఫ్ దేవిడి ఎస్టేటువారు రాహ్వానసంఘాధ్యక్షులు.

ఆయుర్వేదభూషణ నోరి రామశాస్త్రి గారధ్యక్షులు, వెంకటేశ్వర్లుగారీసమ్మేళనమునందుఁ బాల్గొని యౌషధప్రదర్శనముఁగావించి ఉత్తమతరగతి సువర్ణపదకము బహుమానమందిరి.

ఈ సంవత్సరముననే డాక్టరు ఆచంట లక్ష్మీపతిగారి యధ్యక్షతను గోదావరీమండలాయుర్వేదవైద్య సమ్మేళనము "రాజమహేంద్రవరము"నందు జరుపఁబడెను. వెంకటేశ్వర్లుగారీసమ్మేళనమునకు "కుష్ఠరోగము"ను గురించి వ్యాసరచనము చేసి పోటీపరీక్షకుఁబెట్టిరి. ఉత్తమతరగతిగానిర్ణయింపఁబడి స్వర్ణపదకమిచ్చుట కంగీకరింపఁబడినది.

మఱియు నీవత్సరమందు కాకినాడ తాలూకా పల్లిపాలెం గ్రామములో జరిగిన ఆయుర్వేదవైద్య మహాసభకు వెంకటేశ్వర్లుగారగ్రాసనాధిపతులై సభలు జయప్రదముగా నిర్వహించిరి.

## 1921

తెనాలిపురమున ఐదవ ఆంధ్రాయుర్వేద వైద్యసమ్మేళనము. ఆయుర్వేదకలావిభూషణ విద్వాన్ కె. శేషశాస్త్రి గారగ్రాసన మధిష్ఠించిరి. వెంకటేశ్వర్లుగారి యౌషధము లీసమ్మేళమందును బ్రదర్శింపఁబడి యుత్తమతరగతి సువర్ణపదకమీయఁబడినది శ్రీ శేషశాస్త్రిగారు వీరియౌషధముల ప్రాశస్త్యము గమనించి యుపయోగించుచుఁ దమ యనుభవమును లోకమునకు వెల్లడించుటకైసంస్కృతభాషలోనొక యోగ్యతాపత్రమును బిమ్మట బంపించిరి.

## శ్రీమాన్ ఆయుర్వేదకలావిభూషణ విద్వాన్
## కే. శేషశాస్త్రిగారు ఎ. వి. యస్. ఆయుర్వేదరత్న.

గోదావరీ మండలాంతర్గత చింతలూరు గ్రామవాస్తవ్యానాం శ్రీమతాం ద్విభాష్యం వేంకటేశ్వర మహాశయానాం మహౌషధాని భస్మసిందూరాదీని వివిధాని సమాకలితవాన్ త్రిచతుర్వత్సరాదారభ్య తత్రతత్ర వైద్యసమ్మేళనాదిషు ఉపాయఃజంచాతురేభ్యః కానిచన ఔషధానీమాని మహతా పరిశ్రమేణ శాస్త్రీయమార్గమజహతా కృతానీతి మహదానందాస్పదం. శ్రీమతాం వేంకటేశ్వర మహాశయానామేతాదృశపుణ్యాయురామ్నాయహిత వైద్యకశాస్త్రపరిశ్రమః పరికామం శ్లాఘనీయః శ్రీభగవదనుగ్రహేణ శ్రీమతామేతేషాం సర్వత్ర విజయో భూయాదితి సానందమాశాసె

శృంగేరీ, 17-8-25. (సం॥) విద్వాన్ కే. శేషశాస్త్రి.

## 1922

రాజమహేంద్రవరమున 13వ నిఖిలభారతాయుర్వేద వైద్యసమ్మేళనము. పూనావాస్తవ్యులు జగత్ప్రసిద్ధవైద్యవిద్వాంసులు నగు వైద్యపంచానన, కృష్ణశాస్త్రి కవడే బి. ఏ. గారగ్రాసనాధిపతులు. వెంకటేశ్వర్లుగారీ సమ్మేళనమునందును పాల్గొని మహౌషధప్రదర్శనము గావించిరి. ఉత్తమతరగతిగా నిర్ణయింపబడి, సువర్ణపదకము యోగ్యతాపత్రమును సభాధ్యక్షులచే నీయబడెను.

## 1923

నెల్లూరుపురమున 6 వ ఆంధ్రాయుర్వేద వైద్య సమ్మేళనము. కవిరాజ శ్రీమాన్ ప్రతివాదిభయంకరం కృష్ణమాచార్యుల వారధ్యక్షులు వెంకటేశ్వర్లుగారి యౌషధ ప్రదర్శనము గావింపఁబడినది ఉత్తమతరగతిగా నిర్ణయింపఁబడి బంగారు మెడలిచ్చుట కంగీకరింపఁబడెను

## 1925

మదరాసు మహానగరమున 7వ ఆంధ్రాయుర్వేద వైద్య సమ్మేళనము. డాక్టరు దంటు సుబ్బావధానులుగారు సభాధ్యక్షులు. ఔషధప్రదర్శనాది కార్యక్రమము యథాపూర్వముగా జరిగినది. వెంకటేశ్వర్లుగారి యౌషధము లుత్తమతరగతిగా నిర్ణయింపఁబడినవి. సువర్ణపదక బహూకరణము జరుపఁబడెను. వెంకటేశ్వర్లుగారీ రీతిగా నాంధ్రదేశమందును దేశాంతరములందును జరిగిన వైద్యసమ్మేళనములలోఁ బాల్గొని శాస్త్రపాండితిలోను ఔషధనిర్మాణాదికమందును మిగుల విఖ్యాతులైరి.

---

ఓమ్

శ్రీసద్ధన్వంతరయేనమః

# శ్రీ ద్విభాష్యం వెంకటేశ్వర్లుగారి జీవిత చరిత్రము.

## ఎనిమిదవ ప్రకరణము.

(ఆయుర్వేదాధ్యాపనము, వెంకటేశ్వర్లుగారియొద్ద చదివి యుత్తీర్ణులైన శిష్యులు.)

ఏవిద్యగాని యధ్యయనాధ్యాపనాచరణప్రచారములు లేనిదే రాణించదు. అధ్యయనమువలన విషయపరిజ్ఞానము మాత్రము కలుగును. అధ్యాపనమువలన విషయవిమర్శనము విశేషాంశపరిగ్రహణము మున్నగునవి సంభవించును.

వెంకటేశ్వర్లుగారు తమపితృపాదులయొద్ద కర్మపథాభ్యాసపురస్సరముగా వైద్యశాస్త్ర మధ్యయనంబొనర్చి యంతేవాసు లెందఱికో పాఠప్రవచనములు గావించి యాయుర్వేద మహాసముద్ర మథనమున నెన్నియో యనర్ఘౌషధరత్నముల వెలువరించి లోకోపకార మొనరించుచుండిరి.

వీరివద్ద వైద్యశాస్త్ర మధ్యయనముచేసిన శిష్యులలో శ్రీ తాతఘంటి లక్ష్మీనారాయణగారు ప్రథములు. వీరు చింతలూరులోఁ గొన్నిసంవత్సరములుండి వెంకటేశ్వర్లుగారియొద్ద నిదానము, చికిత్స, ఔషధనిర్మాణము మున్నగువిషయములలోఁ బ్రవీణులైరి.

రామచంద్రపురం తాలూకా తోస్సిపూడిగ్రామమున వైద్యవ్యాపకము సేయుచు తగినంత చరస్థిరవసతి సంపాదించి యున్నారు.

శ్రీ మధునాపంతుల కామరాజుగారు పల్లిపాలెం.

వీరు కఠుంగదుశ్రద్ధాభక్తులతో గురుశుశ్రూష గావించుచు వెంకటేశ్వర్లుగారియొద్ద వైద్యశాస్త్ర మభ్యసించిరి. ఇంతకుముందే వీరు పి జరంగ్రామములోని సంస్కృతపాఠశాలలో సాహిత్యగ్రంథములు చదివియున్నందున వైద్యశాస్త్రపఠనమున కాజ్ఞాన ముపకరించినది. నిదానచికిత్సాది విషయములలోను ఔషధనిర్మాణమునందును ప్రావీణ్యముగడించిరి. ఈ కామరాజుగారు స్వగ్రామముననే యుండి వైద్యప్రచారము గావించుచున్నారు.

శ్రీ పెద్దాడ కామేశ్వరరావుగారు.

వీరు వెంకటేశ్వర్లుగారి యొద్ద వైద్యశాస్త్రము చదివి "వైద్యవిద్వాన్" పరీక్షలో నుత్తీర్ణులైనారు.

శ్రీ కూచిభట్ల వెంకటేశ్వర్లుగారు.

బహుబాల్యమునుండియు వెంకటేశ్వర్లుగారివద్దనుండి వైద్యశాస్త్రము చదివి చికిత్స, నిదానము, ఔషధనిర్మాణము మున్నగువిషయములలో నారితేరి "వైద్యవిద్వాన్" పట్టము నందఁగలిగిరి.

**శ్రీ ద్విభాష్యం వెంకటరావుగారు, మండపేట.**

వీరు ఇంగ్లీషుభాషలో స్కూలుఫైనలు పరీక్ష నిచ్చిరి. తరువాత వెంకటేశ్వర్లుగారియొద్ద వైద్యశాస్త్ర మభ్యసించి "వైద్యవిద్వాన్" పరీక్షలో జయమందిరి.

**శ్రీ కూచిభట్ల వెంకటసత్యనారాయణమూర్తిగారు అజ్జరం.** వెంకటేశ్వర్లుగారియొద్ద శిడుభక్తి శ్రద్ధలతోఁ జదివి "వైద్యవిద్వాన్" పరీక్షలోనుత్తీర్ణులైరి. మంచిచికిత్సా నైపుణ్యముగల వైద్యవరులు. స్వగ్రామమగు అజ్జరములోనేయుండి యెక్కువవైద్యప్రచారము చేయుచున్నారు. సత్యనారాయణా యుర్వేదవైద్యశాలయము ప్రతిష్ఠించి నాల్గైదుస్థలములలోఁ బ్రాంచీలు పెట్టి వైద్యవ్యాప్తి సేయుచున్నారు.

**శ్రీ కాకరపర్తి కామేశ్వరరావుగారు, ఖండవిల్లి.**

వెంకటేశ్వర్లుగారియొద్ద చదివి "భిషక్" పరీక్షనిచ్చియున్నారు. స్వగ్రామముననే యుండి వైద్యవ్యాప్తి సేయుచున్నారు.

**శ్రీ ద్విభాష్యం వీరవెంకటసత్యనారాయణమూర్తిగారు చింతలూరు.**

వీరు వెంకటేశ్వర్లుగారి యగ్రజులగు బుచ్చయ్యగారి పుత్రులు. పినతండ్రియగు వెంకటేశ్వర్లుగారియొద్ద వైద్యశాస్త్ర మభ్యసించి "వైద్యవిద్వాన్" పరీక్షలో జయమందిరి. వేంకటేశ్వరాయుర్వేదనిలయము కార్యకలాపములో మిక్కిలితోడ్పడుచున్నారు.

శ్రీద్విభాష్యం కాశ్యప విశ్వనాథంగారు, చింతలూరు.

వెంకటేశ్వర్లుగారి యనుజన్ములగు సుబ్బారాయుఁడు గారి ప్రథమపుత్రులు. పెదతండ్రియగు వెంకటేశ్వర్లుగారియొద్ద వైద్యశాస్త్రమధ్యయనముసేసి "వైద్యవిద్వాన్" పరీక్షలో నుత్తీర్ణులైరి. ఇంతకుమున్నె వీరు బ్ర॥ శ్రీ॥ పాలంకి గంగాధర శాస్త్రిగారియొద్దఁ గావ్య నాటకాదులు చదివి సంస్కృత సాహిత్య మలవఱచుకొనిరి. అది వైద్యశాస్త్రాభ్యాసములో మిక్కిలి సహాయపడినది. వీరువైద్యశాస్త్రమందు నిశితప్రజ్ఞావంతులై చికిత్సాది విధానములలో నారితేఱిరి. నిఖిల భారతాయుర్వేద వైద్యసమ్మేళనము వారిచేజరుపఁబడు "ఆయుర్వేద భిషక్" పరీక్షలోఁగూడ జయమందిరి. వేంకటేశ్వరాయుర్వేద నిలయమున సహాయచికిత్సకులుగానుండి మంచియనుభవము గడించుచున్న మేధావులు.

వైద్యవిద్వాన్, ఆయుర్వేదభిషక్.

శ్రీ ద్విభాష్యం వెంకటసూర్యనారాయణమూర్తిగారు,

ప్రొప్రైటరు, ప్రధానచికిత్సకులు.

వేంకటేశ్వర ఆయుర్వేదనిలయము

చింతలూరు.

వీరు వెంకటేశ్వర్లుగారి యేకైకపుత్రులు. బాల్యము నుండి దేశభాషయగు నాంధ్రమును, ఆంగ్లమును క్రమక్రమముగా నభ్యసించి, యాంధ్రాంగ్లభాషలలోఁదగు ప్రజ్ఞగడించిరి. పిమ్మట సంస్కృత విద్యాభ్యాసముఁజేయు సంకల్ప

మున నొక సంస్కృతపండితుని(దగు వేతనముమీఁద నియమింప దలంచి బ్రి॥ శ్రీ పాలః శ్రీ గంగాధర శాస్త్రిగారిని స్వగ్రామ మునకురప్పించి, వారిచెంత కావ్యనాటకాదులుసవిమర్శముగాఁ జదివి సంస్కృత భాషాజ్ఞానమునందిరి. ఈజ్ఞానము వైద్యశాస్త్రా భ్యాసమునకు మిక్కిలి తోడ్పడినది. తండ్రిగారియొద్దనే ఆయు ర్వేదగ్రంథములన్నియుఁ జదివి ఔషధ సిద్ధాంతమునందుఁ నిదానమునందుఁ జికిత్సయందును బూర్ణ మగుననుభవము సంపాదించి

"వైద్య విద్వాన్"

పరీక్షలో నుత్తీర్ణులై. నిఖిలభారతాయుర్వేద వైద్యసమ్మేళ నము వారిచే జరుపఁబడు

"ఆయుర్వేద భిషక్"

పరీక్షకువెళ్ళి యందును జయముగాంచిరి. వెంకటేశ్వర్లు గారిసమక్షమందు వారితోఁబాటుగా వీరును బ్రధానచికిత్సకులు గానుండి ఆయుర్వేదవైద్యనిలయాభివృద్ధికిఁ దోడ్పడిరి. వెంక టేశ్వర్లుగారు తా మొకటి రెండు సంవత్సరములకంటె జీవింప మని జాతకరీత్యా తెలిసికొని వెంకటేశ్వర ఆయుర్వేదనిలయ కార్యనిర్వహణ భారమంతయు వీరి కప్పగింపగా నానాఁటి నుండియు, వీరు సర్వతంత్రస్వతంత్రులై యాకార్యభారమంత యు సక్రమముగా నిర్వహించుచు తండ్రిగారికి మనస్సంతుష్టి కల్పించిరి. వెంకటేశ్వర్లుగారి యనంతరము రమారమి రెండు సంవత్సరములనుండి యద్వితీయప్రజ్ఞతో వేంకటేశ్వర ఆయు ర్వేదనిలయము దినదినాభివృద్ధి గావించుచుండుట యాంధ్రుల

కెల్లవిశదమైయున్నది. రోగనిదానములో నేమి తదనుగుణ చికిత్సలోనేమి ఔషధనిర్మాణములో నేమి వీరికిఁగల ప్రజ్ఞ యతీతమైనది. వయసుచేఁ బిన్నలయ్యు వైద్యశాస్త్రమున వీరు గడించిన యనుభవము కడుంగడుపెద్ద. సతతము పితృదేవులగు వెంకటేశ్వర్లుగారి మహోపదేశములు స్మరియించికొనుచు నిలయ మభివృద్ధికిఁ దెచ్చుచున్నారు

''పుత్రాదిచ్ఛేత్పరాజయమ్''

అనువచనము వెంకటేశ్వర్లుగారియెడలఁ బూర్తిగా సార్థకమైన దని చెప్పఁగలను. ఆయుర్వేదనిలయ కార్యనిర్వహణమం దును బండితకవీంద్రపోషణమందును దండ్రిగా రెంతయాద రాభిమానములతో వర్తించిరో వీరును దాదృశపద్ధతిగనే ప్రవర్తించుచున్నారు. అతిథుల నభ్యాగతుల నాదరముతోఁ జూచి గౌరవించుచున్నారు.

తండ్రిగారివలె వీరును ప్రతిసంవత్సరము జరుగుఆంధ్రా యుర్వేదవైద్యసమ్మేళనములలోఁ బాల్గొనుచున్నారు. 1936 సం॥ రములో విజయనగరమందు జరిగిన "ఆంధ్రాయుర్వేద వైద్యసమ్మేళనము"నకు "రాజయక్ష్మము"ను గూర్చి వ్యాసము వ్రాసి పోటీపరీక్షలో జయము నందిరి. వీరివైద్యశాస్త్ర జ్ఞానమునకు మెచ్చి, సమ్మేళనము వారు సువర్ణపతకమును, ఉత్తమతరగతి యోగ్యతాపత్రమును బహూకరించిరి 1943 సం॥ రమున రాజోలులో జరిగిన వైద్యసమ్మేళనమునకు "బాల రోగములు" అను శీర్షికపై సవిమర్శక వ్యాసము వ్రాసి సదస్యుల మెప్పులందుకొనిరి. సమ్మేళనమువా రుత్తమతరగతి యోగ్యతా పత్రమిచ్చి గౌరవించిరి. ఈ రీతిగా వెంకటసూర్యనారాయణ

మూర్తిగారు తండ్రిగారి సమక్షమందును, తదనంతరమందును కూడ వైద్యశాస్త్రపరిశీలనలోను, గర్మపథాభ్యాసమునను, నిదాన చికిత్సలలోను, బరిపూర్ణమగు పరిశ్రమము చేయుచు వేంకటేశ్వర ఆయుర్వేదనిలయమును మహోన్నతస్థితికి దెప్పించుచు, దేశమునందుండు పేరుప్రతిష్ఠలను నిలుపుచు, గౌరవింపబడుచున్నారు. పాలకవ్యక్తి సమర్థుడైనచో నాసంస్థ ఉత్తమస్థితిని, ప్రఖ్యాతిని నందుట యుక్తమేకదా? ఇంతవర కాంధ్రదేశమున మాత్రమే శాఖోపశాఖలతో విరాజిల్లు వేంకటేశ్వరాయుర్వేదనిలయమను కల్పభూజము, శ్రీవేంకటసూర్యనారాయణమూర్తిగారి ఆధిపత్యములో భరతఖండమందలి యితర దేశములలోఁ గూడ శాఖోపశాఖలతో విస్తరించి లోకోపకారకమయి సఫలమగునట్లు భగవంతుఁడగు శ్రీధన్వంతరిస్వామి కృపాకటాక్షవీక్షణముల నీక్షించుగాక.

శ్రీ పుల్లాపంతుల గవరయ్యగారు.

వీరు "స్కూలుఫైనలు" పరీక్షనిచ్చి, పిమ్మట వెంకటేశ్వర్లుగారియొద్ద వైద్యశాస్త్ర మధ్యయనముచేయుటకు వచ్చిరి. భక్తి శ్రద్ధలతో గురువులహృదయము నాకర్షించుకొని, వైద్యవిద్య నభ్యసించి "ఆయుర్వేదభిషక్" పరీక్షయందుత్తీర్ణులైరి. గుంటూరునందలి వేంకటేశ్వరాయుర్వేద నిలయము బ్రాంచిలోఁ బనిచేయుచున్నారు.

వెంకటేశ్వర్లుగారియొద్ద నిట్టిదటో శిష్యులు వైద్యశాస్త్రమునుబఠించిరి. ఆయుర్వేదపాఠప్రవచనములచే వెంకటేశ్వర్లుగారు తమ విద్యావంశము నెంతయు విస్తరింపఁజేసి గురూత్తములై ప్రఖ్యాతినందియున్నారు.

ఓమ్

శ్రీమద్ధన్వంతరయేనమః

# శ్రీ ద్విభాష్యం వెంకటేశ్వర్లుగారి జీవితచరిత్రము

## తొమ్మిదవ ప్రకరణము.

(వేంకటేశ్వర ఆయుర్వేదనిలయ ప్రారంభము; కుమారుని యుపనయనము, వివాహము; బ్రాంచీలు పెట్టుట, ఆయుర్వేదనిలయ ప్రాసాద నిర్మాణము; మోటారుకొని ఎక్స్‌ప్రైజు మొదలు చేయుట.)

### —: ఆయుర్వేదవైద్య ప్రాశస్త్యము. :—

ఆయుర్వేదమునందు దైవస్పష్టమగు ప్రతిప్రాణియు, నాహార విహారాదులలో నెంతశ్రద్ధ తీసికొనవలయునో, దినచర్య నెట్లు జరుపవలయునో ఏకాలమం దేరీతి సంచరింపఁ దగునో మున్నగు విషయములం దెల్పి, ఉత్తమజన్ముఁడగు మానవునకు రోగము లంటకుండ నుండుమార్గము చూపఁబడినది. రుజాక్రాంతుఁడగు పిమ్మట చికిత్స చేయుటకంటె రోగము రాకుండఁ జూచుట ముఖ్యముగదా! ఋషిప్రోక్తమగు 'స్వస్థవృత్తము'ననుండు విధమున సంచరించునాఁడు వ్యాధిపీడితుఁడు సామాన్యముగా నుండఁడు. ఆయుర్వేదమీవిషయములో నెంత సూక్ష్మాతిసూక్ష్మముగనో పరిశీలించి మానవజీవితమునకు సంబంధించు రోగసమస్యను సక్రమ విధానసంచరణముతోఁ బరిష్కరించినది. ఇట్టిపద్ధతి యున్నదని

కూడ భారతీయులలోఁ జాలమంది వెలుగకపోవుట యెంతయు శోచనీయము.

అనుకొననిరీతిగా మానవుఁడొకవేళ శీతవాతాతపబాధల కగ్గమగునాఁడు వాతపిత్తకఫాదులలో నేయొక్కటి ప్రకోపించినను, అసమర్థుఁడై వ్యాధిగ్రస్తుఁడు కాఁగలఁడనుదూరదృష్టితో మహర్షులు కొన్నియుచితచికిత్సలఁ బ్రసాదించిరి. ఎక్కడనుండియో యేవస్తువో దెచ్చుకొననక్కరలేకుండ మనప్రాంతములో మనకు లభ్యమగు నోషధులంగల మహత్త్వమును గుర్తించి తన్మూలమున రోగశాంతి నందఁగల మార్గమును జూపించిరి. నేఁడు కొన్నిలక్షలు వ్యయపఱచి మూలికలయం దుండు గుణములను పరిశీలించువారు వృథగా ద్రవ్యము వెచ్చించుచున్నారనకతప్పదు. ఏమూలిక యెచ్చటనుండునో, ఏమూలికయందెట్టిగుణమున్నదో, వేరులో, ఆకులో, పూవులో, కాయలో, తీగలో, పండులో, బెరడులో నేయే గుణభేదములున్నవో, దానిస్వరూపస్వభావాదులన్నియు దివ్యదృష్టితో గమనించియే మహర్షులు దెల్పియుండుట భారతీయులెంతయదృష్టవంతులో! మహాప్రభావముగల మూలికలతో నార్షసాంప్రదాయముగ చికిత్సలు గావించుటచేతనే యాయుర్వేదము భారతీయులపాలిటికల్పవృక్షము. మానవకోటిపాలిటి కామధేనువు. రోగార్త ప్రజాలిపాలిటి అమృతకలశము.

ఆయుర్వేదవైద్యనిష్ణాతులగు వెంకటేశ్వర్లుగారు దాదాపుగా నిరువదిసంవత్సరములు, ఇటుమదరాసు మొద లటుపర్లాకిమిడివరకు సకలాంధ్రదేశమునందును, నిరర్గళ ప్రతిభకు వస

మానవమగు నుత్సాహము తోడుగా వేలకొలఁదిరోగులకుఁ జికిత్సలఁ గావించి ఇతర వైద్యాసాధ్యవ్యాధుల నిర్మూలించి వారి కారోగ్యముఁ గల్గించుటతో నాయుర్వేదవైద్యశాస్త్రమును వెల్లడించిరి.

అప్పటికి వయస్సు నలుబది మూఁడు వత్సరములు. ఇంకఁ బ్రయాణశ్రమమునకోర్చుట దుర్ఘటమను భావ ముదయించినది. పరస్థలనివాసము, పరాన్నభోజనము పరదేశసంచారము బాధాకరమనిపించినది. రోగులస్థితిగతులంజూచుటకు సమయాసమయము లేక పయనించుట తప్పనిసరియైనది. ఆపదలోనున్నప్పు డాదరింపనేగుటచేత నాహారవిహారములలో నవ్యవస్థయేర్పడినది. అందుచే 1925 సం॥రమున "వేంకటేశ్వర ఆయుర్వేద నిలయము" అను నామధేయముతో నొకసంస్థ నెలకొల్పి యందు సిద్ధపఱుపఁబడిన 216 రకములగు ఔషధముల ప్రభావమును దెలుపుచు నాల్గు వేలు కేటలాగులు ముద్రించి ప్రచారము చేసిరి. జ్యేష్ఠసోదరులు బుచ్చయ్యగారును వెంకటేశ్వర్లుగారును గలిసి వైద్యవ్యాపారమునడపుచున్నందున వారియుభయుల "ఫొటో"లతో, పేరులతో కేటలాగులు ముద్రింపఁబడినవి. శ్రీధన్వంతరిస్వామివారి దివ్యానుగ్రహముచేత నాయుర్వేదనిలయము ప్రారంభదివసమునుండియు నభివృద్ధినందఁజొచ్చినది. ఆంధ్రదేశము నాలుగుమూలలనుండియు విరివిగా "ఆర్డర్లు" రాఁజొచ్చినవి. "యస్య ప్రథమాపసధే సుఖంభవతి తస్య సర్వత్ర సుఖమేవ" అనునట్లు ప్రారంభించిననాఁటి యభివృద్ధి నేఁటి మహోన్నతస్థితిని సూచింపఁజాలినది.

"ఆర్డరు" విరివిగా వచ్చుచున్నందున ఔషధని ర్మాణ భారము హెచ్చినది. అందుచే వెంకటేశ్వర్లుగారు నిలయము విడిచివెళ్ళుట కవకాశమంతగాఁ జిక్కనందున గ్రామాంతరములకేఁగి వైద్యముచేయుట కొంతవఱకు తగ్గించిరి. కాని లబ్ధప్రతిష్ఠులగుటచేత నాప్రాంతమువారు వెంకటేశ్వర్లుగారిచెంతకే వచ్చి చికిత్సను బొందుచుండెడివారు. ప్రారంభసంవత్సరమునందు ఔషధవ్యాపారమువలన వచ్చినరాబడి ఆఱువేలు. ఔషధములను సేవించినవారెల్ల రౌషధప్రాశస్త్యము నుగ్గడించుచు యోగ్యతాపత్రములు పంపించసాఁగిరి. అందుఁ గొన్నిమాత్రమే తరువాతముద్రించిన కేటలాగులోఁ బ్రకటింపఁబడినవి. 1926 సం॥రములో 12000 లు కేటలాగులు ముద్రింపించి మదరాసుప్రెసిడెన్సీయందంతటఁ బ్రచారము గావించిరి. 1927 సంవత్సరమునుండియుఁ గ్రమక్రమముగా నౌషధవ్యాపార మభివృద్ధినందినది.

## కుమారుని యుపనయనము.

## వివాహమహోత్సవము.

1929 సం॥రమున కుమారులు చిరంజీవులు వెంకటసూర్యనారాయణమూర్తిగారి కుపనయనము చేయు సంకల్పమున వెంకటేశ్వర్లుగారు బంధుగులుమిత్రులు నగువారినెల్ల నాహ్వానించిరి. వైద్యపరిచితులెందఱోవచ్చి వటువునకు సువర్ణాంగుళీయకములు, రజతపాత్రలు బహూకరించిరి. ఉపనయనసంస్కారము మేధాజననముతో శుభోదర్కముగా నెఱవేరినది.

త్రియోదశవర్షముల ప్రాయముననున్న వేంకటసూర్య నారాయణమూర్తిగారికిఁ దమతమకన్యలనిచ్చు సంకల్పముతోఁ గన్యాదాత లెందఱేని రాఁజొచ్చిరి. శ్రీ చిలకమర్తి వెంకటరామయ్యగారు నరసాపురంతాలూకా మత్స్యపురివాస్తవ్యులు. రమారమి 2 వందల యెకరములు స్థిరవసతికలభూస్వాములు మత్స్యపురిలో మహారాజ భవనముతోఁ దులఁదూఁగు రెండు మండువాలలోగిలి. ఆరామద్రావిడశాఖలోని సంపన్నగృహస్థులు. నాల్గవకొమిరె చిరంజీవి పర్వతవర్ధనమ్మ పెండ్లియీడులోనున్నది. వరాన్వేషణమునకు సంచరించవలసిన సమయమాసన్నమైనది. అత్తవారియూరగు ఆలమూరువచ్చి బావమఱఁదులతో ముచ్చటించిరి. "చింతలూరులోని ద్విభాష్యం వెంకటేశ్వర్లుగారికొక్కఁడే కొమరుఁడు. రూపవంతుఁడు, బుద్ధిమంతుఁడు విద్యాభ్యాసముఁజేయుచున్నాఁడు. వైద్యవ్యాపారములో వారు గాంచుచున్న యభివృద్ధిని పరిశీలించినచో నచిరకాలములోనే గొప్పయున్నతి నందఁగల సూచనలు కాన్పించుచున్నవి. మాప్రాంతములోని వరులలో నుత్తముఁడు. మీకు జూడసంకల్పమున్నచో వెళ్ళి కాంచవచ్చు" నని తమయభిప్రాయమును వారు వెల్లడించిరి. వెంకటరామయ్యగారును చింతలూరు వెళ్ళి వెంకటేశ్వర్లుగారిచే గౌరవమర్యాదలంది కుశలప్రశ్నాదికము గావించు సమయమునకు "టపా" వచ్చుటచే వెంకటేశ్వర్లుగారు "మనిఆర్డరులు" గైకొనవలసివచ్చినది. ఆనాఁడు 'వి.పి'ల బాపతుసొమ్ము సుమారు నూరురూపాయీల వరకు వచ్చినవి. ధనికులెక్కడకుఁజనినను ధనమే సాక్షాత్కరించును గదా ? బావమఱఁదులుచెప్పిన విషయమెల్ల యథార్థమే

యనుభావ మప్పుడే యుదయించినది. వారిలోవియ్యమందు సంకల్పములోనే వెంకటేశ్వర్లుగారియొక్క సెలవు తీసికొని, ఆల మూరువెళ్లి బావమఱఁదులతో "వెంకటేశ్వర్లుగారితో సంబంధముచేయుటకు నాకు సర్వవిధముల సమ్మతమే" యని తెల్పి స్వగ్రామ మరిగిరి. తరువాత స్వాలకులలోనొకరగు కామవరపు సుబ్రహ్మణ్యముగారి ముఖమున వెంకటేశ్వర్లుగారికిఁ గబురు పంపించిరి. వెంకటేశ్వర్లుగారును తమ జ్యేష్ఠసోదరులు బుచ్చయ్యగారితోను, తమ్ములతోను, శ్రీనరసింహదేవర పేరుశాస్త్రిగారితోను సంప్రతించి, వారికిఁ గూడ సమ్మతమగుట గ్రహించి, "వెంకటరామయ్యగారు మాకన్న సర్వవిధముల పెద్దలు. వారియిష్టానుసారముగ 'తథాస్తు' అనుట కభ్యంతరము లేదు. మంచిముహూర్తముచూచి మత్స్యపురికేగి నిశ్చయ తాంబూలములు పుచ్చుకొందు"మని తెల్పి, కా॥ సుబ్రహ్మణ్యముగారిని సాగ నంపిరి.

వెంకటేశ్వర్లుగారును సుబ్బారాయుడుగారును మంచిరోజునబయలుదేరి మత్స్యపురిచేరి పెండ్లికుమారితను చూచి నిశ్చయతాంబూలములందుకొనిరి. ఆశుభసమయమున గ్రామస్థులెల్ల రాహ్వానింపఁబడి వచ్చియుండగా నందులో పెద్దసంపన్నగృహస్థులగు వైష్ణవవృద్ధులొకరు "వెంకటరామయ్యగారూ! మీ వియ్యంకుఁడుగారి కేమాత్రము భూవసతి కల"దని ప్రశ్నించిరి. "మన కొక సంవత్సరమునకు వచ్చురాఁబడి వారి కొక నెలలో వచ్చు"నని వెంకటరామయ్యగారు తడుముకొనకుండ సమాధానముఁ జెప్పిరఁట. ఆహా! భవితవ్యము భగవంతుఁడట్లనిపించి

యుండనోపు! నిజమునకానాఁడు వెంకటేశ్వర్లుగారి స్థితియట్టిది కాదు; గాని పెద్దలమాటలు భావ్యర్థద్యోతకములు శ్రుతితుల్యములుగదా! ఎట్టిశుభసమయమున నాదివ్యవాక్కు వారినోటినుండి వెలువడినదోగాని వారనినట్లు వెంకటేశ్వర్లుగారిస్థితిగతులు నేఁడంతటి యభివృద్ధిలోనికివచ్చియున్నవి. "వాచమర్థోనుధావతి" యను సూక్తి సత్యమైనది. సంబంధము స్థిరపఱచుకొనిరి. ఇంతలో దైవికముగా వెంకటరామయ్యగారు కీర్తిశేషులగుటచే వివాహము జరుగుటకుఁ గొంత కాలవిలంబనము జరిగినది. ఈసంబంధము జరుగదేమోయని ఆడుపిల్లవారు కొంత వఱకు తటపటాయించిరి; కాని వెంకటేశ్వర్లుగారు తామాడిన మాటప్రకారము ముహూర్తనిశ్చయ మొనరించి, సకుటుంబ బంధుమిత్ర పరివారముగాఁ దరలివెళ్ళి, కుమారునిపరిణయ మహోత్సవమును మహా విభవోజ్జ్వలముగా నిర్వర్తించిరి. కన్యాదాతలును సలక్షణముగా నత్యుత్సాహముతో వచ్చినవారినెల్లరఁ జందనతాంబూలాఁబరాది సత్కారములతో గారవించి యానందింపఁజేసిరి. "వివాహశ్చ సమయోరేవ శోభతే" యనిన పెద్దలనుడి యిట్టిపట్టులంగాంచియే వెలువడియుండనోపు. ఇట్లు 1929 సం॥ రము జూను నెలలోఁ గుమారులగు వెంకటసూర్యనారాయణమూర్తిగారి వివాహమానందోపేతముగా జరుపఁబడినది. మహాలక్ష్మియనఁ నొప్పు కోడలు చి॥ సౌ॥ పర్వతవర్ధనమ్మ యడుగుపెట్టిన వేళావిశేష మెట్టిదో కాని యానాఁటనుండి కార్ఖానా సంపద హెచ్చుగాఁజొచ్చినది.

శాఖలు.

వెంకటేశ్వర ఆయుర్వేద నిలయ ప్రధానస్థానమునకు

"బ్రాంచిలు" (అనుబంధశాఖలు) 1930 సం॥రమునుండి రాజమహేంద్రవరపురంబునను, కాకినాడపట్టణమందును, పెద్దాపురమునందును నెలకొల్పఁబడినవి. వైద్యవ్యాపార మానాఁటి కానాఁడు పెంపొందినది. ఆయుర్వేదవైద్యముపైఁ బ్రజలకాదరాభిమానములు గలుగఁ జొచ్చినవి. శాస్త్రోక్తప్రకారముగా సాంప్రదాయానుసారముగా నౌషధములు సిద్ధపఱుపఁబడుటచేతను, ప్రభావవంతములై చెప్పినపని చేయుచుండుటచేతను ప్రజలకు వేంకటేశ్వరఆయుర్వేదనిలయము మీఁద గౌరవాభిమానములు హెచ్చినవి.

ఇంతలో 1932 సం॥రమున సోదరులగు బుచ్చయ్యగారి యారోగ్యముచెడినది. కొంతకాలము రోగము చేత బాధింపఁబడినమీఁద నింకజీవించుట కష్టమనుతలఁపుదయించినది. లోకవ్యవహారమున కెట్లున్నను ఆయుర్వేదనిలయము పెట్టుబడి అభివృద్ధి మున్నగునవన్నియు నూటికినూఱుపాళ్ళు వెంకటేశ్వర్లుగారివేయను యథార్థము గురుతించి తాముభయులు నేకచిత్తులై వ్యవహరించినట్లు భవిష్యత్తులో జరుగుట యసంభవమని యెంచి తమకునిలయమునందుఁగల మూఁడవవంతు హక్కునకు రు2000 ప్రతిఫలము తీసికొని 13 నవంబరు 1932 సం॥రమున హక్కువిడుదల దస్తావేజువ్రాసి వెంకటేశ్వర్లుగారి కిచ్చిరి. నాఁటినుండియు వేంకటేశ్వర ఆయుర్వేద నిలయమునకు వెంకటేశ్వర్లుగారే సంపూర్ణాధికారమును వహించి నిర్వహించుచున్నారు.

దస్తావేజువ్రాసిన యచిరకాలముననే బుచ్చయ్యగారు నాకపద మలంకరించిరి. తనకుఁ గుడిభుజముగానుండి యంతవ

అను వ్యవహరించిన జ్యేష్ఠసోదరుని నియోగమునకు వెంకటే శ్వర్లుగారుపొందిన పరితాపమింతయని వ్రాయనరానిది. సోదర ప్రేమలో వెంకటేశ్వరుగారి దొకవిశిష్టస్థానము, "జ్యేష్ఠభ్రాతాపితృసమః" అను శాస్త్రవాక్యమును సంపూర్తిగాఁ బరిపాలించినవ్యక్తి వీరేగదా? వీరిసౌభ్రాత్రమునుగూర్చి

కం॥ అల నలువురు సోదరులున్
విలసితతత్త్వద్విశిష్ట విజ్ఞానముచే
నెలమింగొని వేదములుం
బలె నన్యోన్యానురాగ పరులైరికడున్, ధ. చ. ఆ 64

అని వర్ణించుటలో నెంత యర్థమిమిడియున్నదో తద్జ్ఞులు గుర్తింపఁగలరు,

అనుజులలోఁ బెద్దయగు సుబ్బారాయుఁడుగారు కొలది కాలము ఆలమూరుకోర్టులో 'ప్రియువేటువకీలు'గాఁ బనిచేసిన పిదప 1928 సం॥రమున ప్రధానకార్యాలయములో మానేజరుగాను, సహాయచికిత్సకులుగాను బ్రవేశించి వెంకటేశ్వరాయుర్వేద నిలయాభివృద్ధికెంతయుఁ దోడ్పడుచున్నారు. వీరికార్య నిర్వహణశక్తి నిరుపమానము. నిలయమునందలి యుద్యోగులయు, పనివారలయుఁ బనులెల్ల వేయికళ్ళతోఁ జూచునట్లు కనిపెట్టుచు, సక్రమపద్ధతిని కార్యకలాపము నడిపించుమేధావులు, కనిష్ఠసోదరులగు వెంకటాచలముగారు కూడ నిలయ వ్యాపారాభివృద్ధికి, నిలయప్రఖ్యాతికిఁ బాటుపడుచు జిల్లా ముఖ్యపట్టణమగు కాకినాడలో నివసించుచున్నారు.

బుచ్చయ్యగారి కుమారులగు వీర వేంకట సత్యనారాయణమూర్తిని బుత్రనిర్విశేషముగా వెంకటేశ్వర్లుగారు కనిపెట్టుచుఁ

దండిగ్రేని యోటు గానరానట్లుగా నభివృద్ధికిఁ దెచ్చుచున్నారు. క్రమక్రమముగా అనకాపల్లి, విజయనగరము, ఏలూరు పట్టణములలోను 'బ్రాంచిలు' నెలకొల్పఁబడినవి. చిన్నతనమునుండియు వెంకటేశ్వర్లుగారి శుశ్రూషలోఁ బెరిగి నిదానచికిత్సాది విషయములలో ననుభవమును గడించిన కూచిభొట్ల వెంకటేశ్వర్లుగారు ఏలూరులోనుండి శ్రీ మోతే గంగరాజుగారు మున్నగు జమీందారులకు గృహవైద్యులుగాఁ బని చేయసాగిరి. ఈ వెంకటేశ్వర్లుగారివలన వైద్యసహాయమునంది "కవికిశోర" వేదాన్తం వెంకటసుబ్రహ్మణ్యశర్మగారు కృతజ్ఞులై వేంకటేశ్వరాయుర్వేద నిలయాధిపతులగు వెంకటేశ్వర్లుగారి నీక్రిందిపద్యములచేఁ బ్రశంసించిరి. ఈకవికిశోరులు సుప్రసిద్ధులగు బ్రహ్మశ్రీ శతావధాని చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారి శిష్యులు.

చింతలూరు వేంకటేశ్వర ఆయుర్వేదనిలయ
నిర్వాహకుల ప్రశంస.

ఉ॥ రాత్రులు కన్నుమూయుని, పురాకృతరోగములడ్డుతాకి, యీ
పాత్రికుఁ జిల్లిపడ్డతటి వంటకుఁగిట్టక బోర్లపడ్డదే
గోత్రజులెల్ల ఘోషపడ గొంతుకనూపిరి యాగులాడ, మీ
మాత్ర మహత్త్వమేమియొ ప్రమాదముబాపెదు వెంకటేశ్వరా॥

చ॥ అమితముగా రసాతలము నందుజనించిన భోగపీడ నా
శ్రమలకు వృక్షజాతులకు సైతము శైత్యముచేసి వాత రో

గములకు మోఁడ్రకులాచుఁ బాడగట్టి వసంతుని చేజివుర్చు సా
మ్యమునకు, మీ వసంతకుసుమాకరమయ్యె ద్విభావ్యమార
యన్ ॥

గీ॥ ఎండిపోయి మోఁడ్రిడులపోల్కి నుండు ప్రజల
కెందరెందఱికో కడ కీజగాన
జక్కని వసంతుకరణి సత్సంతతి నిడె
కరము మీ వసంతకుసుమాకరము వరము॥

ఆ॥ వె॥ అవని వెలయు నౌషధాలయంబులకన్న
మీది మిన్నదనిన మెప్పుమాట
నికరమగుచు సిద్ధమకరధ్వజము నిల్పి
పేర్మి చాటు దింక వేంకటేశ॥

సీ॥ మాయఁ గప్పిన లోక మాతృగర్భము నొప్పి
పోఁగొట్టు వైద్యుండు పుట్టలేదు
నాభిలోఁ దులఁదూగు లోభిగొట్టుగుణంబు
మాన్పు వైద్యుండు కానరాఁడు
తాపత్రయాగ్ని చేఁ దపన జెందఁగ నీని
మందులియ్యఁగ వైద్యుఁ డెందు లేఁడు
ఆడుమాటకు బొంకు లాడి తొలంగఁ జూ
చిన రుగ్మతకు వైద్యుఁ డనఁగరాడు

గీ॥ ఇట్టి రోగంబులను బాప తుట్టతుదకు
యేడుకొండల వెంకఁడు కూడ తగక
చింతపడుచున్న జగతికి చింతలూరి
వైద్యమణి వేంకటేశుఁ డభయమొసంగె॥

మ॥ ధరణీభారధురీణులార! పృథివిన్ ధర్మంబు శాసించి, త
త్సరణిన్ బ్రోచెడిమంత్రులార! తగుప్రోత్సాహంబుతో
వేంకటేశ్వర వైద్యాలయమందు మందులను రాజ్యశ్రీకి
నిప్పించి, యుందఱు దీర్ఘాయువులందుఁడయ్యా! బుధు ల
ద్దానిన్ బ్రశంసింపగన్॥

ఇట్లు.
'కవికిశోర' వేదాంతం వేంకటసుబ్రహ్మణ్యశర్మ.

వేంకటేశ్వరాయుర్వేద నిలయమునఁదలి ఔషధములు సాధ్యమగునంతవరకు మార్గాయాసవ్యయాదులు లేకుండఁ బ్రజాసామాన్యమున కందుబాటులోనుండువిధమున అమలాపురము, తుని, రామచంద్రపురము, గుంటూరు మున్నగు తావులందు "బ్రాంచి"లు స్థాపింపఁబడినవి.

1935 సం॥రమునందు బందరులో జరిగిన ఆంధ్రాయుర్వేద వైద్యసమ్మేళనమునందు వెంకటేశ్వర్లుగారు పాల్గొనిరి. అందు "వైద్యశాస్త్రి" ఈశ్వర సత్యనారాయణశర్మగారు "పుత్రవతీ హితోపదేశ"మను నొక వైద్యశాస్త్రానుబంధ గ్రంథము రచించి తీసికొనివచ్చి "యుదారులగువా రెవ్వరేని నిగ్రంథ మచ్చువేయించి లోకోపకార మొనరించవలసిన"దనికోరిరి. వెంటనే వెంకటేశ్వర్లుగా రుదారసాహసములుగలవారగుటఁ దా నచ్చు వేయించెదమని పలికి కొన్నివేలప్రతు లచ్చువేయించి ఆంధ్రదేశమెల్ల యెడలఁ బంచిపెట్టించిరి. దానఁగృతజ్ఞులై

శ్రీసత్యనారాయణశర్మగా రాగ్రంథముఖమున నీక్రిందిపద్య మును బ్రకటించిరి.

గీ॥ వెజ్జుమిన్న ద్విభాష్యము వెంకటేశ్వ
రాఖ్యమిత్రుండు తాఁబరమార్థబుద్ధి
నుచితముగ నచ్చువేయించి యొసఁగుదీని
ననుసరింపుము దీవింపు మతనిఁ దల్లి !

—: ఆయుర్వేద నిలయ ప్రాసాదనిర్మాణము. :—

ఆంధ్రదేశమున నిప్పటికి పది బ్రాంచిలు నెలకొలుపఁ బడినవి. వైద్యవ్యాపారము రోజురోజున కభివృద్ధి కాఁజొచ్చి నది. చింతలూరునందలి కేంద్రవైద్యాలయములో గుమాస్తాలు పనివాండ్రసంఖ్య పెరిగినది. ఏకకాలమందింతమంది యేకత్ర పనిచేయుటకుఁ దగిన యవకాశము తక్కువైనది. అందుచే వెంకటేశ్వర్లుగారు తమయింటికెదురుగనున్న నివేశనస్థలమునుగొని యందు 1936 సం॥రమున నొకసౌధమును నిర్మించి అందు కేంద్రవైద్యాలయమును నెలకొల్పిరి. ఈనూతన సౌధప్రవేశ మహోత్సవమునకు బంధుమిత్రులు, కవులు, పండితులు మున్నగువారలెందఱో యాహూతులైవచ్చియుండిరి. మహావిభవ సముజ్జ్వలముగా నమ్మహోత్సవము నెఱవేఱినది. కవీశ్వరులు పద్యోపదల నర్పించిరి. అందుఁ గొన్నిమాత్రము.

క॥ శ్రీకర నిరుపమకీర్తివ
శీకరణాకర ప్రశస్తజీవనవిద్యా
స్తోకతర వైద్యసద్వి
ద్యాకర యోవేంకటేశ్వరాహ్వాయ శుభమా॥

చ॥ నిరుపమదివ్యభాష్యములనీరధిచంద్రము డౌయి వేంకటే
శ్వరవరనామధేయ బుధసత్కవిసన్నుతభాగధేయ నీ
గురుతర వైభవోన్నతులకుం దగురీతిని బొల్చె నార మేల్
తరముగ నీదునూత్నరచితౌషధసౌధగృహంబు సొంపుగన్
శా॥ నీదివ్యౌషధసౌధరాజముకళ న్నేఁ దెల్పగానేల ల
క్ష్మీదేవీయననోయటంచుపలుకున్ మేల్మేలుయీయింటమీ
పాద మ్మౌనినదాది యత్నవిభవస్ఫారంబు గాకుండునే
మీదౌసంపదనిక్క మీనుడులుసుమీమ్మౌనమ్ముమీనెమ్మదిన్॥
ఉ॥ ఎందరు వైద్యవృత్తిని వహించిరి యెద్వరు పైజమెంట్ల చే
నెందరు వార్ధివేష్టితమహీతలముం గలగుం డొనర్చిరీ
చందమునందముంగనగజాలిరె వారలభాగ్యరేఖ యే
మందముమందమౌయి గుణమండన విశ్రుత వేంకటేశ్వరా
క॥ అనుకూల మైనవిద్యయు
ననుకూలంబైనగుణము ననుకూలగతిం
జనుభార్యయు సుతరత్నం
బునుబొందిననిన్ను లక్ష్మిపొందదె స్థిరమై॥ ౫
మ॥ తన కైశ్వర్యలవంబు చేకురిన నేత్రద్వంద్వముం బోయి నీ
చునకున్ మూర్ధముపైన నెక్కునటు పైజుట్టంబులున్మిత్రముల్
వినుతప్రజ్ఞులు బండితప్రవరులుం బేదల్ గనన్ రారు స
ద్ఘను డీవౌటను వారిఁజూతు దగ జేతస్సస్యముల్ పొంగగన్
సీ॥ నీకీర్తిచంద్రికల్ నెరసి యెల్లెడ వెల్గె
నరశూన్యమగు నరణ్యములదక్క
నీయౌషధంబు లన్నియు నమృతంబులే
ఘనదురదృష్టవంతునకు దక్క

నీ నైజగుణము లన్నియు మానికంబులే
యొకదుష్టనిర్భాగ్యునకును దక్క
నీరమావిభవంబు లేటికి బ్రియము నులే
యొకయసూయాగ్రస్తునకును దక్క

గీ. వైద్యరాజసద్బిరుదదివ్యప్రభావ
భావభవపితృపదపద్మ భక్తిభావ
నీకు సరిలేరు గానముల నీకు నీవ
భళి! ద్విభాష్యము వేంకటేశ్వరులు బావ

గీ. ఈగృహము టంకసాలకు నెనయనంగ
వెండిబంగారములమోత వినుచు ముట్ట
రత్నకాంతుల నౌషధరత్నకాంతు
లొరసి పెంపొంది నిత్యంబు మెరయుగాత

సీ. మీయాగృహమున లేమికి తావులేక సం
పత్సమృద్ధిసతంబు వరలుగాత
మీయా వినూత్నసౌధాయుతగృహమందు
సకలశుభములు జరుగుగాత
మీయామహౌషధామృతమందిరంబున
నిలచినంతనె ఋజల్ తొలగుగాత
మీయామనోజ్ఞనిర్మితసద్మమందున
దిరుగువారలమైత్రి పెరుగుగాత

గీ. దంపతులప్రేమభావముల్ పెంపుగనుత
సోదరులకు సౌభ్రాత్రింపుసొం పెసగుత

సుతునిపిత్రుభక్తి లోకులనుతులు గనుత
నిరతమును వేంకటేశ్వర నీగ్రహమున. ౯

ది 2—5—1936 } ఇట్లు విధేయుడు,
పాలకొల్లు } అల్లంరాజు సత్యనారాయణమూర్తి

సీ. రోగార్తులవలన రొక్కంబు మునుముందు
గైకొను నను నపఖ్యాతి మాన్ప
ఆస్తుల కేమియు నౌషధంబొకసారి
యొననీయఁ డను దుర్యశము గూల్ప
పథ్యపానంబులు వ్యాధిగతులు చెప్పి
భీతి బోగొట్టనిపాలితి బాప
అమ్మ మిమ్మెరోగియంచు సంగలార్చెడు వాని
చెంత జేరండను చేటుబాప

గీ. గుణవిభూష్యద్విభాష్య సత్కులపయోధి
చంద్రుడై నట్టివేంకటేశ్వరుఁడు నగుచు
పల్లతిరుమలయందున నలరునట్టి
వేంకటేశ్వరుండె మనకు వెలసె నిపుడు ౧

గీ అమృతకరుడు ద్విభాష్యకులాంబుధినని
వెంకటేశ్వరద్విజరాజు వింత గాదు
మను సుధామాన్వితుఁడగుచు బొలుపుమీర
నిపుడు సౌధాశ్రియుఁ డగుట యేమివింత. ౨

గీ నూటయెనిమిదిస్థలముల లోటులేక
ప్రజల రక్షించు వేంకటేశ్వరునిపగిది

చింతలూరు వెలయుత శ్రీద్విభాష్య
వేంకటేశ్వరుఁ డెంతయు వృద్ధిగలిగి. 3

1936 స ॥ రం } ఇట్లు
మండపేట. } దేవులపల్లి నరసింహశాస్త్రి.

ఉ. యోగ్యతనిచ్చు జన్మ శుభయోగ ఫలంబులు రెండు గాంతురా
రోగ్యము భాగ్యమంచును. నిరూఢిగ వానికి రెండు భాష్యముల్
భాగ్యముగాఁ బఠించియు ద్విభాష్యసువారయి మీరు కీర్తి సౌ
భాగ్యపు కేతనంబు భువిపై నెలకొల్పిరి వేంకటేశ్వరా!

శా. ఆయుర్భాగ్యము లిచ్చి సర్వజన శ్రేయం బెల్లమర్యాదగా
నాయాదిక్కుల ముఖ్యుఁ బళ్ళువిధి నత్యంతంబుఁ గల్గించుఁ ద
చ్ఛ్రాయున్ దర్పతి వేంకటేశుఁడిల సౌఖ్యాత్ము మీయింటమీ
యాయుర్వేదవ్రతంబుతో నిడు ద్విభాష్యా వేంకటేశాభిధా!

మ. శతవర్షంబులనాఁటి విస్తృతకద యుష్మద్వైద్యచాతుర్యసం
తతి సంపత్తు; తదీయభాగ్యమునఁ గాదా బంధుమిత్రావలీ
స్థితివర్ధిల్లుట, యీవినూత్నగృహలక్ష్మీ తన్వి శోభిల్లుటల్
క్షితిపైఁ బూర్వులసొమ్మపూర్వమనిపించెన్ వేంకటేశప్రభూ!

ఉ. ఆయతనీతివేత్త సుగుణాలయుఁ డుత్తమదేవభూసురా
మ్నాయపథానువర్తి, సుకుమారకుమారుల చక్రవర్తి కీ
ర్త్యాయువులన్ సుపుత్త్రుఁడు మహాత్ముల ముద్దులపట్టి సూర్యనా
రాయణమూర్తి మీనిలయరత్నమనంబడు వైద్యరత్నసూ!

ఉ. ఈవరహాలమేడ గదు లెన్నిటికాస్పదమై విశాలమై
పావనమై సుఖంబు లిడి వర్ధిలవెల్సెనొ? నీవు నట్లనే

జీవితబంధుకోటికి నశేషమనీషికవీంద్రకోటికిన్
మావరిహాలమేడ వయినావు భరింపఁగ వేంకటేశ్వరా!

ఉ. చింతలఁదీర్చి శ్రేయములఁ జేకొని మే లొనగూర్చి భూమి పా
లింతునటంచు ఘోరపుకలిన్ బెకలించెడి చింతలూరి ధ
న్వంతరిసార్వభౌముఁడు కృపాలయుఁడై భవదీయనూత్నసౌ
ధాంతరమందునిల్చియు నయంబుమిను న్దనియించిప్రోచుతన్.

కవికిశోర

వేదాంతం వేంకటసుబ్రహ్మణ్యశర్మ

—: మోటారుకొని ఎడ్వర్టైజుమెంటు చేయుట :—

వేంకటేశ్వరాయుర్వేద నిలయమందలి యౌషధములు సేవించి యెందఱెందఱో యారోగ్యభాగ్యమందుచుఁ బ్రశంసించుచుండిరి తూర్పుగోదావరి, పడమరగోదావరి, కృష్ణా, గుంటూరు, విశాఖపట్టణం జిల్లాలలోమాత్రము కొన్ని "బ్రాంచి"లు నెలకొల్పఁబడినవి. ఇప్పటికి బెజవాడ. పాలకొల్లు, బందరులలో కూడ స్థాపింపఁబడినవి. ఆంధ్రదేశము నందలి మిగిలిన జిల్లాల వారికిఁగూడ నుపకారకముగాఁ దమ యౌషధము లందుబాటులో నుంచునట్లు చూచు నావశ్యకమును భావమున నెల్లూరు, కడప, కర్నూలు మున్నగు దూరపుజిల్లాలవారు ఉత్తరములు వ్రాయఁజొచ్చిరి. ఆప్రాంతములవారు కేంద్రకార్యాలయమునకు వ్రాసి ఔషధములు రప్పించుకొనుటలో మిగుల వ్యయప్రయాసములకు లోనగుచుండిరి. అందుచేత నాప్రాంతములందుఁగూడ "బ్రాంచి"లు తెరువవలయునను సంకల్పముద

యించినది. వానిని నెలకొల్పుటకు ముందుగా నాప్రాంతము నందలి జనసామాన్యమునకుఁ దమయౌషధముల ప్రభావాదికము వెల్లడిచేయుట ముఖ్యమని తోఁచి 1938 సం॥లో నొక "మోటారు కారు"నుకొని, సహాయకులుగు గుమాస్తాను, డ్రైవరును భృత్యుని నియమించి మూఁడు వత్సరము లెడ తెఱపిలేకుండ అటు మదరాసు మొదలు ఇటు బరంపురమువఱకుఁగల యాంధ్రదేశమునందు మారుమూలలనున్న చిన్నచిన్న గ్రామములకుసైతము కారుతో వెళ్ళి తీవ్రప్రచారముచేయించిరి. పత్రికప్రచారము, ప్రబోధముగలసంస్థ లనతికాలముననే యత్యున్నతి నందుచున్న యీకాలములోని ప్రచారావశ్యకము నానాఁడే గుర్తించి కారుకొనుటలోను, దానితో దూరదేశసంచారము చేయుటలోను సుమారు రిరువదివేలు వ్యయమొనర్చిరి. దేశము నందలి జనులెల్లరు దమయౌషధముల గుణప్రభావాదికము గుర్తెఱుంగుట ముఖ్యముగా నెంచి వెంకటేశ్వర్లగారు వ్యయమున కేమాత్రము వెనుదీయక యవ్యాహతముగాఁ బ్రచారము చేయించిరి. కారు బయలుదేరు సమయమెట్టి శుభసమయమోగాని, ఏపట్టణమునకేఁగినను, ఏపల్లె చేరినను బరమసంతోషముతోఁ బ్రజలు తండోపతండములుగా నెదుర్కొని యౌషధములకు "నార్డర్లి"చ్చుటయేగాక, కారుతో వచ్చినవారల కాతిథ్యము, వసతికల్పించుచు నూరదేశములలో నెంతయుఁదోడ్పడియుండిరి. ఉత్తమసంస్థ లెప్పుడును బ్రజాదరణాభిమానములకుఁ బాత్రము లేకనా! కారుమూలమున 1938, 39, 40 సం॥ రములలో నిట్లు తీవ్రప్రచారము జరుపఁబడినది. ప్రచారఫలితముగా వ్యాపారాభివృద్ధి కాస్పదించినది. తన్మూలమున నెల్లూరు,

తెనాలి, సికింద్రాబాదు, కడప, తణుకు, భీమవరము, చీరాల, రాజోలు, తాడేపల్లిగూడెములందు బ్రాంచిలు క్రమక్రమముగా స్థాపింపఁబడినవి 1942 సం॥ రమునాఁటికి పొన్నూరు కర్నూలు, ప్రొద్దుటూరు, పిఠాపురములందుఁగూడ నక్కడ ప్రజల కోరికననుసరించి బ్రాంచిలు పెట్టఁబడినవి. ఈసంవత్సరమునందే చింతలూరుగ్రామములో శ్రీధన్వంతరి, విశ్వేశ్వర వేంకటేశ్వర దేవాలయప్రతిష్ఠలు మహావైభవముతోఁ గావింపఁబడినవి పదునొకండవ ప్రకరణములో నావిషయమంతయు విపులముగాఁ దెలుపఁబడుట నటఁ బాఠకలోకము చూడఁదగును. "కుముద్వతీ పరిణయము" అను కృతిస్వీకారముగూడ నీశుభ సంవత్సరముననే జరిగినది. ఆవిషయముఁగూడఁ బైప్రకరణమునఁ గాంచనగును. నెలకొల్పఁబడిన బ్రాంచిలన్నియుఁ బ్రజల యాదరాభిమానములకుఁ బాత్రము లగుట యెంతయు ముదావహము. జనరంజకులగు వేంకటేశ్వర్లుగారు లోకులమెప్పునందుట న్యాయమేకదా! ఒంగోలు, బిక్కవోలు, రేపల్లె, కైకలూరు, అరవిల్లి. శ్రీకాకుళం, పెనుగొండ, కొత్తపేట, నిడదవోలు. గుడివాడలలోఁగూడ బ్రాంచి లుంచఁబడినవి.

ఇట్లు వేంకటేశ్వరాయుర్వేద నిలయభూజము దినదినాభివృద్ధిగా శాఖోపశాఖలతో విస్తరిల్లి, యావదాంధ్రదేశమున నెల్లెడల నఖండకీర్తి గడించి పెంపొందినది. ఇట్టిసంస్థ శ్రీధన్వంతరికృప నాచంద్రతారకము చిరస్థాయియై విరాజిల్లుఁగాక.

---

శ్రీ

శ్రీమద్ధన్వంతరయేనమః

# శ్రీ ద్విభాష్యం వెంకటేశ్వర్లుగారి జీవితచరిత్రము.

## పదియవ ప్రకరణము.

(ధర్మవైద్యము, అన్నదానము, పండితసత్కారము, యజ్ఞదక్షిణాప్రదానము, ధర్మశాలానిర్మాణము, కూపప్రతిష్ఠ.)

### —: ధర్మవైద్యము :—

వెంకటేశ్వర్లుగారి యున్నతికిఁ గీర్తికిని వైద్యమే మూలహేతువు. ఆశాస్త్రమునందు వారు కూలంకషముగ పాండితి గడించి యపూర్వపరిశోధనలచేత నత్యద్భుతచికిత్సలం జేయుచు గణనాతీతములగు సత్కారములఁ గొనిరి. ఆంధ్రదేశమందేమి దేశాంతరములందేమి వీరిపేరెఱుఁగని వారలరుదు. బరోడ, కరాచి, కాన్పూరు, లక్నో మున్నగు దూరదేశముల నుండి ఔషధములకై వచ్చు నాయూయార్డరులేగాక, అటనుండి స్వయముగ వచ్చి చికిత్సచేయించుకొనువారు గూడఁగలరు. వైద్యారంభమునుండియుఁ బేదలగువారి కెల్లరకు వెంకటేశ్వర్లుగారుచితవైద్యసహాయముచేయు నలవాటుకలవారైరి. నాఁటి నుండియు నిట్టిమహోన్నతస్థితియందును వీరివలన వైద్యసహాయముచితముగాఁ బొందినవారు సంఖ్యాతీతులు. ఇరువురనో

మూావురనో పేరొక్కనినచో నితరులుగూడఁ దమ పేరెత్తనందుల కాగ్రహింతురని వివరింపఁజాలంప లేదు.

"ధారణాద్ధర్మః" అను నిర్వచనానుసారముగ సమస్త జగంబుల ధరింపఁజాలునదిధర్మము. అయ్యది సామాన్యవిశేష రూపముల ద్వివిధము. అపౌరుషేయశ్రుతి వాక్యలచే సర్వ జనులకు నాచరింపవలసినవిగా నిరూపితములగు, సత్యము, అహింస, అస్తేయము, తృష్ణారాహిత్యము, పితృభక్తి, దైవతభక్త్యాదులు సామాన్యధర్మములు. బ్రాహ్మణాదచాతుర్వర్ణ్యము నకును, బ్రహ్మచర్యగార్హస్థ్యాద్యాశ్రమ చతుష్టయము నకును బ్రత్యేకముగా నాచరింపఁదగినవిగా విధిష్టములగు వేదవేదాంగాధ్యయనము, శిష్టరక్షణము, దుష్టశిక్షణము, కృషి, వాణిజ్యము, సేవకత్వాదులు విశేషధర్మములు.

ధర్మము పురుషార్థచతుష్టయములో నగ్రగణ్యము. ధర్మావిరుద్ధములగు నర్థకామములు పురుషార్థశబ్దప్రతిపాద్యములు. మోక్షము పరమపురుషార్థము. పురుషార్థసంపాదనము సేయఁజాలని పురుషునిజన్మము నిష్ఫలము. విధివిహితంబుగఁ బురుషార్థసమార్జనము గావింపఁజాలిన పురుషుఁడిహాపరమ్ముల నిరతిశయానందమనుభవింపఁగలుగును. అర్థపురుషార్థమునకుఁ బ్రధానాంగము దానము. తనయార్జించిన విత్తములోఁ గొంతభాగము సత్పాత్రములకొసంగుటయేదానము. త్యాగభోగము లకుఁగాని యర్థసంపాదనమేల? 'త్యాగాయ సంభృతార్థానామ్' అనిగదా మహాకవికాళిదాసునిసూక్తి.

సత్యము, అహింస, పితృభక్తి, దైవతభక్తి, మున్నగుసామాన్యధర్మములు వెంకటేశ్వర్లుగారి యందెంతవఱకుఁగలవో

యీచరిత్రపాఠకులకు విదితపూర్వములె. వర్ణాశ్రమవిహితములగు విశేషధర్మముల నాచరించుటయందుఁగూడ వెంకటేశ్వర్లుగారు ప్రథమగణ్యులు. స్నానము, సంధ్య, జపముమున్నగు శ్రుతివిహితధర్మాచరణమున వీరికి గల శ్రద్ధయపారము. విధిచోదితకర్మానుష్ఠానపరులగు ధార్మికులన్న వీరు మిక్కిలిగాఁ బ్రేమింతురు. ఈరీవలె సద్ధర్మాచరణమునఁ గృషిచేయు నితరులఁ బ్రోత్సహించుటకో యన నట్టివారి యాదర్శజీవితముల మెచ్చుకొనుచుందురు ఆతిథ్యమొసంగుటలో వెంకటేశ్వర్లుగారి స్థానమాద్యము. కావుననే

గీ॥ అనుదినంబేగుదెంచు నభ్యాగతులకు
అర్ధరాత్రమ్మునందైన నధికభక్తి
మడిసోపేతమైన భోజనమొసంగి
తృప్తిఁగావించుచుండు మతిప్రతివిభుండు॥

అని శ్రీధన్వంతరిచరిత్రలో వీరియాతిథ్యపరాయణత్వముసూత్రతుల్యముగా సూచితమైనది.

అన్నదానమనినచో వెంకటేశ్వర్లుగారు ముందడుగు వేయుదురు, ఉత్తమదానము లనేకములుండఁగా అన్నదానమందలిమహాత్త్వమేమని కొందరుప్రశ్నింపవచ్చును. "ఇదేమి శాశ్వతమా, ఆనాఁటి కానాఁడే యరగిపోవుచుండును, గోభూదానాదులందు రేని, యొకదానిమించి యింకొకటి స్థిరమై దాతపేరుప్రతిష్ఠల నీలోకమున నిలుపఁబెట్టుచుండు"నని మరికొందరనవచ్చును. అన్నదానఫలము గుర్తింప నిందుఁడొనర్చిన కృషియే యందులకుఁ బ్రత్యుత్తరమొసంగఁగలదు.

త్రిదివంబున దిక్పాలకాది దివిజులందఱు సహస్రాక్షుని కొలువులోనఁ బ్రసంగములు సలుపుచుండ, శిబివదాన్యతపై వాదోపవాదములు జరిగినవి. ఆతత్త్వముం గుర్తింపనిం ద్రాగ్నులు డేగపావురములై వెళ్లి శిబిత్యాగశీలమును దాతృత్వమును కనులారఁగాంచి యాతని మెచ్చుకొని, యాతని గుణగణములను సభలో వెల్లడించిరి. ఆనాఁడేలనో యన్నదానమునంగల మహాత్త్వమెట్టిదని కోరిక పాకశాసనున కుదయించినది. దానికిఁ దగుసమాధాన మీయఁగలవారెవరాయని తెలియఁదలంచెను. "అన్నదానమునం బ్రసిద్ధిగను, అన్నపూర్ణాదేవి తక్క యితరులెవ్వరు చెప్పఁజాలుదు"రని యుత్తరు లేకకంఠముతో సమాధానించిరి. 'స్వయంతీర్ణః పరాన్ తారయతి' యనువచనానుశ్రుతిచే దనకొఱకే గాక యితరుల కొఱకుఁ గూడ దానుశ్రమించుట భావ్యమని యెంచి, వృద్ధశ్రీవుండొక బ్రాహ్మణ వేషముం బూని నిఖిలపుణ్యరాశియగు వారణాసికేఁగెను. మాయాద్విజుండగు నాదివిజుండు సకలతీర్థములఁ గ్రుంకులిడి, డుంఠివిఘ్నేశ్వరాదులసేవించి, విశ్వేశునభిషేకించి, దయాసమేతయగునన్నపూర్ణామాతం బూజించెను. అన్నదానఫలము నెట్టిదగునో రిక్తతో, నింతు కౌతుకమున నతిభక్తితో నామెఁ బ్రార్థించెను. అమ్మాయని బిడ్డ పిలువఁగనే యెట్టిపనిలోనున్నను దాని విడిచి, ఆతురతతో నాదరింపవచ్చు తల్లివలె నామె ప్రత్యక్షమై "వత్సా! నీవుతలంచిన కార్యమే"మని ప్రశ్నించెను. ఆతఁడెవరో, ఆతని రాకకుఁ గారణమేమియో, యాలోకమాత యెఱుఁగకపోలేదు. ఎఱిఁగియుండియుంగూడ నాతనినోటనే యామాటలు వినఁగుతూహలయై యుండనోపును.

జగజ్జననీ! మీవంటివారి వలనంగాని దెలియనేరని విషయములం దెలిసికొనుకోర్కెతో నిటకు వచ్చితిని. అన్నదానములో మీకంటె నధికులులేరు. దానివలనఁగలుగు ఫలమెట్టిదో తెలియఁజెప్పిన నేనెంతయు ధన్యుఁడనయ్యెద" నని యాభూమీసురుఁడడిగిన దే తరుణముగా నాభవాని "తనయా! నీవు తెలియఁగోరునది చాలనుత్కృష్టమైనది. దాని నిదమిత్థమని తేల్చుటకుఁ గాలము తఱుఁగిపోవుట్టును. శ్రమయని భావింపక మధురానగరమునకుఁ గాలినడక నేగి యటనుండు రాజు నాశ్రయింపుము. ఆభూపునకు సంతతి కలుగలేదు. కాని నీవు వెళ్ళుసమయమున కాపట్టపురాణి గర్భవతియగును ఆనృపునకుఁ గొన్ని నెలలలోఁ బుత్రుఁడుదయించునని తెల్పి, యాశిశుముఖము ప్రథమమున నే నీవు చూడఁగల్గునట్లుగాఁ గోరుకొనుము. రాజందులకు సంతుష్టుఁడై తప్పక నీకోర్కె నెఱవేర్ప సమ్మతించును. ఆనాఁడు నీకన్నదానమహిమ గూర్చి కొంతవరకు బోధపడఁగలదు. నీకంతకంటెసులభ మార్గములే" దని పలికెను. ఘనకార్యము సాధింపఁజూచువారు శ్రమపడిననేగదా ఫలితమందఁగలరు?

అతఁడును కుతూహలాయత్తచిత్తుఁడై చెట్లనక, పుట్లనక గ్రామమనక, కాంతారమనక, కాలిప్రయాణము చేయుచుఁ గొన్నిమజిలీలు గడవఁగా నొకనాటి సాయంసమయమున నొక మహారణ్య ప్రాంతమునకుఁ జేరెను. అటనుండి పయనించుట కష్టము. చుట్టుపట్టుల నేవల్లెయుఁ గానరాదు. అచ్చటచ్చట పొలములలోఁగాపుండుటకుఁ గట్టుకొనిన మంచెలుతప్ప, కుటీరములుగూడ నాప్రాంతములోనున్న జాడలేమియుఁ గనరావు.

కాని దైవేచ్ఛ యెట్లుండునో యని సంశయాత్ముఁడై ముందున కడుగిడక కనిపెట్టు నాతని కొక దీపము కొంతదూరములోఁ గాన్పించెను. దానినే లక్ష్యముగానిడికొని యెట్లో శ్రమించి యా తావుం జేరుకొనెను. అదొక జొన్నచేను. అందులో నొక మంచె దానిమీద బోయదంపతుల నివాసము. ఆహా యేమిభాగ్యము! మనుజులు కంటఁబడఁగానే యాభూదేవుని ప్రాణములు కుదుటఁబడినవి. ఏక్రూరజంతువో పొట్టఁబెట్టుకొనకుండ నారాత్రి గడుపవచ్చునని యాశతో నట నిలిచి, వారితోఁ గొంతముచ్చటించెను. సంభాషణముతోఁ గొంతతనిసిన యావిప్రునికతిథి సత్కారముం జేయ నాబోయ తలంచెను. కాని యాశబరి నిర్దాక్షిణ్యహృదయ. అతిథ్యభ్యాగతుల నాదరింపదు. సరిగదా యాశ్రయమిచ్చుటకుఁగూడ సమ్మతింపదు. తాము భుజించుటకై తెచ్చిన వెదురుబియ్యము, తేనెయు నుండగా, వానినాభూసురునకు నీయసంకల్పము వెల్లడించినపతితో "నీకంత తిండియెక్కువైనచో నీభాగము ధారపోసికొనుము; నాకేమికడుపునిండి పోలేద"ని కసరిపల్కెను. సరసహృదయుండగు శబరుఁడు తనకుఁదిండిలేకపోయిన నొకపూటకేమని యెంచి, తనవంతు నాయతిథికొసంగి ఆకలిబాధ నణంచెను. తాను భార్యతోఁబాటు మంచెపైనుండి, యాతనిం గ్రిందనే యుంచిన, నేదుష్టజంతువైన హాని గావింపవచ్చునని మంచెమీద నాతనిఁ బరుండఁజేసెను. ఆహా దైవసంకల్పము! వ్యాధుఁడా రాత్రి క్రూరమృగముల బారికిఁ దొలంగించి యాపాఱుని రక్షింపనెంచెనే గాని తనప్రాణములు పోవునని తలంపడయ్యె. ఆకస్మికముగా నెటనుండివచ్చినదోగాని బెబ్బులి ముందుండిన బోయనిం జప్పుడు కాకుండఁ

జంపివేసెను. తనభర్తమరణమునకుఁ గారణ మాద్విజుఁడని యా కిరాతకాంత తిట్టి, యనుమరణము నందెను.

కతిపయప్రయాణంబుల నా మధురానగరముం జేరిన బ్రాహ్మణుఁడు రాజదర్శనముఁజేసి యన్నపూర్ణాదేవిపల్కిన తెఱంగున నాచరించి యటఁగొంతకాలము కనిపెట్టియుండెను, అంత నొకశుభదినంబున నారాజమహిషి కుమారునిం బ్రసవించెను. ద్విజునివాంఛితము నెఱవేర్ప సమ్మతిఁచిన భూపతి తన సుతునిఁజూడ నావిప్రున కనుమతి నొసంగెను. తొలుదొల్తనే యాశిశుముఖముంగాంచి "ఓపాపఁడా! అన్నదానఫల మెట్టిదో తెలుపుదువా?" యని ప్రశ్నించు నాతనింగాంచి, "ఓబాపఁడా! అన్నదానమహిమ మెంతటిదో తెలియఁజేయఁజాలనుకాని, యానాఁటిరాత్రి నీవు మాయింటికివచ్చినవు డింత తేనెయు, పెదురుబియ్యము నిచ్చినందులకు నాకీజన్మము లభించినది. ఉత్తమజన్మలందుట యెంతకఠినములో? నాభార్య దాని కనుమతింపమిచే నీయూరనే యొకయెఱుకులవానియింట వరాహగర్భమునఁ బడినది. నీకుఁ జూడ సంకల్పమున్నచో నూరికడకుఁబోయి యెఱుకువాకిటఁదిరుగు మొగమున బొల్లిగల యాపందిపిల్లను గనుగొను" మనిపల్కె, పూర్వజన్మస్మృతి తొలంగ నేకువఁజొచ్చెను. తనకార్యము నెఱవేరినందుల కింపుగను సంతుష్టుఁడయ్యె నాశిశువు చెప్పినరీతి నాక్రోడసంతతిం గనఁదలంచెను. పూర్వజన్మజ్ఞానములేక పొర్లాడు నాపందిపిల్లం గనుటతోడనే యత్యాశ్చర్యమగ్నుఁడై నాకలోకమునకేఁగి యావద్వృత్తాంతముఁ బూసగ్రుచ్చినట్లు దిక్పతులకుం దెల్ప వా

రందఱు సంతసించి యన్నదానమహిమను గొనియాడిరి. అన్న దానఫలము వివరింప నేరితరము?

అట్టిమహిమ యుండుటంబట్టియే భారతీయు లతిథిపూజాతత్పరులై భూతదయాతరంగితాంతఃకరణులై అతిథిసత్కారముతోఁబాటుగా నన్నదానముం జేయు నాచారముగలవారైనారు. అతిథ్యభ్యాగతులు వచ్చుట కెంతయదృష్టముండవలయునో, వానిద్రవ్య మెంతశుద్ధిమైనది కావలయునో! ఎంతబ్రతిమాలినను నొక్కొక్కరియింట విస్తరివేయుటకు మనీషులు సమ్మతింపరు. ధన మొసంగి ప్రార్థించినను నొక్కొక్కగృహమున "నమృతమస్తు"నుటకు వెనుదీయుదురుసరిగదా యడుగు పెట్టుటకుగూడ సంశయింతురు. అందుమూలముననే

"శ్లో॥ యన్నశ్రీషిపదాంభోజరజఃకణపవిత్రితమ్।
తదేవ భవనం నోచే ద్బకారస్తత్రి లుప్యతే॥

యనుసూక్తి ననుసరించి యట్టివారిభవనములు వనతుల్యములు. డాక్క సీతమ్మగారివంటి వారిగృహమేధన్యము. వెంకటేశ్వర్లు గారి భవనమే సార్థకము. ధనమే పరిశుద్ధము. కాఁబట్టియే వీరింటి కయిదారుగు రతిథులు మనీషులు రానిరోజుండదు.

శ్రావణ మాసమునందు ఘనపాఠులు, క్రమాంతస్వాధ్యాయపాఠులునగు భూసురోత్తములెందఱో వెంకటేశ్వర్లుగారి యింట నాతిథ్యమంది సంతుష్టులగుచుందురు. ఆంధ్రదేశమునందలి వేదశాస్త్రపండితులలో వీరి యాతిథ్య సత్కారము లందని వారలరుదు.

వేదపండితులేమి, శాస్త్రపండితులేమి శ్రావణి వార్షికముల్కై సంచార మొనరించుట యాంధ్రదేశముననొకపరిపాటి.

ఇది 60,70సం॥రములకు మున్ను ప్రారంభమైనది దీనికిఁ బ్రధాన కారకులు శ్రీకందుకూరి బసవరాజుగారు.

వీరు విశాఖపట్టణంజిల్లా "ఉర్లాము" జమీందారులు ఆంగ్లభాషాభ్యాసము నుద్యోగాపేక్షతోఁ జేయుచు రాజాదరణములేని వేదశాస్త్రములఁ జదువుటకు వెనుదీయు నాకాలములో వేదశాస్త్రములఁ బునరుద్ధరింపఁదలచి జమీందారువారు పరీక్షలుపెట్టియందుత్తీర్ణులగు వారి కనువత్సరము వార్షికము లొసంగుచుండువారు. "వేదవిద్యావాచస్పతి" బులుసు పాపయ్యశాస్త్రిగారు, పరవస్తురంగాచార్యులవారు. కొల్లూరికామశాస్త్రిగారు మున్నగు మహావిద్వాంసు లాసభలకుఁ బరీక్షాధికారులు గోదావరీమండలమునుండి యెందఱో వేదశాస్త్రపండితులట కేఁగి పరీక్షలిచ్చి వార్షికములం గైకొనుచుండుట పరిపాటి. ఆయావిద్యలలోఁ బరిపూర్ణపాండిత్య మార్జించిన వారలకుఁదప్ప నేమాత్రము కొఱఁతియున్నను జయముగాంచుట యసంభవము. అందుమూలముననే "ఉర్లాము" లోఁ బరీక్షలిచ్చిజయమందినపండితుఁడన్నచో నఖండగౌరవము. బ్రహ్మశ్రీ కడియాల పేరావధానులుగారు మున్నగుమహామహులగు వేదపండితులు, బ్రహ్మశ్రీ జయంతి భగీరథశాస్త్రిగారు మొదలగు మహనీయులగు శాస్త్రపండితులును, ఉర్లాములో జరుగు పరీక్షలలో నుత్తీర్ణులైనవారే. ప్రతివర్షమాపరీక్షలు శ్రావణపూర్ణిమకు జరుగుచుండెడివి. అందుచే గోదావరిజిల్లాపండితులందఱు శ్రావణమాసారంభముననే బయల్వెడలి మజిలీలమీాద ఉర్లాము చేరుకొనుచుండువారు. మధ్యేమార్గమున సంపన్నులగు గృహస్థులు వీరినాదరించి భోజనాది సదుపాయములతో

సత్కరించెడివారు. ఉర్లాముచేరుకొని యీసంవత్సరమే క్రొత్తగా వెళ్ళినవారు పరీక్షలిచ్చియుఁ, బాగ్రితవారు తమపట్టణములం జూపియు వార్షికములం గైకొనుచుండు వారు. ఆకాలములో వేదశాస్త్రపండితుల కది యొకగౌరవజీవనాధారము. వివాహాది శుభకార్యములలో వీరినిసత్కరించుటకు, భూరిసంభావన లిచ్చుటకు నెందఱోకుతూహలపడువారు క్రమక్రమముగా నాపరీక్ష లంతరించినవి. నాఁడేర్పడిన శ్రావణియాత్రమాత్రము తగ్గలేదు. ఆకాలమునం దుర్లాముమార్గములోని సంపన్నగృహస్థుల యాదరసత్కారము లందుకొనురీతి నిక్కాలమందును మనజిల్లాలో సంచారమొనరించుచు సంపన్నుల యాదరసత్కారములం గైకొనుచున్నారు.

వేదపండితులలోఁ గొంతమంది జట్టుజట్టులుగా నేర్పడి శ్రావణమాసారంభమునుండి మాసాంతమువఱకు సంచారము చేయుచుందురు. శ్రావణమాసమున వచ్చువారగుటచేత నీ పండితులకు "శ్రావణి" వారను వ్యవహారమేర్పడినది. ఈ శ్రావణివారు వెంకటేశ్వర్లుగారింటికి ఒక్కొక్కరోజున నేఁబదిమందివఱకు వచ్చుచుందురు. ఎంతమంది యేసమయమున వచ్చినను వెంకటేశ్వర్లుగారు వారందఱ నధికభక్తిశ్రద్ధలతో నాదరించి, మృష్టాన్న మొసఁగి వార్షికసత్కారముల నానందింపఁజేయుదురు. ఇతరసమయములందును పండితులెందఱోవచ్చి వెంకటేశ్వర్లుగారింటనుండి యతిథిసత్కారాదుల నందుచున్నారు. 1930 సం॥రము నుండియుఁ బ్రతివత్సరము వెంకటేశ్వర్లుగారు శ్రావణివారికి వార్షికము లొసంగుచున్నారు. వేదవిద్వాంసులను, శాస్త్రపండితులను సత్కరించుటయనఁగా

వేదశాస్త్రములరక్షించుట, సాంగవేదసంరక్షణమే బ్రాహ్మణ ధర్మముల ముఖ్యధర్మము. బ్రాహ్మణధర్మములను బరిపాలించుటకే వెంకటేశ్వర్లుగారు దీక్ష పూనినారు. తత్ఫలితమే యాగదక్షిణాదానము, వేదశాస్త్రపాఠశాలా నిర్వహణము.

—: యా గ ద క్షి ణ లు. :—

వింజర పురవాసులగు బ్రహ్మశ్రీ ఆకొండి వ్యాససోమయాజులుగారును, వారిపుత్రులు రామసోమయాజులుగారును "అగ్నిష్టోమ" యాగములం దలపెట్టి 1932 సం॥రమున దీక్ష గొనిరి. వెంకటేశ్వర్లుగారును, నరసింహదేవర పేరుశాస్త్రిగారును సమాహూతులై యాగసందర్శన కుతూహలముతో నరుదెంచి, రెండురోజు లటనుండి క్రతుతంత్రమెల్ల భక్తిశ్రద్ధలతోఁ బరిశీలించి సంతుష్టచిత్తులై శ్రీవ్యాససోమయాజిగా రొనరించు యాగమునకు దక్షిణ యంతయు నొసంగిరి. శ్రీ పేరుశాస్త్రిగారును వెంకటేశ్వర్లుగారును అక్కచెల్లెండ్రబిడ్డలగుట సహజమైత్రిఁ బురస్కరించుకొని ప్రతిసత్కార్యమందును బరస్పరము సంప్రతించుకొనుచుందురు. అందువలన నీయాగదక్షిణాదానములో నుభయులకును భాగస్వామ్యమేర్పడినది.

1943 సం॥రమున కపిలేశ్వరపురమున బ్రహ్మశ్రీ దువ్వూరి సూర్యనారాయణసోమయాజులుగారిచేఁ గావింపఁబడిన యగ్నిష్టోమయాగదక్షిణ సంపూర్ణముగా వెంకటేశ్వర్లుగా రొసంగి క్రతుఫలము నందుకొనిరి.

1945 సం॥రమునఁ గూడ నిట్లే బ్రహ్మశ్రీ దువ్వూరి యజ్ఞేశ్వరసోమయాజిగారి మఖదక్షిణ సమస్తము వీరిచేతనీయఁ

బడినది. మఱియు యాగభిక్షకైవచ్చిన భూసురోత్తముల కొం
దఱకో ధనసహాయము గావించిరి. ఆయీవిషయమెల్ల

సీ॥ "చేయించె నెందఱచేతనో దక్షిణా
దానముల్మతోడ నధ్వరములెన్నొ॥"

అని శ్రీ ధన్వంతరిచరిత్రమున మాత్రిప్రాయముగాఁ
దెలియఁజేయఁబడియేయున్నది.

—: ధర్మశాల—మంచినీటిబావి. :—

తలదాచుకొను నీడలేక బాటప్రక్కలఁ జెట్లనీడల
నివసించి శీతవాతాతపబాధలం దాళుకొనఁజాలక ఎండకెం
డుచు వానకుఁదడియుచు దుఃఖమయజీవితముగడుపు ననాధు
లను గాంచునపుడు వెంకటేశ్వర్లుగారిహృదయము ద్రవించు
చుండును; మనస్సుక్షుబ్ధమగుచుండును. కనుల నాదృశ్యముం
జూడలేక తలపెట్టినకార్యమే ధర్మశాల. మండపేటనుండి
ఆలమూరువెళ్ళుత్రోవలో నారవమైలుదాటుసిమ్మట కనఁ
బడుచు చింతలూరుగ్రామసమీపమునందు బాటప్రక్కనున్న
పెంకుటిల్లే వెంకటేశ్వర్లుగారు కట్టించిన ధర్మశాల. ఇయ్యది
భిక్షుకులు, సాధువులు, బైరాగులు మున్నగువారల వసతిగృ
హము. నిరాశ్రయులగు భిక్షుకవనితల ప్రసూతిగేహము. దిక్కు
లేని పేదలకుఁ గల్యాణమందిరము. పాంధజనుల విశ్రాంతి
భవనము.

ఈధర్మశాలవసించు జనసంతతికి దారిఁబోవు పధికులకు
పశ్వాదులకునుపయోగపడు బావి నొకదాని ద్రవ్వింపసంకల్పిం
చిరి. ఆప్రాంతమున నెక్కడ త్రివ్వినను నీరు పడెడిదికాదు.

ఒకవేళ పడినను క్షారోదకమే. అట్టిచోట నట్టి సత్సంకల్ప
ముతో నేమహూర్తమున కూపఖనన మారంభించిరో గాని
వారిహృదయమువలె వినిర్మలమై, వాక్కులంబోలి మధురమైన
జలము లభించినది ఆయుదకము గంగాబోండము (కొబ్బరి)నీరు
వలెనుండుననుటకు దాని నాని పిపాస నణఁచుకొన్న తెరువరులే
సాక్షులు. అట్టి మంచినీటిబావి స్థిరస్థాయిగా నుండవలయుఁగాన
ఇటుకతో గట్టించిరి. ఇద్దియే సర్వకాలము బాటసారులదాహ
శాంతిగావించు ప్రపాతుల్యము. విశేషించి వేసఁగిలో నీనూతి
నీరే పానాధారము. అక్కాలమున నీనూతినీరు త్రావి, యాధ
ర్మశాల విశ్రమించియే బాటసారులు పయనింతు రనుట
యత్యుక్తి కాదు.



ఓమ్

శ్రీమద్ధన్వంతరయేనమః

# శ్రీస్వభాష్యం వెంకటేశ్వర్లుగారి జీవిత చరిత్రము

## పదునొకొండవ ప్రకరణము.

(శ్రీధన్వంతరి, విశ్వేశ్వర, వేంకటేశ్వర దేవాలయప్రతిష్ఠలు, కుముద్వతీపరిణయ కృతి, శ్రీవేంకటేశ్వరవేదశాస్త్ర పాఠశాలా ప్రతిష్ఠాపనము.)

పరమేశ్వరసృష్టమగు జంతుసంతతిలో మానవజన్మముత్తమము. దుర్లభము. ఆహారనిద్రాదులు సమానములయ్యును నరులకు జ్ఞానమొక్కటివిశేషము. ఆజ్ఞానమే మానవునిఁ బశుత్వమునుండి వేరుపఱచుచున్నది. అట్టిజ్ఞానవంతుఁడగు మనుజుఁడు తనధర్మములను సక్రమముగా జరపించుచు, ఐహికవిధులను నెఱవేర్చుకొనిననేతప్ప తనయుత్తమత్వమును నిలుపుకొనఁజాలఁడు. పతితుఁడగుట తేలికయేగాని ఉచ్చస్థితినంది, ఉత్తముఁడనిపించుకొనుట కష్టము. ఉత్తముడనిపించుకొనని మనుజునకుఁ బశువునకుఁ దారతమ్యమేమి? జ్ఞానము, వివేకము, మాటాడుశక్తియుఁ గలమానవునకు సాధ్యముగానిదేమున్నది? తూర్పుతెల్లవారకమునుండుఁ దమగూటినుండి కలకలారావములతోఁ బక్షిగణము భగవంతుని మహిమలను గొనియాడుచుండఁగా, నంతకంటె నధికుఁడగు మానవుఁడు పరాత్పరునియందు భక్తుఁడై యుండుటయే ధర్మముగదా? తనకువిద్యావివేకములున్నందులకుఁ దనకర్తవ్యపాలనమే ముఖ్యము.

మానవజన్మ మెత్తినపిదప నీకగోరఁదగినది జననమరణ రహితమై, నిరతిశయానంద సహితమగు నిర్వాణపదవియే. ఆమోక్షపదవినిఁజేరుటకుఁగల మార్గములలో సులభమగు నది భక్తిమార్గము. సర్వజనులును పండితుఁడని, పామరుఁడని; భూకాంతుఁడని, తత్సేవకుఁడని; ధనికుఁడని దరిద్రుఁడని; స్త్రీయని, పురుషుఁడని భేదములేకుండ నందఱుఁ బోఁదగిన రాచబాట భక్తిమార్గము. పోతన్న, త్యాగరాజు, రామదాసు,కబీరు మొదలగు మహాభక్తులెందరో యీతోవలో నడచియే దైవసాక్షాత్కారమునంది, యుత్తమలోకమును జేరి ధన్యులైరి. రామదాసు సదేహుఁడై యుత్తమలోకముం జేరుటకుఁ గారణము భక్తితప్ప యితరములుగావు. భక్తపరాధీనుఁడగు భగవంతుని సేవించినయేప్రాణి మోక్షమునందలేదు ? గజేంద్రమోక్షము ధ్రువచరిత్రము మున్నగుసద్గ్రంథము లెల్లఁదెల్పునదొక్కటియే పశువని, పసిబాలుఁడని తలంపక తనయందు మనస్సుంచి, తద్భక్తులైన వారికందరకు నుత్తమజ్ఞానము ప్రసాదించుటయు, కైవల్యపదవిఁ జేర్చుటయే తనభక్తులకు నాపరమేశ్వరుఁ డనుగ్రహించునది. అట్టి యవ్యాజకృపాపరిపూర్ణుఁడగు భగవంతుఁడు భక్తిసులభసాధ్యుఁడు. అతనియందుభక్తులై జీవితమును సుఖమయముగ నొనరించుకొని, తాము తరించుటయే గాక యితరులఁ దరింపఁజేయ సంకల్పించువారే ధన్యతములు. గురుదేవపితాద్రులపై భక్తిగలసత్పురుషులే పురాణప్రసిద్ధులై కీర్తికాయులైరి. భక్తిలేనిజన్మకు ముక్తిలేదు.

పూర్వజన్మ సుకృతవశమున నట్టిభక్తి యలవడును. ప్రతి వ్యక్తియు భక్తుఁడుకాలేఁడు, కాని సంకల్పమున్నచో నేనాఁటి

కేని యది యలవడకపోదు. భగవన్నామోచ్చారణ మొనర్చి యుత్తమలోకము నందఱో చేరుకొనినారు. సాధారణముగ నామోచ్చారణము చేయుతలం పుకూడఁగలుగదు. అందుకనే "నారాయణేతి మంత్రోస్తి వాగస్తి వశవర్తినీ తథాపినరకేఘోరే పతంతీత్యేతదద్భుతమ్॥" అని ధర్మరాజుమంత్రోచ్చారణావశ్యకమును వెల్లడించినాఁడు. నవవిధభక్తిమార్గములలో నేయొక మార్గమునన్ననైన సంచరించు భక్తులజీవితములే ధన్యములు. వెంకటేశ్వర్లుగారు భక్తాగ్రేసరులు. తమకు శ్రీధన్వంతరిస్వామి యందుఁగల భక్తియపారము. ఆభక్తిచేతనే తమయభివృద్ధికిఁ గారకుఁడును, వివిధౌషధప్రదాతయు, జరారుగ్భయనివారకుఁడును, సుధాకుంభహస్తుఁడును, శ్రీమహావిష్ణుని యేకవింశత్యవతారములలోఁ బండ్రెండవ యవతారముగఁ జెప్పఁబడిన వాఁడు నగు శ్రీధన్వంతరి దేవు ననునిత్యము సేవించుటకు నాలయము గట్టింప నిశ్చయించుకొనినారు.

ధన్వంతరిదేవునకు యావద్భారత దేశమున నే యొకటి రెండాలయములు కలవేమోగాని యంతప్రచురముగాలేవు. ఆదేవదేవుని కాలయముగట్టించి ప్రతిష్ఠించుటచేత వెంకటేశ్వర్లుగారు తమభక్తిప్రపత్తులు వెల్లడించుకొనినారు. శ్రీధన్వంతరివిగ్రహము పాలశిలతోఁ జేయింపవలెనను సంకల్పము నెఱవేరుట కాఁపనివారు కాశీపురంబునఁగాని లేరు. మ. రా. శ్రీ పైండా సూర్యనారాయణమూర్తి జమీందారువారంతకు మున్ను కాశీపురమ్మునవిట్టివిగ్రహములు సేయించినట్లు బాగుగా నెఱిఁగియున్నందున వెంకటేశ్వర్లుగారు తమసంకల్పమును వారితో ముచ్చటించిరి. వారును నాసత్సంకల్పమున కమితానంద

నుండి వెంకటేశ్వర్లుగారి ద్రవ్యములోఁ గాశీక్షేత్రమున కరిగి సర్వలక్షణలక్షితము, నిరుపమసౌందర్య ధుర్యమునగు శ్రీధన్వంతరి విగ్రహము చేయుంచి తీసికొనివచ్చిరి.

మఱియు విశ్వేశ్వరప్రతిష్ఠకై నర్మదాబాణలింగము తీసికొనిరాఁబడినది. శ్రీ భూదేవీ వేంకటేశ్వరవిగ్రహములు అన్నపూర్ణావిగ్రహము, నందీశ్వరాదివిగ్రహములు శిల్పులచే నిర్మింపఁ జేయఁబడినవి.

## 1942

స్వస్తిశ్రీ చాంద్రమాన చిత్రభానునామ సంవత్సర వైశాఖశుక్ల తృతీయాదివసమున పాంచాహ్నికదీక్షతోఁ బ్రతిష్ఠామహోత్సవ ముపక్రమింపఁబడినది. "మంత్రశాస్త్రమహోదధి" శ్రీ శిష్టా రామశాస్త్రిగారి యాధ్వర్యమున వేదవేదాంగవేత్తలగు మహావిద్వాంసు లెంతమందియో వచ్చి యార్త్విజ్యము నిర్వహించిరి. వేదపారాయణము, రామాయణపారాయణము; ధన్వంతరి, పంచాక్షరి, అష్టాక్షరి మున్నగు మహామంత్ర పునశ్చరణములును సమర్థులగు పండితప్రకాండులచే జేయఁబడినవి. యంత్రోద్ధారకులు శ్రీ శిష్టా రామశాస్త్రిగారు, ఆహూతులైన బంధుమిత్రులు, కవిపండితులు పెక్కుమంది యమ్మహోత్సవమునఁ బాల్గొనిరి. పరిసరగ్రామములనుండి యనుదిన మరుగుదెంచుయాత్రికులు పరస్సహస్రము. బ్రాహ్మణులేమి, యితరులేమి ప్రతిపూట వేలసంఖ్యమీఁద భోజనము, త్రికాలములందును బౌరాణికాగ్రేసరులచేఁ బురాణపఠనము, పండితుల శాస్త్రార్థములు, వేదపండితుల స్వస్తివాచనములు, అవియివి యననేల? కనులారఁగాంచ దగిన యానాఁటి దృశ్య

ములు చూడవలసినవేగాని వర్ణనాసాధ్యములుగావు. ప్రత్యేక ముగా నాదృశ్యములం బరిశీలించిన కవి సంగ్రహముగ వ్రాసిన యొకపద్యము నుదాహరించుట యప్రస్తుతము కాదు.

సీ॥ ఒకచో నుదాత్తాదికోజ్జ్వలస్వరముల
నలరారు వేదపారాయణమ్ము
ఒకవంక శ్రుతిసుఖం బొనరించు వాల్మీకి
రామాయణంబు పారాయణంబు
ఒకదెస నాగనప్రకటబంధములొప్ప
మంత్రవేత్తలొనర్చు మంత్రజపము
ఒకప్రక్క జనులెల్ల రుల్లసిల్లఁగఁ జాలు
రాణమైనొప్పు పురాణగోష్ఠి

గీ॥ ఒకట దిగ్దంతులోయన నొప్పు విబుధ
వరుల పటుతరశాస్త్రార్థ ఫణితు లలర
నాది ధన్వంతరి ప్రతిష్ఠాఖ్యమహము
సత్త్రయాగమ్మొ నాఁగఁ బ్రశస్తిఁగనియె॥

వైశాఖ శుక్లసప్తమీదివసంబున, దైవజ్ఞనిర్ణీతసుముహూర్తంబున శ్రీమదాదిధన్వంతరి శ్రీభూదేవీసహిత వేంకటేశ్వర అన్నపూర్ణాసమేత విశ్వేశ్వరప్రతిష్ఠలు వెంకటేశ్వర్లుగారిచే జరుపఁబడినవి. ధూపదీపనైవేద్యములు శాశ్వతముగా జరుగుటకై నూరుబస్తాలధాన్యమాదాయమువచ్చు నెనిమిదెకరములభూమి "దానపట్టా" వ్రాసి యాప్రతిష్ఠామహోత్సవ సమయమ్ముననే దేవునకు సమర్పించిరి. ఇట్టిఘనకార్యము నెఱవేర్చుట యెంత పుణ్యము ? దానివలననే వెంకటేశ్వర్లుగారు ఆయురారోగ్యైశ్వ



శ్రీ ధన్వంతరి.

ర్యములతోఁ దులఁదూగుచున్నారు. యశమార్జించుకొనినారు. వారిజన్మసార్థకము. ప్రతిష్ఠామహోత్సవముం గాంచు వేడ్కనరుదెంచిన కవీశ్వరులు వ్రాసినపద్యము లెన్నేనింగలవు. అందులో నొకకవి పద్యములుమాత్రమే యిట నుదాహృతములైనవి.

సీ॥ స్థాపించి మందులషాపు లెన్నింటినో
ఏజంటువృత్తుల నేర్పరచితి
పెట్టించితివి బాటఁ బెద్దసత్రంబునీ
యూరిప్రక్కనె బాటసారులకును
త్రవ్వించినాడవు దయమీర కూపంబు
రాజమార్గమునందు తేజరిల్ల
అన్నదానంబు నీ పతిభక్తి జేయుచు
బీదసాదలనెల్ల బెంచుచుంటి
ధన్వంతరీ దేవదర్శనంబును గోరి
అద్భుతమైన యీయాలయంబు
కట్టించినాడవు కడుభక్తితోనీవు
వెచ్చించి వేలకువేలుధనము

గీ॥ చింతలూరున నెల్లకొఅంతదీరె
ద్రావిడారామమందార ! దానశౌండ
భూసురవరేణ్య ! కవికాండపోషకగుణ
వినయభాసుర ! ద్వీభాష్య వేంకటేశ॥

ఉ॥ గుణియుగుపుత్రిడీవియునుకూవముసత్రమునన్న దానమున్
కవివినసట్టి దేవళము కల్పన జేసితి వీధరాస్థలిన్
జవనుత వేంకటేశ యిఁక సత్కృతిబొందుము సప్తసంతతిన్
అవయము నీదుకీర్తి భువినంతయు వెల్గు ననంతముండలిన్॥

సీ॥ నీకీర్తి దిశలందు నిండియుండెను నేడు
పాండ్రింపు శీతగిరీంద్రమువలె
నీకీర్తి వెన్నెల నిర్మలాకాశాన
చంద్రకాంతము వోలె సౌరుమీరె
నీకీర్తి మణికాంతి లోకాంధకారంబుఁ
పారదోలుచు భువిఁ పరిఢవిల్లె
నీకీర్తి సురపురిప్రాకారములతోడఁ
బ్రాకులాడుచునుండె బ్రకటముగను

గీ॥ వైద్యరాజ ! ద్విభామ్య సద్వంశ తేజ !
వేంకటేశ్వర ఆమయసంకటహార !
సరస! ఆయుసుప్రతిష్ఠ మహమ్ము
కీర్తికాంతకు మంగళమూర్తికాదె.

ఇట్లు,

కాకరపట్లు 22—4—42

వేములు సత్యనారాయణ,
పండిట్, బాలసరస్వతీ సమాజం,
తణుకు.

## —: శ్రీకుముద్వతీపరిణయకృతి :—

శ్రీ ధన్వంతరిజయంతివ్రతము ప్రతివత్సరము కార్తిక బహుళ త్రియోదశీ దివసంబున నాచరింపవలసినదిగా ధర్మశాస్త్రకర్తల యనుశాసనము. వెంకటేశ్వర్లుగారు ప్రతిసంవత్సర

మావ్రతమును తమయింటియొద్ద మహావైభవముతోఁ జేయుచుండువారు. శ్రీధన్వంతరి ప్రతిష్ఠజరిగిన చిత్రభానుసంవత్సరమున శ్రీధన్వంతరి జయన్తిపర్వమరుదెంచినది. అయ్యాదిప్రతిష్ఠారంభవత్సర జయంతియగుటచే బంధుమిత్రులు, కవులు, పండితులు సమాహూతులై పలువురువిచ్చేసిరి ఆవ్రతము భోగియమానముగా జరిపింపఁబడినది.

ఆమహోత్సవ సమయమున కాకినాడతాలూకా తమ్మవరం గ్రామవాస్తవ్యులు, కవితాధురంధరులు నగు శ్రీ ద్విభాషి సోమనాథశాస్త్రిగారు తమచే రచియింపఁబడిన "శ్రీకుముద్వతీ పరిణయము" అను ప్రబంధమును వెంకటేశ్వర్లుగారికిఁ గృతి సమర్పణము గావించిరి. కవిగారికి మూఁడు నూటపదియాఱులు, జోడు శేల్వాలును పారితోషికముగా నొసంగి కృతిభర్తలు సత్కరించిరి. ఈకృతిసమర్పణసభకు పోలవరం గ్రామవాసులును, సుప్రసిద్ధవైద్యులు, కవివతంసులును నగు బ్రహ్మశ్రీ ఆకొండి రామమూర్తి గారధ్యక్షతవహించి సభ్యుల నానందింపఁజేసి జయప్రదముగా నిర్వహించిరి. ఆసంవత్సరముననే "కవి కథక రత్న" శ్రీమాన్ పెద్దింటి సూర్యనారాయణదీక్షితభాగవతార్ గారిచే శ్రీధన్వంతరిచరిత్రము హరికథగా రచింపఁజేసి కథా గానముచేయఁగాఁ బ్రత్యేకముగా నాదాసుగారికి నూటపది యార్లతోఁ బారితోషికము గావించిరి.

—♦ శ్రీవేంకటేశ్వర వేదశాస్త్రపాఠశాలా ప్రతిష్ఠాపనము. ♦—

తూర్పుగోదావరిజిల్లా కాకినాడతాలూకా వింజరము "విద్వత్కుంజర"మని ప్రసిద్ధికెక్కిన గ్రామము. ప్రాచీనకాలమునుండి యెందఱో విద్వాంసులాయూరనుండి వేదశాస్త్రము

లను, కళలను, రక్షించుచుండిరి. రానురాను వేదశాస్త్రములకు నాదరణ తగ్గుటచేత నావిద్యనభ్యసించు వారరుదైరి. పండితు లైనను కుటుంబపోషణమునకై పల్లెల విడిచి నగరములకుఁ బోవొడంగిరి అట్టిస్థితిలో 1903 సం॥రమున నాగ్రామములో వేద శాస్త్రపాఠశాలనెలకొల్పి వేదశాస్త్రముల సంరక్షింపవలెనను సంకల్పముతో మహామహులు కీ॥శే॥ పాలంకి పేరుశర్మగారు కృషిసల్పినారు. తత్ఫలితముగాఁ బ్రతిష్ఠితమగు పాఠశాలను రమారమి 30 సంవత్సరములు జయప్రదముగా నిర్వహించి యాంధ్రదేశములోని పలువురుపండితులఁ బోషించి పరశ్శత విద్యార్థులకు విద్యాదానమొనరించిరి. "అభినవపతంజలి" బ్రహ్మశ్రీ జయన్తి భగీరథశాస్త్రిలవారు "పండిత వ్యాకరణాచార్య" బ్రహ్మశ్రీ జయన్తి సూర్యనారాయణశాస్త్రిలవారు శ్రీరామడుగుల వెంకటసుబ్రహ్మణ్య సోమయాజులుగారు మున్నగు మహావిద్వాంసు లా పాఠశాలాధ్యాపకులు.

"వ్యాకరణాచార్య"

బ్రహ్మశ్రీ కంభంపాటి రామమూర్తిశాస్త్రిగారు,
,, జయన్తి సత్యనారాయణశాస్త్రిగారు,
,, శతావధాని వేలూరి శివరామశాస్త్రిగారు,
,, వారణాసి సత్యనారాయణశాస్త్రిగారు,
,, జయన్తి వెంకటసుబ్బరాయశాస్త్రిగారు.

వైయాకరణ శిరోమణి బ్రహ్మశ్రీ పేరి వేంకటేశ్వరశాస్త్రిగారు
అప్పల్లజోగన్న శాస్త్రిగారు

మున్నగు మహాపండితులెల్ల నాపాఠశాలకు విద్యార్థులు. దేశవిఖ్యాతమగు నాపాఠశాల పేరెరుంగని వారలరుదు

పేరుశర్మగారి పరోక్షమునఁగూడఁ దత్సోదరుఁడును గ్రామస్థులును గొంతకాలము నిర్వహించుటలోఁ బ్రభుత్వసహాయము కొరతవడుటచే నాపాఠశాలలును బరోక్షస్థితి నందినవి గ్రామమందుండు పండితులు జీవికార్థమై గ్రామాన్తరముల కరుగుటచే వేదశాస్త్రము లభ్యసింపఁగోరు విద్యార్థులు పరవాసము చేయవలసివచ్చినది. తమబిడ్డలు విద్యకై గ్రామాంతరములకేగి పలుకష్టము లనుభవించునప్పుడేదో కృషిసల్పక పెద్దలెట్లూరుకొనఁగలరు? ఆయీపరిస్థితిలో వింజరంగ్రామస్థులు వెంకటేశ్వర్లుగారి ధార్మికత్వౌదార్యాది సుగుణముల వినికనియున్నవారగుట వారివలన గ్రామమునకీ యుపకారము తప్పకజరుగఁగలదను దృఢవిశ్వాసముతో నొకవిజ్ఞాపనపత్రము వ్రాయించి గ్రామస్థులచేవ్రాలులు చేయించి కొందరుపెద్దలు బయలుదేరి చింతలూరు వెళ్ళి వెంకటేశ్వర్లుగారి దర్శనమాచరించి విజ్ఞాపనపత్రమందించిరి. వారును వింజరంగ్రామస్థుల విజ్ఞప్తి నాలించి వేదశాస్త్రములఁ బోషింపని ద్విజులఁగాంచి ధరిత్రి వారి భరింపఁజాలక యేవగించుకొనునని వినియున్నవారగుటను వేదశాస్త్రములఁ బునరుద్ధరింపవలెనను తలంపుగలవారగుటనుతక్షణమే “మీగ్రామమందు వేదశాస్త్రపాఠశాల నిర్వహించుటకై పదివేలరూప్యములు దానముచేయుచుంటిని. ఈధనముతో పాఠశాలానిర్వహణమునకు నగు వ్యయమెల్ల నేనేభరించెదను” అనిపల్కి వెంటనే ఆపదివేలరూపాయలు శ్రీనరసింహదేవర సత్యనారాయణగారి యాధిపత్యమున జరుగు “ఆలమూరు రూరల్ బ్యాంకిలో” ఫిక్సెడ్ డిపోజిట్టు”గా జమకట్టించిరి. వింజరపురవాసు లాసమయమునఁబొందిన యానందమునకు మేర

లేదు. "నలుబది యేండ్లు పాఠశాల జరిగినను స్థిరముగునిట్టియే ర్పాటంతకుఁబూర్వము జరిగియుండ లేదు, నేఁటికట్టిమహావకా శము సమకూరినది. మనపిల్లపిల్లలతరముఁగూడ వేదశాస్త్రము లభ్యసించఁదగు నుత్తమావకాశము లభించినదిగదా" యని యెంతయు సంతసించి, వెంకటేశ్వర్లుగారి యౌదార్యమును బహుభంగులఁగొనియాడిరి. అద్దియేగదా కృతజ్ఞులక్షణము.

పార్థివసంII ర కార్తికశుద్ధ విదియ (7-11-1945) నాఁడు వింజరంగ్రామమున "శ్రీ వేంకటేశ్వర వేదశాస్త్రపాఠశాల" ప్రతిష్ఠింపఁబడినది. బ్రహ్మశ్రీ నరసింహదేవర సత్యనారాయణ గారి యాధిపత్యమునఁ బాఠశాలా ప్రతిష్ఠాపన మహోత్సవసభ జేగీయమానముగా నిర్వహింపఁబడెను. మ. రా. శ్రీ అంగర కృష్ణారావు పంతులు బి. ఏ, బి. యల్ గారు సభాప్రారంభ ముగావించి తమ యాశయములఁ దెల్పిరి. శ్రీసత్యనారాయణ గారు సహజగంభీర వాగ్ధోరణితో, వేదశాస్త్రములు పునరు ద్ధృతము లగు నను నుత్సాహముతో రెండు గంటలకాలము మహోపన్యాసము గావించిరి. "విద్వత్కవిశేఖర వ్యాకరణా చార్య" ఓలేటి సూర్యనారాయణశాస్త్రిగారు ప్రధానోపా ధ్యాయులుగను "ఉభయ వేదపారంగత" శ్రీభళ్ళమూడి సత్య నారాయణమూర్తి అవధానులుగారు వేదాధ్యాపకులుగను పాఠశాలాప్రారంభము జరిగింపఁబడినది. విఁజరంగ్రామస్థుల చేతను, ఆంధ్రయువజనమండలిచేతను స్వాగతపత్రములు చదువఁబడినవి బ్రహ్మశ్రీ శతావధాని చెళ్ళపిళ్ళ వెంకట శాస్త్రిగారును బ్రహ్మశ్రీ అల్లంరాజు సోమకవిగారును పద్య

పూర్వకమగు శుభసందేశముల నంపిరి. కవులు పద్యాంజలు లర్పించిరి.

వేదశాస్త్రములు జీర్ణావస్థ కగ్గముగానున్న యీరోజుల లో మహౌదార్యముతోఁ దత్పరిపోషణమాచరింప దీక్షఁబూనిన వెంకటేశ్వర్లుగారి మహోన్నతాశయమును దాతృత్వమును గొనియాడనివ్యక్తి యెచ్చటను గానరాఁడు. ఆనాఁటిస్వాగతపత్ర ములు శుభసందేశములు పద్యాంజలులు నీక్రిందనుల్లేఖింపఁ బడుచున్నవి,

---

ఓమ్

బ్రహ్మశ్రీ వైద్యరాజ ద్విభాష్యం వెంకటేశ్వర్లుగారికి

పింజర పురవాసులొసంగిన

# యభిసందన పత్రము.

వైద్యరాజా !

చరక, సుశ్రుత, నిత్యానాథసిద్ధోపజ్ఞంబగు నాయుర్వేద కలశవారాశి మథియించి జనించిన యౌషధామృతంబున జగ జ్జనరుజాభారంబుపశమింపఁజేసి ప్రజారంజకుండవై వైద్యరాజ త్వమన్వర్థంబు గావించిన భవత్ప్రభవ మనన్యసామాన్యము గదా !

ధార్మికశిరోమణీ !

శ్రుతిస్మృతి విహితధర్మాచరణ వినిబద్ధాదరుండవై శ్రీ మద్ధన్వంతరి వేంకటేశ్వర, విశ్వేశ్వర దేవాలయంబుల ప్రతి ష్ఠించిన తమ ధర్మతత్పరత కడుంగడు శ్లాఘనీయముగదా!

వదాన్యాగ్రేసరా !

"త్యాగాయ సంభృతార్థానామ్" అనుసూక్తిపూర్తిగా నాచరణంబునకుం దెచ్చి అయ్యందరిద్రో భవితేతి వైధసీం లిపిం లలాటేర్థిజనస్యజాగ్రతీం । మృషానచక్రేఽల్పిత కల్పపాదపః ప్రణీయదారిద్ర్యదరిద్రతామ్" అనునట్లర్థిజనదారిద్ర్యముచ్ఛేదించుభవద్వితరణ మనిర్వర్ణనీయముగదా !

ధరణీసురకుల భూషణా !

"బ్రాహ్మణేన నిష్కారణో ధర్మః షడంగో వేదో ధ్యేయో జ్ఞేయశ్చ" అను మహాభాష్యోక్తి కనుగుణముగ బ్రాహ్మణధర్మపరిపాలనార్థము మాగ్రామంబున శ్రీవేంకటేశ్వర వేద శాస్త్రపాఠశాలను నెలకొల్పి భూసురకుల ప్రతిష్ఠనతిశయింప జేసిన తమకివే యనేకాభివందనములు.

సుగుణమణి రోహణా !

దయాసత్యశౌచాది సమస్తసద్గుణంబుల నాదర్శభూత జీవితమ్మున మను తమ కితోధికాయురారోగ్యభాగ్యంబు లొసంగి తమవంశంబెల్ల నేతాదృశ సుగుణగణనీయంబై యాచంద్రార్క మభివృద్ధిగాంచి మించునట్లా పరాత్పరుండగు ధన్వంతరి యనుగ్రహించుగాత !

7-11-45
వింజరం,

ఇట్లు,
వింజర పురవాసులు.

శ్రీయుత వైద్యరాజ ద్విభాష్యం వెంకటేశ్వర్లుగారు వింజరంగ్రామమున శ్రీ వేదశాస్త్రపాఠశాలాప్రతిష్ఠాపన సందర్భమున శ్రీవారికి ఆంధ్రయువజనమండలివారిచే సమర్పింపఁబడిన అభినందనపత్రము.

శ్రీవిద్వద్వైద్య సార్వభౌమా!

భువిని అపూర్వాభీలపీడితమహావ్యాధుల నిర్మూలింపఁజేయఁజాలు అనంతదివ్యౌషధరాజంబుల నిర్మాతృత్వమే భవదీయ సకలవైద్యశాస్త్రసంవేదిత్వమును వెల్లడించుచు వివిధ వైద్యోపశాఖలద్వారా వైద్యరాజ్యము ననుభవించుచున్నావు.

సనాతన ధర్మపరాయణా!

నాస్తికతాపిశాచము నలుదెసల తీవ్రరూపమున తాండవించుచున్న ప్రస్తుతకాలమున ధన్వంతర్యాది దేవళ ప్రతిష్ఠాపనమును, మాగ్రామమున వేదశాస్త్రపాఠశాల నెలకొల్పుటయు నీధర్మపరాయణత్వము వేనోళ్ళ చాటుచున్నది.

సకలసద్గుణ సంపత్సమేతా!

శ్రీద్విభాష్యకుల పర్వతాగ్రమం దుద్భవించి సత్పుత్ర సంపద్విరాజితుండవై ఆశ్రితజనాళికి కల్పవృక్షమై విబుధాళిని నెల్లవేళలసన్నుతింప రాజయోగివలె విరాజిల్లుచు సప్తసంతాన ప్రతిష్ఠగావించి విమలయశఃపుంజితంబుచే విరాజిల్లు నిగర్వచూడామణీ నీజీవితము యెంతధన్యమైనది.

వింజరం,
7–11–45.

ఇట్లు,
ఆంధ్రయువజనమండలి.

శ్రీమత్పరదేవతాయైనమః

శ్రీ॥ వే॥ బ్రహ్మశ్రీ శతావధాని చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రులుగారు వింజరంగ్రామమున స్థాపించు వేదశాస్త్రపాఠశాల తెరచుసమయమున పంపినపద్యములు.

ఆశీర్వచనము.

శ్లో॥ యశ్శివో నామరూపాభ్యాం యా దేవీ సర్వమంగళా।
ద్విభాషి వేంకటేశస్య తౌ విమౌ కురుతాం జయమ్॥ ౧

మ॥ వినుచుంటిన్ వినుచుంటి నీదుసుగుణావిర్ఖ్యాతి నో వేంకటే
శ నినున్ దేవుడనామయాయువిడుచున్, సంపన్నురక్షించునీ
వనిశమ్మొం బొనరించుధర్మకృతు లత్యంతమ్ము వర్ధిల్లి నీ
జనికిన్ వన్నె ఘటిల్లుగాక సతమైశ్వర్య మ్మవార్యమ్ముగన్

సీ॥ స్వగ్రామమందు ధన్వంతరి కాలయ
మ్మును నిల్పి యద్వేల్పు పూజకొఱకు
వసతిగల్పించి నల్వదివేలకు సుమారు
కర్చువెట్టిన నీదుఘనత కేనె
కాదు తోటలవశాఖ సమస్తమును గర్వ
పడి నిన్ను సతము దీవనలతోడ
పూజించుచున్న దిప్పుడు వేదశాస్త్రముల్
పఠియింపగా జేయుపాఠశాల

తే॥గీ॥ ఇంజరంబున నీపేర నేరుపఱుప
నయుతము (పదివేలు) ధనంబు నిచ్చు నీత్యాగమునకు
దనిసి ధన్వంతరి యభీష్టదాత యగుచు
మనుచు గావుత నూరేండ్లు ఘనతతోడ. 3

క॥ కృతి నొకటం డిదివఱ కం
కిత మందితి నౌషధములు కేవలమున్ నీ
పతిథుల కుచితం బిచ్చుచు
కృతివి నినున్ బ్రోచు వేంకటేశ్వరు డెపుడున్. ౪

తే॥గీ॥ కొడుకు, కొడుకుసంతానము నెడప కెపుడు
దోసతోటయుబోలె సంతోషముగ స
దా కెలంకుల జెల్వార నీకు గడచు
గాక వేంకటేశ్వర వార్ధకమ్ము వీక. ౫

ఇట్లు

కడియం, } శ్రేయోఽభిలాషి
7—11—45 } చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి శతావధాని.

శ్రీరస్తు.

ఆశీర్వాదపద్యపంచకము.

సీ॥ ప్రథిత మైనట్టియూరాముద్రవిడశాఖ
యందు ద్విభాష్యాన్వయమున బుట్టి
వైద్యవిద్యాపాటవంబునఁ బెను పొంది
యారోగ్య మొదవించు నౌషధములు
ధన్వంతరిప్రసాదములు నాఁదగువాని
నిర్మించి శాస్త్రనిర్ణీతములుగ
ప్రఖ్యాతివడసితి బంగారుపతకంబు
లాయున్నిగమ వేత్తలమునుసభను

గీ॥ కాంచితివి కాంచనునాన్ను గాంచగలవు
కరుణ దళుకొత్త శివు డిసుగాత నీదు

వన్వయమునకు దైనందినాభివృద్ధి
వరసుగుణసాంద్ర వేంకటేశ్వరసుధీంద్ర॥ ౧

శా॥ ఔరా యెందరు లేరు వైద్యులు సెబాసా సేతుశీతాచలో
దారక్షోణిని వేంకటేశ్వరసుధీంద్రా వైద్యరాజా సుధా
వారాశిన్ బ్రహసించు తావకయశఃప్రాశస్త్య మవ్వారికిన్
గోరంతేని లభింపదయ్యె నిదిప్రాక్పుణ్యప్రభావం బొకో॥ ౨

ఉ॥ ఆయతబుద్ధిశాలి భవదాత్మభవుం డగునట్టి సూర్యనా
రాయణమూర్తి నీదగుమహత్తరకీర్తిని నిల్పుగాత దీ
ర్ఘాయురుపేతుడై కొలము నభ్యుదయంబువహించుగాత కా
త్యాయని వేంకటేశ్వరబుధాగ్రణి నీకిడుగాతభద్రమున్॥ 3

తే॥ పింజరగ్రామమునగల వేదశాస్త్ర
పాఠశాలకు మిగుల దోడ్పాటుపడతి
వాలయంబులు కట్టించి తమరులందు
నిరవుకొని యుండ వేంకటేశ్వరసుధీంద్ర॥ ౪

తే॥ శేషగిరి యనుపేరూని చెన్నుమీఱ
పుట్టగల డింకమీఁద నీపుత్రుడైన
సూర్యనారాయణునకు సంశుద్ధమతికి
సుతుడొకడు వేంకటేశ్వరసూరివర్య॥ ౫

పిఠాపురండివిజన్,
చేబ్రోలు.

ఇట్లు, ఆశీర్వాదాభిలాషి,
అల్లమరాజు సోమకవి.

సు ప్ర శం సా.

శ్లో॥ ఆమ్నాయభాష్యే ఫణిభాష్యవాచి
విచక్షణా శ్శిష్యసహస్ర మత్ర
ద్విభాష్యవంశీయచరిత్రగాథా
గాయంతు ధన్వంతరిపుణ్యబోధాః॥ ౧

శ్లో॥ అంచచ్చర్మకషాకషాయమరుతో వీచీనికాయైశ్చయై
ర్యద్దేవాలయపృష్ఠశాద్వలతలే సంసేవితై స్సంతతమ్।
అస్మాభిః పిపఠీర్భిరర్భకదశాలీనైః పురా యన్మహా
న్మోదోఽభూత్పునరద్యపూర్వవిభవస్సంస్మర్యతేస్వాత్మని॥

శ్లో॥ ఆమ్నాయశాస్త్రోభయవాక్యసత్ర
మత్రప్రతిష్ఠాపిత మార్యమాన్యమ్
అన్నస్యసత్రం పునర ప్యగారం
ఛాత్రాభిరక్షార్థ మమోఘ మస్తు॥ ౩

శ్లో॥ ద్విభాష్యవంశరత్నస్య వేంకటేశ్వరధీమతః।
తత్పుత్రరత్నసూర్యస్య మహౌదార్య క్రమం స్తుమః॥ ౪

వింజరము, 7-11-45. మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి.

శ్రీ రామ.

శ్లో॥ అబ్దేపార్థివనామకేఽమృతభుజానందేందు క్రీస్త్వబ్దకే
మాసే కార్తికికే బుధాధిపదినే శుభ్రద్వితీయా యుతే।
ద్వైభాష్యాన్వయ వేంకటేశ్వరబుధై స్సద్ధర్మబద్ధస్పృహైః
సమ్యక్ స్థాపిత వేదశాస్త్రపరిష జ్జేజీయతాం శాశ్వతమ్॥

ఇట్లు,
పాలంకి గంగాధరశాస్త్రి.

## అంజలి.

మ. సరసాగ్రేసర! వేంకటేశ్వర! మహాసంతోషమాయెన్ భవ
త్పరమోత్కృష్టతరోద్యమమ్మునకుఁ దత్సంతోషము న్దెల్ప నే
తెరువున్ దోఁచక మిన్నకుండుటకుఁ దృప్తింగాన కీలాగునన్
బరుకంజొచ్చితినాల్గుపద్యములు రత్నాలో! లతాంతమ్ములో!

చ. సిరి గలవార నేకులని చెప్పుట విందుము-వింట కాదు కొం
దఱుఁబరికించినాము ధనధాన్యసమృద్ధిగఁ దూఁగుచుంటయే
పర మని యెంచి వర్తిలెడువార లె కాని తలంచిచూడ నీ
కరణి నుదారతాగరిమ గల్గినవాఁ డొకరుండు లేఁడుగా.

సీ. నెలకొల్పినాఁడ వాప్తుల కుపాధినిజూపి
ఆదర్శవైద్య శాఖాలయములు
కట్టించినాఁడ వాకల్పసుస్థాయిగా
దివ్యధన్వంతరి దేవళంబు
కృతి నందినావు శాశ్వతకీర్తి దనరార
సరసకుముద్వతీ పరిణయమ్ము
స్థాపించినాఁడ విచ్చటఁ బండితులు మెచ్చఁ
బెఱువేదసంస్కృత పాఠశాల

గీ. నీమహౌదార్యగరిమ వర్ణింపఁదరమె
ఆంధ్రదేశానఁ గాదు దేశాంతరములు
గడచిపోయిన దయ్య! నిష్కంటకముగ
భవ్యభవదీయకీర్తి దివ్యస్రవంతి.

సీ. నిరతాన్న దానతత్పరుఁ డుదారుఁడు విశ్వ
విఖ్యాతిచే మించె పేరుశాస్త్రి
రమణీయకవితా విలాసనైపుణిఁ జూపి
విక్రమించెను చెళ్ళపిళ్ళసుకవి
అకలంక దేశభక్తికి నాలవాల మై
రాజిల్లె సత్యనారాయణుండు
వైద్యవిద్యాప్రభావమ్మున దశదిశల్
మ్రోగిపోతివి మహాత్యాగి వీవు
గీ. తలఁప మీర్లెల్ల రామద్రవిడశాఖ
పూచికాచిన సత్ఫలమ్ములు గదయ్య!
మీమహోత్కృష్టయశమున మేటితనము
శాఖయే కాదు భారతజాతి గాంచు.
సీ. తతశబ్దశాస్త్రాధిగత పాండితీధుర్య
విప్రవర్యప్రభావిఁ సితఁబు
మంజులకవితాసమాన విద్వత్క వి
శేఖరామలయశ శ్రీయుతంబు
మధుర మోహనగాన మహిమాతివిఖ్యాత
గాయకోత్తంసప్రకాశితంబు
లలితచిత్రకళావిలాసిత చిత్రకా
రశిరోమణిఖ్యాతి రంజితంబు
గీ. పింజరపురంబు పండితకుంజరంబు
భాసురయశోభరం బిందుఁ బారశాల
కల్పిత మ్మాట మేల్మి బంగారమునకుఁ
బద్మరాగమ్ముతోడి సంపర్కలబ్ధి

సీ. నడిపించెఁ గొన్నేండ్లు నానాటఁ బండితుల్
వెలసి పేర్గాంచంగ పేరుశర్మ
నిలబెట్టెఁ గొన్నేండ్లు కలవారిసాహాయ్య
మొనసి సోదరుఁడు కామేశ్వరుండు
జరిపిరి కొన్నేండ్లు సంఘమ్ముగాఁ జేరి
యింజరపురవాసు లెల్లఁ బిదప
కొంతకాలము మాత్రగానియె నాపై "నాంధ్ర
యువజనమండలీ" యువకులరసి

గీ. తిరిగి నెలకొల్పి రెల్లరుఁ దఱపుగొన్న
పాఠశాలను గాని శాశ్వతము గాఁగఁ
జేయలే దెవ్వ రీనాఁటి కాయెనట్లు
వర్ధిలున్ గాక యీానవ్యపాఠశాల.

చక్రవర్తుల వెంకటశాస్త్రి.

### ఉపహారము.

ఉ॥ పూతసుధామయంబు గద పూనినభాండముతన్మహాత్వపుం
జాతురిలోకమందు వెదఁజల్లుతలంపున నాయురాగమం
బాతతలీల సజ్జనుల కందఁగ జేసిన యబ్ధినందనుం
డేతటి నీదుపజ్జ నివసింప సుఖంపుము వేంకటేశ్వరా!

శా॥ శ్రీమంతమ్ము త్వదీయనామము యశశ్శ్రీరాజితంబౌచునా
రామద్రావిడశాఖకెల్లను శిరోరత్నమ్ముగా నొప్పి యు
ద్దామప్రక్రియ నాక్రమించినది యీాధాత్రీతలంబెల్ల ను
శ్రీమాన్యుండవు వేంకటేశ్వర! ప్రశంసింతున్భవన్నామమున్॥

మ. కలికాలంబున వేంకటేశ్వరుని సద్గానంబె మోక్షంబుగాఁ
బలుకం జొత్తురు సద్బుధాగ్రణులు తద్భవ్యోక్తి నిన్ గూర్చియే
వెలయన్ వచ్చును దేవళంబులు మహావిద్యాలయ స్థాపనం
బులు సేయన్జను పుణ్యవంతుఁడు జగత్పూజ్యుండుగాఁ జెల్లఁడే

సీ॥ పుట్టినాఁడవు గదా భువనప్రసిద్ధమౌ
సద్ద్విభాష్యాన్వయసాగరమునఁ
బ్రబలినాఁడవు గదా భైషజ్యనిపుణతా
పారీణుఁడను పరిపాటి దనర
మించినాఁడవు గదా మేటిసంపదలచే
ధనదునిఁ గూడ నధఃకరించి
కల్పించితివి గదా ఘనయశఃప్రసమతా
సప్తసంతానముల్ శాశ్వతముగ

గీ॥ స్థిరతరంబుగ మాదువింజరపురమునఁ
ఛాత్రశాలను నిర్మించి ప్రతిభమీఱ
వేదశాస్త్రప్రదానంబు వేడ్కఁ సలిపి
రూఢికెక్కిన దానకర్ణుఁడవు నీవు॥

చ. వితతయశుండవై ధనము వేలకువేలు గడించి మించి సం
తతమును యాచకావళికి దానమొసంగుచు దైవభక్తి సం
గతముగఁ గాలముం గడుపఁగల్గిన నిన్ను నుతింపఁజెల్లునో
వితరణశాలి ! నీకలిమి వృద్ధికిఁగారణ మద్దియే కదా !

మ. కలవారెందఱు కల్గరీజగతి నే కార్యంబునుం గాని నీ
వలెఁ గావించి యశఃప్రకాశమున శోభన్ జెందఁగాఁజాలిరే

తలఁపన్ శారదరాత్రివెన్నెలల దిద్దం జాలు నీకీర్తి కాం
తులు సల్దిక్కులఁ బ్రాఁకిపోయినవి యెంతో దీప్తిమంతంబులై

మ. అలదిగ్దంతులవంటి పండితులు చేయం జెల్లు కావ్యార్థ గా
థల నుయ్యాలలనూఁగఁగాఁదలఁచి యాధన్వంతరీట్ సత్కథా
విలసత్కావ్యము మద్గురుప్రవరుచేఁ బ్రీతిన్ గృతిన్ బొందఁగాఁ
దలకొన్నాఁడవు సుస్థిరంబగు భవత్ప్రఖ్యాతి వైద్యాగ్రణీ!

శా. భావంబందునఁ ద్యాగతత్పరుఁడవై బంధుప్రజన్ బేర్మిమై
కావంజూచుచు ధర్మమార్గమున సత్కార్యంబులం జేయుచున్
నీవేరీతి మెలంగెదో యటులనే నీపుత్రరత్నంబు "నా
త్మావైపుత్ర"యటన్న సూక్తి కిరవై తానొప్పు సచ్ఛీలుఁడై.

మ. ఘనకార్యంబుల నెన్నియో యిటులనే కావింపుచున్ దేశమె
ల్లను సత్కీర్తికిఁ దానకంబగుచు నుల్లాసంబు దీపింపగా
ననయంబున్ ధనధాన్యసంపదలతో నాచంద్రతారార్కమున్
దనరం జెల్లుము వేంకటేశ్వర! లసద్ధన్వంతరీట్సత్కృపన్.

7—11—45. కాశరపర్తి వెంకటరావు.



ఓమ్

శ్రీమద్ధన్వంతరయేనమః

# శ్రీ ద్విభాష్యం వెంకటేశ్వర్లుగారి జీవితచరిత్రము.

## పండ్రెండవ ప్రకరణము.

(శ్రీధన్వంతరిచరిత్ర కృతిస్వీకారము-కవీంద్ర సన్మానములు, శ్రీధన్వంతరి శతకావిష్కరణము.)

సృష్ట్యాదినుండి యెందఱో ఉత్తములు భూలోకమున జన్మించి, జీవించి తమపేరుప్రతిష్ఠల నిలిపి యశఃకాయులగు చున్నారు. ఒకవ్యక్తి యీలోకమునువీడినను, ఆతనికీర్తి యా పురుషుని నమరజీవిగాఁ జేయును. కీర్తియున్నంతవరకా పురుషుఁడు జీవించియేయుండును. కాఁత్రియాబాధ్యమగు కీర్తి గ్రంథమున్నంతవరకు నిలిచియేయుండును. భాషయున్నంత వరకు గ్రంథము శాశ్వతముగాఁ బ్రకాశించును. ప్రజలున్నం తవరకు భాష స్థిరరూపములో వెలయుచుండును. కాఁబట్టియే కృతిస్వీకృతి యత్యుత్తమమైనదిగాఁకృతులు తలంచుచుందురు. నన్నయాది కవీంద్రులంబట్టియే నేఁటికిని రాజరాజన రేంద్రా దులు యశఃకాయులై యమరులైనారు. వాల్మీకిమహర్షి లేనిచో రామచరిత మెక్కడ? కవిసత్తములు తామిహలోకముననిల్పు కృతులద్వారా తమకాలపువారిచరిత్రల నిల్పుచు, వారిని జీవింపఁజేసి తాము జీవించుచున్నారు. సప్తసంతానములలో కృతినిగూడఁ జేర్చెను శాస్త్రకారులు దూరదర్శులు, త్రికాల

జ్ఞులు. ఇట్టికృతిగ్రహణసంకల్ప మందరికి నుదయింపదు. ధనమున్నంతమాత్రమునఁ జాలదు. ఆపేరుదక్కెడు యోగ ముండవలయును. అమరజీవులగుట సామాన్యమా?

— ♦ శ్రీధన్వంతరి చరిత్రకృతిస్వీకృతి ♦ —

1942 సం॥ రమున నాదిదేవుఁడగు శ్రీధన్వంతరిస్వామికి నాలయముఁ గట్టించి వెంకటేశ్వర్లుగారు ప్రతిష్ఠామహోత్సవమును దిగ్విజయముగా సాగించిరి. ఆనాఁడే యాదేవదేవుని చరితమును వెలువరింపవలయునను బీజము హృదయక్షేత్రములోఁ బడినది. తద్బీజ మంకురించుటకువలయు పూర్వరంగము 1945 సం॥ రమునఁ గల్పింపఁబడి 1946 సం॥ రములోఁ బాఠకలోకమునెదుటఁ బెట్టఁబడినది. అనుగతమగు చరిత్ర గ్రంథమొందును లేకుండుటంజేసి గ్రంథరచనమునఁ బడిన శ్రమయనల్పము. ఋగ్వేద, శ్రీమద్భాగవత, హరివంశములు మూలాధారముగా నేఁటి శ్రీధన్వంతరి చరిత్రము ప్రాదుర్భవించినది. వ్యయనామసంవత్సర కార్తిక బహుళ త్రయోదశీ గురువాసరమున(21-11-1946) శ్రీధన్వంతరిజయన్తిమహోత్సవ శుభసమయంబునఁ గృతిస్వీకారము జరిగెను. కృతిస్వీకరణ సభకు "వైద్యరాజ" పాలంకి సూర్యనారాయణ కవిగారధ్యక్షులు. శ్రీనరసింహదేవర సత్యనారాయణగారు సభాప్రారంభకులు. మ. రా. శ్రీ బుద్ధవరపు మహాదేవుఁడు బి ఏ; బి. యల్ గారు, పండిత శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, బ్రహ్మశ్రీ అల్లంరాజు సోమకవిగారు, "శతావధాని" చెళ్లపిళ్ల దుర్గేశ్వరశాస్త్రిగారు, "వైద్యావధాని" కందుకూరి వెంకటసుబ్బరావుగారు మున్నగుకవులు, పండితులు పలువురుపన్యాసకులు.

కృతిస్వీకరణమైన వెంటనే వెంకటేశ్వర్లుగారు గ్రంథకర్తయగు "విద్వత్కవిశేఖర-వ్యాకరణాచార్య" ఓలేటి సూర్యనారాయణశాస్త్రిగారిని వేయినూటపదియాఱులు దుశ్శాలువలు నొసంగి సత్కరించిరి నాంటి సభనలంకరించిన పండితులను, కవులను సేలువలిచ్చి బహూకరించిరి. ఆసభాదృశ్యముగాంచిన సభ్యలోకము కృష్ణదేవరాయాది మహీదేవేంద్రుల కృతి స్వీకారసభలం జూచినట్లుగ భావించి యానందించునట్లు సభాముఖమున వెల్లడించిరి. పండితకవీంద్రులం బోషించు మహారాజులరుదైన యీకాలంబున వెంకటేశ్వర్లుగారిం బోలు మహోదార హృదయులగు వదాన్య శేఖరులుగాక దిక్కెవరు? అందువలన నేగదా యట్టివారిచరిత మాదర్శప్రాయమై యుదాహరణార్హమైనది, సభ దిగ్విజయముగ జరిగినది. "తర్క-వ్యాకరణకేసరి" "బంధకవితా పితామహ" శ్రీ చర్ల భాష్యకారశాస్త్రిగారు స్వయమై రాంజాలక సంస్కృతశ్లోకములతో సందేశమంపిరి. శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి మున్నగువారలు శుభసందేశము లందంజేసిరి. సభకరుదెంచిన కవులును, పండితులును పద్యోపదల నర్పించిరి. అందుం గొన్ని మాత్రమీ క్రింద ప్రకటింపంబడినవి.

—: సందేశములు :—

శ్లో॥ యోఽభూత్ క్షీరసముద్రమంథనవశాజ్జాతో మహీమండలే
యోఽభూద్వైష్ణవచిహ్నభాసురతమః పంచాయుధైరన్వితః
యోఽభూ ద్భూతలరోగవర్గతభిదాదంభోలిరూపాయిత
స్సోఽయం రక్షతు సర్వలోకనివహాం ధన్వంతరి స్సర్వదా॥

శ్లో॥ విఖ్యాతే వ్యయవత్సరే శుభతమే శ్రీచాంద్రమానే శుభే
మాసే కార్తికికే త్రయోదశదినే కృష్ణేతుపక్షే గురౌ
విఖ్యాతామిత్రవైభవాతిశయుతం ధన్వంతరేరుత్సవం
కృత్వాసర్వజనైః ప్రశంసితతమోఽభూద్వేంకటేశోభువి॥

శ్లో॥ శ్రీమత్తిర్పతివేంకటేశ్వరకవీట్పంచాస్యవిశ్రాణిత
శ్రీవిద్వత్కవిశేఖరేతి బిరుదప్రఖ్యాత విద్వత్కవిః
తర్కవ్యాకరణాదిశాస్త్రమహితప్రజ్ఞానమున్మేషవాన్
జీయాద్దోలెటివంశమౌక్తికమణి శ్రీసూర్యనారాయణః

శ్లో॥ మంగళం సర్వపూజ్యాయ ధన్వంతరిమహాత్మనే।
వేంకటేశాలయస్థాయ భాష్యకారస్తుతాయచ॥

కాకరపఱ్ఱు, 21–11–1946. } చర్ల భాష్యకారశాస్త్రి.

'పల్లిపాలెము'నుండి : కార్తిక బహుళదశమి.

ఆయుర్వేదశ్రీ ద్విభాష్యం వేంకటేశ్వర్లుగారి సన్నిధిని
బహునమస్కృతిపూర్వక విజ్ఞప్తి.

వాత్సల్యముతో పంపినజయంత్యాహ్వానము చేరి ఆనందమైనది. ఆనందములో ఆనందము కృతిగ్రహణోత్సవ మొకటి. కృతికర్తలు శ్రీసూర్యనారాయణశాస్త్రిగారు నాకు గురుస్థానము. కృతిపతులు మీరు పితామహస్థానము సభాధ్యక్ష్యము వహించువారు ఆయుర్వేదులు, అందఱకుఁ గావలసినవారు–కవులును.

ఇట్టి మహాసన్నివేశము కారణాంతరములచే నేను భావనాచక్షువులతోడనే చూడవలసివచ్చినది. శ్రీ సూర్య నారాయణశాస్త్రిగారికి, సూర్యనారాయణకవిగారికి నాఅభి వాదములు. తమరు * కవిరాజ పోషకులు. ఆరామ ద్రావిడ శాఖకు మీ జీవితము బంగారు మెఱుగు.

చిత్తగింపుఁడు

21—11—1946. వందనములు స్వీకరింపుఁడు

మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి.

* వైద్యులు [వంగము]

సీ॥ కట్టించెఁ దనయూరఁ గడుభక్తి దేవుని
కల్ల ధన్వంతరి కాలయంబు
మెట్టించెఁ దనకీర్తి మేదినీస్థలిని స
ర్వత్రి దిక్సౌధసోపానసరణి
పట్టించె దృఢదీక్ష ప్రవిమలాయుర్వేద
విద్యావిధానవివేకమందు
పుట్టించె నారోగ్యమును మహౌషధముల
నిర్మించి తనుధారినికరమునకు

గీ॥ వైద్యరాడ్బిరుదాంక ద్విభాష్యవంశ్య
వేంకటేశ్వరబుధుఁడు భావింప నేఁడు
కృతిగొనుట యుబ్బురంబె సత్కృతివిదుంకు
వీరి కిడుగాత శుభములు విశ్వభర్త.

క॥ కృతిగొనుట కేవలము శా
శ్వతకీర్తికి మూలమందుఁ జాలకథలికిన్

సుతుడౌ ధన్వంతరిసుచ
రితమున్ కృతిగొంట యెన్నిరెట్టుఘనమో.

తే॥ గీ॥ ఉన్నయవి యాలయంబు లీయుర్వియందు
హరిహరుల కెల్లచోటులు ననుపమాన
ములుగ ధన్వంతరికి నట్లు పొసఁగవయ్యె
నకట యతఁ దీర్చె వేంకటేశాఖ్యబుధుఁడు.

శా॥ ఈధన్వంతరియే తదాలయమునం దింకెప్పుడున్ రాఁగభో
గాధిక్యంబువహించి యెల్లరకు దేహారోగ్యముం గూర్చి నా
నాధర్మక్రియలందు సంతసము పూనంగాఁ బ్రతిష్ఠాతనున్
బోధోత్పాదకుఁడై విరాజిలుత సంపూర్ణప్రభావోన్నతిన్.

క॥ కృతికర్తయుఁ గృతిభర్తయు
కృతులై కృత్యవిదులగుట కేవలమణిభూ
షితశాతకుంభవలయాం
చితరీతి దనర్చి రిది విచిత్రముగాదే. ౫

చేబ్రోలు,
పిఠాపురం డివిజన్
21—11—46.

ఇట్లు,
అల్లమరాజు సోమకవి.

శ్రీరస్తు.

శ్లో॥ శ్రీక్షీరాబ్ధి సముద్భూతం శంఖచక్రగదాధరమ్
పుష్పమాలాధరం దేవ మహం ధన్వంతరిం భజే॥ ౧

శ్లో॥ ఓలేటివంశజాతేన సూర్యాఖ్యకవినా కృతాం
ధన్వంతరిచరిత్రాఖ్యాం కృతికన్యాం సుధీనుతాం॥ ౨

శ్లో॥ ద్విభాషివంశసంజాతం వేంకటేశ్వరధీమతం
వరం వైద్యవిదాంశ్రేష్ఠం శ్రీరామస్సర్వదావతు॥ 3

శ్లో॥ పాలంకివంశాబ్ధిసుధామయూఖమ్
శ్రీసూర్యనారాయణనామధేయమ్
సభాధిపం వైద్యవిదాం వరేణ్యమ్
శ్రీరామచంద్రస్సతతంచ పాయాత్॥ ౪

శ్లో॥ ఓలేటివంశాంబుధి పూర్ణచంద్రం
శ్రీసూర్యనారాయణ నామధేయం
విద్వత్కవిం శాస్త్రవిదగ్రగణ్యం
శ్రీరామచంద్రస్సతతంచ పాయాత్॥ ౫

కాకరపర్రు,
21-11-46

ఇట్లు,
ఆణివిళ్ళ చినవేంకటశాస్త్రి.

## పద్యరత్నములు.

శా॥ శ్రీవిశ్వేశుఁడు వేంకటేశుఁడు జగత్సేవ్యుండు ధన్వంతరీ
దేవుండున్ సతతంబు దివ్యకరుణాదృక్కుల్ ప్రసారించి స,
ద్భావుండైనద్విభాష్య వేంకటసముద్యన్నాముఁదద్వంశమున్
శ్రీవిద్యామహిమోన్నతుల్ వెలయఁ బ్రేమన్ బ్రోచు నెల్లప్పుడున్

ఉ॥ ఏతపమాచరించి జనియించినవాఁడొకో? వేంకటేశుఁడా
సేతుహిమాచలాంతరప్రసిద్ధపురంబులఁ దన్మహౌషధ
వ్రాత మశేషరోగవినివారక మైవిలసిల్లలోకవి
ఖ్యాతి గడించె నీవిబుధగణ్యుఁడు వైద్యవిరాట్ప్రసిద్ధుఁడై॥ ౨

చ॥ విలువగలట్టిమందులను వేలకువేలుతయారుచేయఁగాఁ
గలిగినవారువీరొకరెగాక ధరాస్థలినెంచిచూడఁగాఁ
గలరెమఱెవ్వరున్ వినుతిగాంచినయౌషధముల్ మఱొక్కెడన్
వెదకి లభించినన్ మనసుపెట్టరువానిపయిన్ గదాతురల్॥ 3

సీ॥ అలరించె నీద్విభాషావ్యయాకలశాబ్ధి
రాకాసుధాంశుఁడై రహిఁజెలంగి
ప్రభవించెనన్నపూర్ణా వెంకయార్యుల
పరిపూర్ణసత్తపఃఫలమనంగ
రాణించెఁ గకుబంతరములందుఁ దనయశో
రాజిదిగ్భిత్తికల్ రాచికొనఁగఁ
బోషించెనాదరస్ఫూర్తి బంధుగణంబు
బలితంపు వైద్యసంస్థలనొసంగి

గీ॥ ప్రీతినెలకొల్పె ధన్వంతరీమహేశ్వ
రాలయమ్ములు వేంకటేశాలయమ్ము
స్థిరతరమ్ముగ వసతులేర్పఱచి వేంక
టేశ్వరుఁడు వంశమెల్లఁ దరింపఁజేసె॥ ౪

చ॥ బలితపు వేదశాస్త్రపరిపాలనదీక్ష వహించితజ్జ్ఞుఁడై
విలువగ్రహించియిచ్చెఁ బదివేలనువింజరపత్త్రనంబునన్
గలయులపాఠశాలకుఁజిరంబుగ వర్ధిలవేంకటేశ్వరుం
డలఘుఁడు వీనిఁబోలఁగల యట్టివదాన్యులుగానరారిలన్॥

గీ॥ ప్రథితుఁడోలేటి వంశదీపకుఁడు ప్రాజ్ఞుఁ
డాంధ్రగీర్వాణ మహితవిద్యాప్రభావి

రాజమానుఁడు సూర్యనారాయణుండు
కృతికరుండౌట పతిసమున్నతికిఁగాదె ? ॥

శా॥ స్ఫారప్రస్ఫుటవాక్సుధార సపరివ్యాప్తంబు ధన్వంతరీ
చారిత్రంబురచించి క్షేమజకళాసంపూజ్యునిన్ భర్తగా
నారూఢిన్ సమకూర్చిమించె భళివహ్వాసూర్యనారాయణో
దారుండీశఁడుసంస్కృతాంధ్రకవితాదక్షుండుసామాన్యుఁడే?

చ॥ సుగుణగరిష్ఠులై యెసఁగు సోదరులుత్తమభక్తిచూపస
త్వగుణగణాఢ్యసాధ్విసహధర్మిణి సేవయొనర్పధీవరుం
డగుకొమరుండుఁ గోడలుతదాత్మజులెంతయుఁబ్రీతిగూర్పఁగా
నెగడుచు వేంకటేశ్వరుఁడ సీద్భుపుఁడై విలసిల్లుఁగావుతన్ ॥చ

సీ॥ ఆలయప్రతిష్ఠ యారామవిస్ఫూర్తి
తనయకృతి తటాకధనవిభూతు
లెనయఁ దేజరిల్లితిఁ కసగ్రహారంబు
నొసఁగుటొకటి మిగిలెనోధనాఢ్య॥ ౼

ఇట్లు,
21 — 11 — 46. శ్రేయోభిలాషి,
పాలంకి సూర్యనారాయణకవి.

---

'ధన్వంతరి' గ్రంధకృతిప్రశంస

ఉ. వ్రాసినవాడు బావ-కృతిపత్యభిధానుఁడు బాబు-గ్రంథమా
యాసకలప్రపంచమున కేడ్గడయై యొకనాటి వారణా
సీసకలప్రజాసుఖవిశేషము గోరిన వైద్యరాజగా
థాసకలమ్ము; ఎందుకుముదంపడదో హృదయమ్ము చెప్పఁడీ?

చ. ఇదికృతికన్య బావకుజనించిన, దందున మేనమామనై
పొదలితినేను-బాధ్యతయుఁ బూర్తిగనున్నదినాకుఁ బెండ్లిలో
మదవతిగాన కన్నె యిసుమంతయు దీని గుఱించిచెప్పగా
దదు-వచియించినన్ దమ యెడందలహర్షముజూపరెవ్వరున్

ఆ. వె. వంటవాడు-కవియు-పాటకుం డొక్కండు
ఆడుబిడ్డగన్న యతఁడు నొకఁడు
ఆత్మసృష్టి గుఱిచి అత్యద్భుతంబుగా
గొప్పచెప్పుకొనుట కూడ దెవుడు.

మ. వరుఁడే తానయికోరుకొన్నయపుడీప్రశ్నల్ సమాధానముల్
సరసాకారపురస్సరంబు లని యెంచన్ బోను గానీ! కవి
త్వరమావైభవసంయుతుం డయిన చెల్వాపిళ్ళశిష్యోత్తముల్
విరచింపన్ దొరకున్న యేకృతియుకన్యాందంచు వాఱిచ్చెదన్

శా. బావా! కట్నము నేమొసంగుటకు నేర్పా టీవుగావించినా
వో? విన్నవింపనెలేదుమాకుకతమేమో? యేమిటయ్యాయివే
నావస్తుల్ మనపిల్లకుంచినవి? కన్యాదానకాలంబునం
దీవేమమ్మ పసందుగాఁగనగరా దేమందు నీమాటకున్.

సీ. ఆశీర్వదింతునంచందువా? నీకన్న
వయసులోపల బెద్దవా డితండు
ధనమిత్తు నందువా? ధనములోనవనిధుల్
గలకుబేరున కన్నగారితండు
భూమి యిచ్చెదనందువో? వందలెకరాల
మాగాణిభూమిఖామం దితండు
ఇల్లటికం బేర్పరింతునం చందువో?
యీనాడు నిన్ను బోషించు నితఁడు

గీ. దిగ్దిగంతంబు లెల్లఁగీర్తింప గల్గు
పేరు దెప్పింతునని ప్రగల్భింతు వేమొ ?
భవ్యధన్వంతరిదయాప్రభావపరత
తరిగిపోనిపే రొందెనీవలనెకె యితడు?

ఆ. వె. ఇంకనేమిరోయొసఁగి యీాయఱువదియేండ్ల
బాలవరుని మెప్పఁ బడయఁగలవొ?
కట్నహీనమైన కల్యాణ మన్ననో?
వులువులేనిచారు పొలుపుఁగాంచు॥

ఆ. వె. ధనముకోఱకు నమ్ముకొనిరన్న యపవాదు
మనకు నెపుడు వంశమునను లేదు
అందుకనియె ముందుఅచ్చుకాకున్నను
కొమిరె పెండ్లి కొప్పుకొంటివొక్కొ?

ఉ ఆయన కీవొసంగుదువొ? ఆయనవద్దనె పుచ్చుకొందువో?
మాయురె! మేమెఱుంగముసుమా? హృదయంబుల మీరు మీరు ప్రా
ధేయవిధేయభావముల తెంపరులైఅనుకొన్నమాట లే
మైయలరారునో? వినుదమన్నకుతూహల మిట్లుబల్కెడిఁన్.

తే॥ గీ॥ ఏమహా దేవుఁ డీతని నింతగొప్ప
వానిగావించి వేలుపై వఱలినాడొ ?
అతనిచరితమ్ము వ్రాసి యంకితమిడితివి
యితని కింతకెక్కుడుకట్న మేమివలయు ?

## —♦ అ ప్ప గిం త ♦—

ఉ॥ అర్థములేనిమాట మరియాదకు బల్కినబల్కవచ్చు భూ
తార్థముఁ జెప్పపట్లచరితార్థము గాదది భాషలోన న
న్వర్థకమైనదయ్యును విహారము దేశమునం దొనర్చి సం
వర్థితవాక్కులన్ బలుకుబాలిక గాదిది వేంకటేశ్వరా!

ఉ॥ కాతరమేల ? శంఖినియుగా దిదిచిత్తినిగాదు- పద్మినీ
జాతినిమీరిపోఁగలుగు జాతి యొకండెదియేని సర్వభూ
మీతలమందు నెష్డయిన మేకొని పెంపువహించు నేని త
న్మాతకునుద్దియాసతిసుమా! కృతికన్యక వేంకటేశ్వరా!

మ॥ బహుభార్యాత్వనిషేధచట్టమొక దుత్పన్నంబుకానుండెత
త్సహవాసంబునకుబ్బుచున్నయది దేశంబున్, ప్రభుత్వంబుత
ద్విహితంబౌనటులుండె, గానత్వరనాదేశించి యాచట్టమీ
మహిఁగాల్వెట్టకమున్నకన్నియనుసమ్మానింపుమార్యాగ్రణీ

శా॥ నీకీర్తిన్ ద్విగుణీకృతంబొనరుచున్ నిక్కమ్ము మాబిడ్డము
న్నేకాలంబునఁ బెండ్లియాడుసతులేనీ! కూర్పగాఁబోని ఆ
త్మాకాంతున్ బరితృప్తిమై నెఱపునేనైగొవ్వగాఁ జెప్పనే
లా! కన్గో వెయిటన్ మదీయరచనావ్యాహారయాథార్థ్యమున్

ఆ॥ వె॥ అతిశయోక్తికొఱకు ననువదించుటలేము
మాకులంబుకవిత కేవలంబు
మనము మనముఁ గలసికొనుటచే కవిరాజ
కులము నేఁటికయ్యెఁ గుతలమందు.

సీ॥ ఒక్కొక్కపట్టులో నుపనిషద్గంధమ్ము
మెయిఁబూసి నిన్ను తన్మయు నొనర్చు
అటుమీఁదటఁ బురాణపటుతరానందమ్ము
ననుభవింపించు వీడ్యమునొసంగు
సూత్రకాలములోని సూక్తులుజెప్పుచు
కనరాక నీకుచుంబన మొసంగు
వైదికధర్మసంపదల పాల్పంపులో
ప్రీతిలేని రతులసంగతుల దేల్చు

గీ॥ అంతనజ్జాణ కృతికన్య అబలకాదు
మోక్షకాంతయై నీపాలిభోగకాంత
నాగరికతకు నీనాఁటినాతి యయ్యె
నిలువుపాపిడిముత్తైదువులకు రాణి!.

ఆ॥వె॥ అప్పగించినార మనుభవింపుఁడు మీరు
మిమ్ము వెంటనంటి మెలఁగువారు
సకలదిశలయందు జయగీతములు బాడ
హాయిసౌఖ్యముల నితోధికముగ॥

కడియం,
21–11–46.

చెళ్ళపిళ్ల దుర్గేశ్వరశాస్త్రి
విద్వాన్–శతావధాని

ఓమ్

ధన్వంతరయేనమః

# నక్షత్రమాల

ఉ॥ సంతత మాత్మసేవకయుసన్నిధి నాలయమందు నిల్పి య
త్యంతము భక్తితో సలుపునర్చకుఁ దృప్తివహించిచక్కనా
ద్యంతముదావహం బయినయాత్మచరిత్ర రచింపఁజేయుధ
న్వంతరిప్రోచు నెప్పుడు ద్విభాష్యకులాగ్రణి వేంకటేశ్వరున్

చం॥ తిరుపతినుండి భక్తులకుఁ దీర్థప్రసాదములిచ్చి పాపులన్
బరమపవిత్రులౌనటుల బాగొనరించి ధనమ్ముఁ గొందు నీ
వరుగుము చింతలూరునద్విభాష్యకులమ్మునఁ బుట్టిరోగులన్
గరుణనుస్వస్థులౌనటులఁ గాంచి యశమ్ముగణింపుమంచు దాఁ
జెరియొకరూపమై చెలఁగు శేషశయుందు జయించుఁ గావుతన్

చం॥ సరసిజ నేత్రలెందఱో పసందుగ సేవలొనర్చి వేంకటే
శ్వరునకు శ్రీకరుం డనుయశంబును సర్వజగత్కుటుంబియన్
పరమప్రసిద్ధియుం గలుగ వర్తిలుచుండుట నెంచి వేంకటే
శ్వరునకు లక్ష్మియొక్క తెభృశమ్మనిశమ్ముధనమ్ముఁ గూర్చున
త్తరుణముగాంచిమాదుసుత తానువరించెయశంబుఁ గూర్పఁగన్

ఉ॥ పూనికసత్తటాకనిధిపూర్వములై విలసిల్లుసప్తసం
తానములందు సత్కృతియనశ్వర ముత్తమ మందురు, నీవు న
న్వానికపారసంబున నపారధనంబు యశంబుఁ గాంచి త
ద్వానిచరిత్రసత్కృతిగ వ్రాయఁగఁ జేసిగ్రహించిమించితౌ
ఘానితసత్కృతజ్ఞులకు మార్గమిదేగద వేంకటేశ్వరా॥

ఉ॥ ఆదర మొప్పఁగాఁదలఁచి యార్యకృతుల్, పరికించికూర్చిఋ
గ్వేదమునాఁటి గాథలు, వివేకము మీఱ పురాణజాలసం
వాదము లెల్ల నారసి శుభాకృతి నీకృతికూర్పఁ జేసి నా
సోదరు ధన్యుఁ జేసితివి చొప్పడ నీవుఁ దరించి మించితో
నీడగుపంథ నూతన మనేకులు పాడినదయ్యెఁ బాడరే ?॥

ఉ॥ ఎంతయొ కొంత కొండఱు రచింపఁగ శక్యము కాదుగాని ధ
న్వంతరిసచ్చరిత్రమును వ్రాసి రటంచును విందు నైన నా
ద్యంతము లన్నవ్రాసినవిధంబున సర్వము వ్రాయనేరరం
చెం తిటు సత్కవిత్వము రచింపఁగఁ బొందితి యేరికబ్బెడిన్ ?

ఉ॥ ఎన్నఁగ నిన్ను బోలినకృతీశుఁడు కావ్యసతీమతల్లికిన్
వన్నెను గూర్చుదివ్యకథ భాగ్యవశంబున నబ్బెఁ గాన నీ
సన్నుతకావ్య మాంధ్రసుభిషక్కులకెల్లను మార్గదాయియై
యన్నను నిన్ను నీభువిఁ గృతార్థులఁ జేయుత సుస్థిరంబుగన్॥

ఉ॥ తాతలనాటిగాథలను ద్రవ్వి యపూర్వచరిత్రలోకవి
ఖ్యాతముచేసె నీకృతి, యఖండఫలప్రదమౌచు నిర్వరన్
పూతులఁ జేసె సత్కృతి, యపూర్వపురాకృతపుణ్యసత్ఫల
వ్రాతబలంబుగా కిటులువచ్చునె సద్యశమెన్న చేసినన్ ?॥

శా॥ హృద్యంబై సరసద్వివేకమిడు దాతృత్వంబునుఁ బొందియా
స్వాద్యస్వాదురసంబుకెక్కయయి యైశ్వర్యానుసంధాయియై
పద్యంబంచును గద్యమన్విధమునన్ భాసిల్లి పెంపెక్క స
ద్విద్యాదానముకన్న సత్ఫలము సంధింపంగ వేఱుండునే?॥

కం॥ అనిమదిలో నెంచుచు నీ
ననవరతము వేదసంస్కృతాధ్యయనపరా

యుణులగు ధాత్రిగణంబులఁ
దనుపఁగనిదె సమయమను చతంద్రితబుద్ధిన్
గీ॥ వేదసంస్కృతభాషాభివృద్ధికొఱకు
వేనవేలిచ్చి మాదగువింజరమున
పాఠశాలను నిల్పుటన్ వాణివలచి
కృతిగసాక్షాత్కరించె సుకృతివికాస ?॥
సీ॥ అగ్రిహారంబు నానగ్రిహారము వింజ
రగ్రామజనిత యీరమ్యవనిత
సుమనోమనోజ్ఞమై సుమనోమనోజ్ఞమా
రామదావిడ కులరామభామ
కవిగురుస్తుత్య మాకవిగురునిత్యమో
లేటిసద్వంశ్యయా మేటిబోఁటి
సత్పదరమ్యమై సత్పదరమ్యవి
ద్వత్కవిశేఖరు తనుజ యీమె
గీ॥ నూతనేతివృత్త పూతశబ్దాలంకృ
తిక్రియాకలాప దివ్యరూప
యీప్పితార్థదాయి యీకృతికన్యక
దిద్దికొనుటయెట్లొ తెలిసికొనుము॥
ఉ॥ ఒక్కొకచో సుధామధురసూక్తులనొప్పుచునొక్కచోట బల్
టెక్కులఁ చూపుఁగొన్నడనటింపుచు నొక్కొకచోటభావస
మ్యక్కరణంబులన్మదికిహాయిని గొల్పుచుఁ గావ్యకన్యతాఁ
జొక్కుచుఁజొక్కఁజేయుచువిచోద్యముగానినునోలలార్చెడిన్
ఉ॥ వింతలు హావభావములు, వేడ్కలు నింపులు సొంపునింపుచే
ష్టాంతరముల్ రహస్యములు హాసవిలాసవిభాసమానదృ

ష్టాంతములున్ రసోచితపదాంతరము ల్పచరించు కావ్య స
త్కాంత సుఖాబ్ధిఁ దేల్చినను గౌతుకమొప్పఁగఁ జేయు జా
చురన్ ॥

ఉ॥ ఓకమనీయసుందర మహోజ్జ్వలకావ్యకళావతీసతీ !
నీకర మూనియున్నవరునిన్ బరిణయాంచితగాఢగూఢహే
వాకము చే నొకప్పుడు, స్వభావసముద్భవభవ్యనవ్యబి
బ్బోకము చే నొకప్పుడునపూర్వసుఖాంబుధి నోలలార్చుమీ॥

గీ॥ కాంతిగుణరూపముల నలంకారశయ్య
లందు భర్తృవాల్లభ్యంబు నందితి వని
విట్టివీగక సద్గురువృద్ధజనుల
మెప్పు లొందఁగఁ దలఁచుట యొప్పునమ్మ॥

సీ॥ మెప్పించినావు నీ మేలైన భైషజ్య
పాండిత్యగరిమ సభాసదులను
స్థాపించినావు విస్తారశాఖల నాంధ్ర
దేశమెల్లెడల దేదీప్యముగను
ఆర్జించినావు లక్షాధికధన మొక్క
చేతిమీఁదుగనె విచిత్రముగను
నిర్మించినావు నిర్ణిద్రభక్తి సుధర్మఁ
బోలుధన్వంతరి యాలయంబు
వెచ్చించినావు వేవేలనూటపదార్లు
సత్కృతి నిర్మాణసత్క్రతులకు

గీ॥ వేవిధంబుల భోగదేవేంద్రుఁడవయి
సంతతానందడోలి కాభ్యంతరమున

నుండి దూఁగుచు సంతోష మొందుమయ్య!
అమలగుణధుర్య వేంకటేశార్యవర్య!॥

చ॥ పరనుతనన్నయాదికవినాథులనాఁటనుగోలె నీమహిన్
జరుగుకృతిప్రదానముల జాతియు శాఖయు భిన్నమాట యే
తర చిచటన్ననో కలిగె దాతృగృహీతల కందునైక్య మీ
వరుసను సత్కృతుల్ భవదుపజ్ఞములై ప్రభవించిమించవే?॥

ఉ॥ నాసహజాతుఁ బండితునవన్యకవీశ్వరు నీదుపారశా
లాసుత వాంఛసేయుట సలక్షణమయ్యది, నేఁడు నిన్నుఁ బే
రాసను నాదుసోదరునియాత్మజ భవ్యసుకావ్యకన్య సో
ల్లాసముగా వరించుట విలక్షణమేసుమి, యల్లు మామగాఁ
జేసియు మామనల్లుగఁ రచించెనుధాతకుఁ గ్రొత్త కాదుగా॥

శా॥ ఆయుర్దాయక మార్తగోగశమన వ్యాపారపారీణ మా
మ్నాయప్రఖ్యము దేవదత్తమునసంతంబాద్యమైయొప్పునా
యాయుర్వేదము నీకతంబున నసర్వారాధ్యమైమించె నీ
చాయ న్నీదునుతుండు దీనికిఁ బ్రతిష్ఠంగూర్చి వర్ధిల్లుతన్॥

ఉ॥ నీవలె సత్కృతు ల్వడసి నిర్మలకీర్తి గడించి మీచిరం
జీవియుఁ బండితాదరము చేఁదులతూఁగుతె వైద్యవృత్తి మీ
పావనవంశధర్మ మయి పాటిలుచుండుత లోకులెల్ల సం
జీవనసిద్ధితోడ శుభజీవితలబ్ధి సుఖింతు రిగావుతన్॥

ఉ॥ ఓయనఘాత్మ! సద్రసనముజ్జ్వల మాకృతియు న్నిరంతర
చ్ఛాయనుబోలుసత్సతియు జ్ఞానయుతుండు సుతుండు కోడలా
ప్యాయన మొప్ప సేవల ననంతముగాఁ బచరింపఁ ద్యాగివై
చేయుము హాయిమీఱ శుభజీవిత మిద్ధర నెల్లకాలమున్॥

ఉ॥ అస్థిరము స్వైనశ్వరము నైనధనమ్ము వ్యయమొనర్చియున్
సుస్థిర మైనసద్యశము చూఱలుగొంటివి పూజ్యపారశా
లాస్థితి దేవళంబు కృతిరాజము దానికిఁ జిహ్నమౌచు ధా
త్రీస్థలి నిల్చునంతకును దెల్పునుగాదె భవద్వదాన్యతన్॥

సీ॥ వేదంబులేసాటి సోదరస్థితికిని రామా
దులను త్రోసిరా జనవరె
పూరువొక్కఁడెసాటి పుత్రసంపదకును
భీష్ము నిచ్చటఁ దలపెట్టవలదు
ఆయరుంధతి సాటి జాయాత్వమునకును
సీతాసతిని సాటిసేయవలదు
సావిత్రియే సాటి సద్వధూగరిమను
భారతిపే రెత్తిపలుకవలదు

గీ॥ కలయికను పితృభక్తి నక్కజముగొల్పు
వరసతీత్వాన భర్తృసేవలను సతము
ఘలుకుచుండుట నీకె చేకూరియుండెఁ
బొదలునే యిట్టిపుణ్య సంపద లొరులకు?॥

మ॥ కరవా వైద్యులకాంధ్రదేశమునఁ బెక్కండ్రిందురీ వేంకటే
శ్వరునింబోలఁగలారె పాండితిని భైషజ్యంబునన్ దాతృతన్
సరి లేనట్టియశంబున న్నరసతన్ సద్వైద్యు లీరీతి ని
ద్ధర చారిత్రవెలార్చిభక్తిఁ గనిరే ధన్వంతరిన్ జూపిరే॥

గీ॥ కంఠమాలికఁ బోలునీకమ్రమధుర
పద్యనక్షత్రమాల నర్పణ మొనర్తు
దీని నరణమ్ముగాఁ గొని తృప్తినొంది
మురియుచుండఁగదయ్య సంబరముతీఱ॥

శ్లో॥ ధన్వంతరి ర్జయతు విశ్వజనామయఘ్న
ఆర్తార్ధ ముద్ధృతసుధాగదశంఖచక్రః।
యన్నామకీర్తనత ఏవహరన్తి రోగా
లోకా భవన్తి సుఖినో పరిపూంత దేహాః॥

సాహిత్యవిద్యాప్రవీణ, ఉభయభాషాప్రవీణ
వోలేటి వెంకటసుబ్బరాయశాస్త్రి.

సీ॥ పెటుకుమాటలతోడ విసిగింపఁగాఁబోదు
మృదుమధురముగ భాషించుఁగాని
దోషాల కెందుసందును దోఁపఁగానీదు
సుగుణాలరాశియై నెగడుఁగాని
విరసమ్ముగాఁబల్కి పెడమొగమ్మిడఁబోదు
సరసమ్ముగాఁ బల్కు సాగుఁగాని
పూర్వమర్యాదలంబోకార్పఁగాఁబోదు
క్రొత్తగాఁ గొన్ని చేకూర్చుఁగాని

గీ॥ భారతముచూచినది భాగవతముఁజదివి
లలితగాధలనెన్నియో తెలిసికొన్న
దారి తేరిన నెఱజాణ యనఁగవచ్చు
దివ్యచరితాలవాల యీకావ్యబాల.

చ॥ వరుసకునాకుసోదరి శుభప్రదయీకృతిబాల రెక్కటం
బెరిగినవార మిర్వురము పేరును బెంపునుగన్న వేంకటే
శ్వరునియుదారభావములవర్ణన సేయఁ జువచ్చినేఁటికిం
బరిణయ భాగ్యముంబడయఁబాల్పడ నెల్లరుప్రస్తుతింపఁగన్

శా. అమ్మా! కావ్యసరస్వతీ! సుకృతివమ్మా నీవు నీలోనిభా
వమ్ముల్ పువ్వులుపూయసాగినవిగా ప్రాణేశ్వరుండన్న శ
బ్దమ్మున్ సార్థముఁజేయు భర్తఁగనితద్ధన్వంతరిప్రేమపా
త్రిస్త్రీరత్నమొప్పితినీమహత్త్వమది యేన్నాన్మాత్రిమేచూడఁగన్

చ. సిరిగలనాథుఁ డబ్బెనని చీటికిమాటికిఁ బొంగిపోవుచున్
మఱువఁగఁ బోకుమమ్మ మనమాట సుఖమ్ముగఁ బవ్వళించి ని
న్నరయుచుఁ జేర్చినీదుమధురోక్తుల సొక్కుచుసోలువేళ మే
నరికము గూర్చి సుంతశ్రవణమ్మున వేయుమి కావ్యసోదరీ!

గీ. కావ్యకన్యలు పరిణయక్రమమువడయు
ధర్మమున్నది మనభారతమ్మునందు
ఆసనాతనధర్మమ్ము ననుసరించి
వేంకటేశ్వర! యిదియుఁ గావింపఁబడియె.

శా. సాలంకారను గావ్యబాల నిటు నీహస్తాలలోఁ బెట్టినా
మాలోచించి తదర్హగౌరవము లీయంజూడు మేఁ జెప్పఁగా
నేలా? కోరివరించినాఁడ వదనీకే తెల్లమా కాకయున్
నీలోనీవె యెఱుంగఁగావలయుఁగానీ మేముప్రార్థిత్తుమా!

చ. నిరుపమాతిస్థలమ్మ? రమణీప్రియమూతిక తెచ్చి యిచ్చుక
ప్వరవిసెమా? యెటుల్ రచనముం బొనరించితివో కదయ్యసుం
దరతరగద్యపద్యకలనా మధురమ్ము కావ్యరాజమో
గురువర! నీమహాత్త్వమునకుంబచరించెద వేనవేల్ నతుల్

మ. సుకుమారుండుయశోవిభూషితుఁడుసంశుద్ధాంతరంగుండువై
ద్యకళాపారగుఁ డాత్మవైభవుఁ డనంతత్యాగశీలుండు మా

మక కావ్యానుజవల్లభుండు శుభసంపన్నుండు మాబావగా
రికి నీనూతన పద్యహారము సమర్పింతున్ వినోదమ్ముగాన్

శ్రీ ధన్వంతరిచరిత్ర
కృతిసమర్పణసమయము.

చక్రవర్తుల వెంకటశాస్త్రి

# ప ద్యో ప ద

ఉ. శ్రీకరసద్ద్విభావ్యకుల సింధుసుధాకర! వేంకటేశ! శో
భాకలితుండవై సుగుణవంతుఁడవై తగువైభవమ్ముతో
వాకునకందరాని ధనవంతుఁడవౌటకుసత్ఫలమ్ముగాఁ
జేకొనినాఁడ వీకృతి వచింపఁదరంబె భవద్యశం బికన్.

సీ. నన్నయభారతామ్నాయమ్ము చేఁగదా
రాజరాజెనసె నిర్మలయశమ్ము
తిక్కనయజ్వసత్కృతి వశమ్మునఁగదా
మనుమసిద్ధియుఁ గీర్తిమహితుఁడయ్యె
శ్రీనాథకవికృతి స్వీకారమునఁగదా
యనవేమరెడ్డి సద్యశముఁ గాంచెఁ
బెద్దనార్యుని కృతుల్ పేర్మిఁ గైకొనికదా
కృష్ణరాయలు సత్కీర్తివడసె

గీ. సప్తసంతానములలోఁ బ్రశస్తిగన్న
కృతికతమ్మున నొడలో కీర్తిగాంచి
రిపుడు కృతిఁబొందు ధన్వంతరిచ్చరిత్ర
విమలతరకీర్తి నీకిచ్చు వేంకటేశ!

చ. సురుచిరసత్కథాకథనశోభితమై వరభూషణావళుల్
మెఱయఁగఁ బండితోత్తములు మేలనురూపవిలాసలొప్పమ
ద్గురువరు కావ్యకన్యకను గోరికమీఱ వరించినావు కా
పురమొనరింపవచ్చినది పొత్తుగ నేలి యశమ్ముఁ గాంచుమా!

మ. విమలీభూతసుధాబ్ధిరాట్సుతమహావిఖ్యాతచారిత్రమున్
దమిమీఱన్ కృతినొందఁగాఁ గలుగుసద్భాగ్యంబునీకబ్బుటన్
గమనీయంబగు నీయశమ్మునకు బంగార్వన్నెచేకూరిన
ట్లమరెన్ధన్యుఁడవైతివెంతయుద్విభాష్యా వేంకటేశాహ్వయా

ఉ. శ్రీయుతమూర్తివై సుగుణశీలుఁడవై భవదీయపుణ్యముల్
పూయ ఫలించెనాఁగఁ గులభూషణుఁడై యలరారుసూర్యనా
రాయణుఁ డాయురాగమధురంధరులై నినుఁబోలుపుత్రులన్
హాయిగఁ గాంచివంశమునకంతయు వన్నెగడించుఁగావుతన్.

ఇట్లు,
కాకరపర్తి వెంకటరావు.

శా. శ్రీమద్విష్ణువరాంశజుండు ధరణీశ్రేయఃప్రదానక్రియో
ద్దాముం డాదిభిషగ్వరేణ్యమణి భక్తప్రీతిసంధాత యా
త్మామూల్యోత్తమసత్కథాంకకృతికన్యాస్వీకృతిం జేసియీ
భూమిస్తుత్యుని వేంకటేశ్వరుసుఖాత్ముం జేయుఁ దానింతకున్

చ. జగములఁగావఁబుట్టినది సత్తమమాయురుదాత్తవేదమూ
నిగమము మూలమైన మహనీయుఁడవాదిభిషగ్వతారమై
నెగడిన పద్మలోచనుఁడు నిర్మలతాపరిపూతతాగుణ
స్థగితము తచ్చరిత్రము సుధారసకల్పముగాదె యేరికిన్.

కం. కృతి పుణ్యశ్లోకున కం
కితమిడ భవతారకంబు కీర్తిద మని ధీ
యుతులండ్రు పుణ్యుఁడితఁడీ
కృతిఁగొన కవిభాగ్యగరిమ కేమనియందున్.

మ. సిరికింబట్టు సమస్తధర్మవిలసత్సిద్ధాంతసంవేది భా
స్వరసంపూజిత సద్ద్విభాష్యవిలసద్వ్యారాశిచంద్రుండు బం
ధురతాసుందరభాసమానగుణమాన్యుండైన మా వేంకటే
శ్వరు నెన్నెన్ని నుతింప నన్నియుఁదలంపన్ బోస్వభావోక్తులా

తే. గీ. అఖిలజగ దేకవైద్యుఁడౌ నాదివైద్యుఁ
డే తనకు నిష్టదైవమై యింట నెపుడుఁ
దనకుటుంబంబు రక్షింపఁ దనరు వేంక
టేశ్వరసుధీంద్రు విభవంబు నేమనందు.

21-11-46
తుల్యారామేశ్వరము.

ద్విభాషి సోమనాథశాస్త్రి.

## శ్రీధన్వంతరి శతకకృతి.

వెంకటేశ్వర్లుగారికి శ్రీధన్వంతరి దేవుని యందపారమగు భక్తి యున్నది. తమయారోగ్యమునకు, భాగ్యమునకు సర్వమునకు నాధన్వంతరి దేవదేవుఁడే కారణభూతుఁడని వారిదృఢ విశ్వాసము.

“కద్దన్నవారికి కద్దు” అను శ్రీ త్యాగరాజ పరమభాగవతోత్తముని వచనానుసారముగ, భగవంతునియందుఁ బూర్ణమగు విశ్వాసముంచినవారలకుఁ దప్పక యాపరమేశ్వరుఁడు సమస్తభోగభాగ్యములొసఁగి రక్షించుటనిక్కము. శ్రీధన్వంతరి

స్వామి వారికి దివ్య దేవాలయముఁ గట్టించిరి. శాశ్వతముగా రాగభోగములు జరుగుటకు స్థిరవసతి. గల్పించిరి. శ్రీధన్వంతరి చరిత్రము కావ్యరూపమున వెలువరింపఁజేసిరి. శ్రీధన్వంతరి దండకము వ్రాయించి ప్రకటించిరి.

సర్వధారినామ సంవత్సర కార్తికబహుళ త్రయోదశిని (1948). శ్రీధన్వంతరిజయన్తీ మహోత్సవసమయమున శ్రీ చక్రవర్తుల వెంకటశాస్త్రిగారిచే రచింపఁబడిన శ్రీధన్వంతరి శతకమును గృతినందిరి. నూటపదియూఱులు, జోడుసేలువలిచ్చి కవి సత్కారము గావించిరి. ఈరీతి శ్రీధన్వంతరి దేవునిపైఁ దమకు గల భక్తిప్రపత్తుల సర్వతోముఖముగ వెల్లడించి యావత్ప్రపంచమునకు మార్గదర్శకులైరి.



ఓమ్

శ్రీమద్ధన్వంతరయేనమః

# శ్రీ ద్విభాష్యం వెంకటేశ్వర్లుగారి జీవితచరిత్రము.

## పదుమూఁడవ ప్రకరణము.

(సాహిత్యగోష్ఠి, పురాణశ్రవణాదికము, వితరణవిశేషములు.)

వెంకటేశ్వర్లుగారికి సంస్కృతాంధ్రసాహిత్యములయందు మిక్కుటమగునాసక్తి. ఆంధ్రసాహిత్యమందు విశేషమగు పాండితి సంపాదించిరి. తెలుఁగుప్రబంధములలో వారు చదువని గ్రంథమే లేదు. శ్రీమదాంధ్రమహాభారతము, ఆంధ్రభాగవతము, మనుచరిత్రము మున్నగు సద్గ్రంథములలో పద్యములెన్నియో వీరికిఁ గంఠస్థములు. సాధారణముగా నిన్నిపద్యములు కంఠస్థముగా నున్నవారలు కవులలోఁ గూడ నరుదుగా నుందురు.

భావశుద్ధి రసౌచితి మున్నగువిషయములలో వీరు గావించువిమర్శనములు విబుధజనశ్లాఘనీయములుగా నుండెడివి. గ్రంథకర్తల తాంతర్యావిర్వచనమున వీరు ప్రదర్శించుయుక్తులు బహుగంభీరములు. ఎంత సునిశితబుద్ధి కలవిమర్శకశేఖరుఁడును వీరివలె సముచితరీతి విమర్శింపఁజాలఁడు.

ఆయుర్వేదనిలయమున నెవ్వరను లున్నను పండితులుగాని కవీశ్వరులుగాని వచ్చిరని విన్నచో వెంకటేశ్వర్లుగారు

వెంటనే వారికి దర్శనమిచ్చి బహుగౌరవాదరములతో ముచ్చటించువారు.

వెంకటేశ్వర్లుగారి సంభాషణచాతుర్య మొకయెత్తు, సత్కార మొకయెత్తని పండితులును కవులును మిగుల నానందించుచుండువారు. కవీంద్రుఁ డెవఁడేని వచ్చి తనకావించు రచనము వినిపించుచున్నచో నతనికిఁ బోడకట్టని విశేషార్థములు సైతము నిర్వచించి యానందింపఁ జేయఁజాలు వెంకటేశ్వర్లుగారి వ్యాఖ్యాన చాతురీధురీణత యెంతయుఁ గొనియాడఁదగినది.

"ఒప్పొతప్పరయు రసజ్ఞు"

లన్న పెద్దన్నగారిమాట వరహాలమూట. రసజ్ఞులైన శ్రోతలు లభించని కవికవిత వితయే. అందుననే సంస్కృత మహాకవి యొకఁడు.

"అరసికాయ కవిత్వ నివేదనం శిరసి మాలిఖ మాలిఖ మాలిఖ"

అని యెలుఁగెత్తి మూఁడుమారు లుద్ఘోషించెను. నిజముగాఁ గవియైనవానికి రసజ్ఞతలేనివానియొద్దఁ గవిత్వము చెప్పుట కన్న మిన్న యగు దౌర్గత్యము లేదు.

"అరసికులైనవారలతోడి సంభాషణముకన్న రసికజనుల పాదతాడన మందుటయే మే" లని పెద్దలాడుమాట సాటి లేనిది. కవితయు దుహితయు నొకవర్గములోనివి. దుహిత సకలసుగుణాలవాల యయ్యు నత్తింటివారి మెప్పు సంపాదింపఁగల్గినపుడే తండ్రి కానందము కల్గింపఁజాలును. కవితయు గుణాలంకృతి సమన్వితయయ్యును రసజ్ఞులప్రశంస లందినపుడే కవి నానందపరవశుని: గావింపఁ గలుగును. రసజ్ఞమూర్ధాభి

షిక్తులగు భోజ మహారాజాదుల సమక్షమునఁ గాళిదాసాది మహాకవులెంతటి యానందమంద గలిగిరో వచింపనలవికాదు కాని యద్యతనకాలమున వెంకటేశ్వర్లుగారి సముఖమందు విద్వత్కవులందిన యానందముమాత్ర మసాధారణ మైనది.

శ్లో॥ తం సంతః శ్రోతు మర్హన్తి సదసద్వ్యక్తిహేతవః।
హేమ్నః సంలక్ష్యతే హ్యగ్నౌ విశుద్ధిః శ్యామికాపివా॥

(మంచిచెడ్డ లరయంజాలిన విద్వాంసులే నాకావ్యము వినుటకర్హులు. బంగారమునందలి మంచిచెడ్డలు దీప్తాగ్నియందే తెలియఁబడుచున్నవికదా) అని మహాకవి కాళిదాసు ముక్తకంఠుఁడై వచించుటలోని తాత్పర్యమిట్టిదియే. పాత్రౌచిత్యవివేచనాదక్షులు రసపిపాసువులు నగు వెంకటేశ్వర్లుగారి సాహచర్య సందర్శనాదిభాగ్య మందఁజాలిన పండితులేమి కవులేమి పండితకవులేమి ధన్యులు. ధన్యాతిధన్యులు.

వంగదేశములో నాయుర్వేదవిద్వాంసులకు "కవిరాజు" అనుబిరుదమున్నట్లు కానవచ్చును. ఆదేశమున వారి కాబిరుదమెట్లు లబ్ధమైనదో తెలియదు. కాని వెంకటేశ్వర్లు గారియెడల నాబిరుదము సర్వవిధముల సార్థకము కాఁగలదు.

"రంజయతీతి రాజా" (రంజింపఁజేయువాఁడు రాజు.) అను వ్యుత్పత్తిచేతఁ గవితా సారస్యమెఱిఁగి కవులనురంజింపఁ జేయుటలో వెంకటేశ్వర్లుగారినిమించఁజాలుకవిరాజులుందురా!

మనదేశమందలి కవులలో "కవిరాజు" బిరుదము ప్రచార మందినది. కవుల కాబిరుదముండుటకంటె రసజ్ఞశేఖరులగు వెంకటేశ్వర్లుగారివంటివారి కాబిరుదముండుట సముచితము సార్థకము.

కేవల కవులెవరో విద్వత్కవులెవరో యొక్కపద్యము విన్నంతమాత్రముననే వెంకటేశ్వర్లుగారు గ్రహింపఁగల్గెడు వారు. శుష్కపాండిత్యమో నిశితపాండిత్యమో యొక్కమాటలోనే తెలిసికొనఁజాలెడువారు. కవితావినోదమో పండితగోష్ఠియో లేక రోజుండెడిదికాదు. పండితులుకవులును దమపాండిత్యాదికముచే వెంకటేశ్వర్లుగారి నెంతఁగా రంజింపఁజేయఁగలిగిరో తెలియదు. కాని వెంకటేశ్వర్లుగారుమాత్రము తమయసమాన రసజ్ఞతావైభవమువలనఁ బండితులను గవులను మిగుల రంజింపఁజేసిరనుట యథార్థము.

## — ♦ పురాణశ్రవణము ♦ —

వెంకటేశ్వర్లుగారు నలుబదివత్సరములు ప్రాయము వచ్చిననాటినుండియుఁ బ్రతిదినము పౌరాణికునివలనఁ బురాణశ్రవణము చేయుచుండువారు. పెదపల్లగ్రామవాస్తవ్యులు శ్రీ మద్దాల తిరుమల వెంకటరాఘవాచార్యులుగారిచేతఁ గొంత కాలము పురాణముచెప్పించి గొప్పగాసత్కరించిరి. జగన్నాథగిరి గ్రామనివాసులగు శ్రీ కోట వెంకన్నగారిచే రామాయణమంతయుఁ బురాణముచెప్పించి సీతాకల్యాణము, శ్రీరామపట్టాభిషేకము సమయములలో మహావైభవముగా నుత్సవసంతర్పణాదికములుసేయించి పౌరాణికుని మనఃసంతుష్టియగునట్లు సత్కారము గావించిరి. పౌరాణికశిరోమణులగు బ్ర॥శ్రీ॥ చిర్రావూరి లక్ష్మీనారాయణశాస్త్రిగారిని నిత్యపౌరాణికులుగా నియమించి వారివలనఁ గొన్నిసంవత్సరములు వరుసగా వాల్మీకి

రామాయణము, శ్రీమద్భాగవతము మున్నగు మహాపురాణము లెన్నియో శ్రవణము కావించిరి.

బ్ర॥శ్రీ॥ శిష్టా రామశాస్త్రిగారు

,, అనపిండి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు

మున్నగు మహామహులగు పండితశేఖరులవలనఁ బురాణము చెప్పించి వారి ననేకవిధముల సత్కరించిరి.

ఆమ్నాయవాచస్పతి బ్ర॥ శ్రీ॥ ఉప్పులూరి గణపతిశాస్త్రి గారి నాహ్వానించి వారివలన నొకనెలరోజులు వేదార్థశ్రవణ మొనరించి 116_0_0 లిచ్చి సత్కరించిరి. ఇల్లిందలో పండితోత్తములవలన నెన్నియోవిషయములు విని వారి నపారగౌరవాదరములతో సత్కరించి "పండిత జనపోషకు" లని ప్రసిద్ధిగాంచిరి. ఈకాలములో నిట్టి పండితజనావలంబభూతులగు మహనీయు లరుదు. వెంకటేశ్వర్లుగారి పూర్వపుణ్యావిభవ మెట్టిదోకాని వీరికుమారులగు శ్రీ వెంకటసూర్యనారాయణమూర్తి గారును తండ్రిగారిమార్గమునే తు, చ, తప్పకయనుసరించుచు "పండిత జనపోషకు"లను ప్రసిద్ధి గనుచున్నారు. వయసుచేఁ బిన్నలయ్యును బెద్దలతోఁ దులదూఁగఁజాలు శీలసంపద, సదాచారతత్పరత, యౌదార్యము, దాతృత్వము, వెంకటసూర్యనారాయణమూర్తిగారికి సహజముగా నలవడియున్నవి. అగర్భశ్రీమంతులయ్యు నిరాడంబరవేషులు. పండితపక్షపాతులు. వినయాభరణులు. గర్వరహితులు. వీరునుబ్రతిదినము బ్ర॥ శ్రీ॥ చిర్రావూరి లక్ష్మీనారాయణశాస్త్రిగారివలనఁబురాణశ్రవణము చేయుచున్నారు.

## —: వితరణవిశేషములు :—

వెంకటేశ్వర్లుగా రనేకవిద్యాసంస్థలకు సాహితీసంస్థలకు రాజకీయసంస్థలకును విరాళము లిచ్చి పోషించిరి.

వింజరంగ్రామములో వేదశాస్త్రపాఠశాల నెలకొల్పి పదివేలరూప్యములు విరాళమిచ్చుటయే కాక దానిపోషణభార మంతయు తామేవహించి నిర్వహించుచున్నసంగతి వెనుకటి ప్రకరణములోఁ దెలుపఁబడినది. మండపేటహైస్కూలునకు గూడఁ గొంతవిరాళ మొసంగిరి.

పండిత శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

గారిచే నిర్వహింపఁబడు "కలాభివర్ధనీపరిషత్తు" నకు రాజపోషకులై విరాళ మొసంగిరి. అఖిలభారతకాంగ్రెసు మహాసభ కెన్నియోసారులు విరాళము లిచ్చి తమకుఁగల యవ్యాజ మగుదేశభక్తిని బ్రకటించిరి. ఆంధ్రుల యేకైకనాయకులగు ఆంధ్రకేసరి శ్రీటంగుటూరి ప్రకాశంపంతులుగారికి రు 116–0–0 లు బహూకరించిరి. ఆంధ్రరాష్ట్రనిర్మాణకృషిలో యావదాంధ్రదేశమున బర్యటించిన సర్ విజయా కుమారరాజాఆఫ్ విజయనగరం గారు వచ్చినపుడు సత్వరాంధ్రరాష్ట్రనిర్మాణవిషయక కృషికిఁదోడ్పడుటకు రు 116 విరాళమొసఁగి రాష్ట్రముపైఁగల గాఢాభిమానమును వెల్లడించిరి. మరియు గుప్తదానము లెన్నియేని గలవు. పేదవిద్యార్థుల కెందఱికో విద్యార్థివేతన మొసంగి విద్యాపోషణ మాచరించిరి. సర్వతోముఖమగు వెంకటేశ్వర్లుగారి వితరణవిశేష మెంత వర్ణించినను దనివితీఱనిది.



ఓమ్

శ్రీమద్ధన్వంతరయేనమః

# శ్రీ ద్విభాష్యం వెంకటేశ్వర్లుగారి జీవితచరిత్రము.

## పదునాల్గవ ప్రకరణము.

(మనుమరాలి కల్యాణమహోత్సవము–శ్రీ వ్యాసేశ్వరస్వామివారికి నందాదీపము–బ్రాహ్మణ గృహదానము.)

వెంకటేశ్వర్లుగారి యేకైకపుత్రులు వెంకటసూర్యనారాయణ మూర్తిగారు. వీరి ప్రథమపుత్రిక చి॥సూర్యలక్ష్మి. ఈచిరంజీవిని వివాహ యోగ్యవయస్కయైనది. వేదవిహితధర్మానుష్ఠానమం దభిని వేశము కలవారగుటచే వెంకటేశ్వర్లుగారికి తమ మనుమరాలి వివాహమహోత్సవము గావింపవలెనను తలంపు కల్గినది. "దశపూర్వేషాం దశాపరేషా"మని యుభయకులములనుత్తమ స్థితిలో నుద్ధరించు కన్యాదానఫలముఁ జూరఁగొను సంకల్పము గల వైదికధర్మనిష్ఠాగరిష్ఠులగు వెంకటేశ్వర్లుగారు తమతో సమానులగు నుత్తమవంశజులతో వియ్యమంద నెంచిరి.

"శ్లో॥ కన్యా వరయతే రూపం మాతా విత్తం పితా శ్రుతమ్
బాంధవాః కుల మిచ్ఛన్తి"

అనునట్లు వరున కుండవలసిన లక్షణములన్నియుఁ బుంజీభవించిన యుత్తమవరునికై యన్వేషింప సాగిరి. ఆలమూరు గ్రామములో నరసింహాదేవరవారి వంశ మతిప్రసిద్ధమైనది.

అందును "పేరుశాస్త్రిగారు" జగద్విఖ్యాతులైనమహావిద్వాంసులు. విద్యాదానములోనేమి యన్నదానములోనేమి వారికి వారే సాటి. వందలకొలఁది విద్యార్థులకుఁ బాఠప్రవచనములాచరించిన మహోపాధ్యాయులు. నిరతాన్నదానతత్పరులు. ఆమహనీయుల జ్యేష్ఠపుత్రులు సత్యనారాయణగారు వీరాంగ్లభాషాకోవిదులయ్యును సంస్కృతాంధ్రములందును దక్షవైదుష్యమార్జించిరి స్వాతంత్ర్యసమరంబున నకుంఠితశౌర్యముతోఁ బోరాడిన వీరయోద్ధలు. సహకారోద్యమమునకు జీవగఱ్ఱ. మనయాంధ్రదేశమునందు వీరిచాకచక్యము, ప్రతిభ, వాక్చాతుర్యము తెలియఁగనివారలుండరు. సహకారోద్యమపురోభివృద్ధికై వీరుకావించు నుపదేశము లమూల్యములై ప్రభుత్వమువారిచేఁగూడ శిరసావహింపఁబడుచున్నవి. వీరియేకైక పుత్రులు

## జనార్దనశాస్త్రిగారు.

వీరు తమపితామహులయొద్దనే సంస్కృతాంధ్ర సాహిత్యగ్రంథములు చదివి వైదుష్య మార్జించి తాతగారిప్రతిష్ఠ నిలుపుచున్నారు. నరసింహాదేవర వారివంశ మిట్లు తరతరములనుండి విద్యాధనాది సర్వసంపదలతో విరాజిల్లుచున్నది. ఈ జనార్దనశాస్త్రిగారిపుత్రులలోఁ బెద్దవాఁడు

## సత్య రామకృష్ణశాస్త్రి.

ఈచిరంజీవి సర్వవిధములఁ దమమనుమరాలికిఁ దగు వరుఁ డని వెంకటేశ్వర్లుగారికిఁ దోఁచినది. తాము వారును బురాతనబాంధవ్యము కలవారగుటచే స్వయముగా అల

మూరు వెళ్ళి శ్రీసత్యనారాయణగారికిఁ దమసంకల్పము వెల్లడించిరి. వారును మాఱుమాటాడక వెనువెంటనే

## " తథాస్తు "

అని తమయంగీకారము చూపి సంబంధనిశ్చయము కావించుకొనిరి. స్వస్తిశ్రీ సర్వధారినామసం॥ర మాఘ బ॥ తదియనాఁడు వివాహమున కనుకూలముహూర్తముగాఁ బెద్దలచే నిర్ణయించఁబడినది. మగపెండ్లివారు నాఁడు మహావైభవముగా వెంకటేశ్వర్లుగారిగృహమునకుఁ దరలివచ్చిరి. సుముహూర్తము నిర్విఘ్నముగ నతిజయప్రదముగఁ గొనసాగినది. ఆమహోత్సవమునకు గోదావరిజిల్లానుండియే కాక ఇతరమండలములనుండియు వేలకువేలు పండితప్రకాండులు కవీంద్రులు నరుగుదెంచిరి. సుముహూర్తమైనమీఁద వెంకటేశ్వర్లుగారు తమమనుమరాలికి నూఱుకాటాబస్తాలు ధాన్యము మక్తావచ్చు ఎనిమిదియెకరములు సుక్షేత్రమగుపల్లపుభూమి పసుపుఁగుంకుమమాన్యముగా నొసంగిరి. పెండ్లికుమారునకు వెండిచెంబు వెండిపళ్ళెము రత్నఖచితసువర్ణకంకణము మున్నగు విలువగల వస్తుసమూహము కానుకగా నొసంగిరి. ఒకమేడకట్టించియిచ్చుటకు వాగ్దానము చేసిరి. మరియు వెండి పానకపుబిందెలు వగైరాలు బహుమానము కావించిరి. పండితకవిప్రకాండులమహోదారాశీర్వచనముల యనంతరము తమయసమానవాదాన్యకమునకుఁ దగునట్లుగఁ దారతమ్యవిభాగముతో సభాసత్కారము కావించిరి. ప్రథమకక్ష్యకుఁ దగుపండితులకు ఇరువదియైదురూపాయాలు సెల్వాయును, బహుమానముగా నొసం

గిరి. ద్వితీయశ్రేణివారలకు పదునాఱురూప్యములు సేల్వ యును సత్కార మాచరించిరి. ఇట్లే తక్కినపండితుల నెల్ల తరతమవిభాగముతో గొప్పగా సత్కరించిరి. ఆమహోత్స వమునకు వచ్చిన పండితుల సన్మానించుటకై కావింపఁబడిన ధనవ్యయము వేలలోనుండును. వివాహమహోత్సవ మైదు రోజులును జేసినపిండివంటలు చేయక ఘృతకుల్యలు దధితరం గిణులు ప్రవహించునట్లుగ వేలకొలఁది బ్రాహ్మణులకుఁ గావిం చినసంతర్పణము వేయిముఖములతో వర్ణింపఁదగినది. దేవదుం దుభులు మ్రోయునట్లుగ వెంకటేశ్వర్లుగారు తమమనుమరాలి కల్యాణకౌతుకము జయప్రదముగ నిర్వహించిరి." కన్నులుం టకుఁ గని వీనులుంటకు వినందగు నల్పుఁడ నేమిచెప్పఁగన్."

— నందాదీపప్రదానము —

కాకినాడతాలూకా పల్లిపాలెము గ్రామమున విజయం చేసి యున్న శ్రీవ్యాసేశ్వరస్వామివారికి నిత్యదీపము పెట్టు టకుఁ దగినవసతి లేక యాగ్రామవాసులలోఁ గొందఱు పెద్దలు వెంకటేశ్వర్లుగారిని దర్శించి తమసంకల్పము తెలిపిరి. వారుకోరుటయే తడవుగ నిత్యదీపమునకు గువ్యయము తాము భరించుట కంగీకరించి ప్రతిమాస మాసొమ్ము పంపుచుండు వారు. తరువాత వారికుమారులు శ్రీ వెంకటసూర్యనారా యణమూర్తిగారు రొకయుకరముభూమి దానపట్టావ్రాసి యిచ్చి తండ్రిగారిదాన మాచంద్రార్కముగ నుండునట్లొనరించిరి.

—: గృ హ దా న ము :—

వింజరముగ్రామమునందలి వేంకటేశ్వర వేదశాస్త్రపాఠశాల యందు వేదాధ్యాపకు లైన బ్ర॥ శ్రీ భళ్ళమూడి సత్యనారా

యణమూర్తి అవధానులుగారికి వింజరగ్రామము లో నొకయిల్లు కొని గృహదాన మొనరించిరి. దానము పరిగ్రహించుటకు సత్పాత్రిదొరకుట దుర్లభము. సత్పాత్రిసంభవించినను వారికి దానమిచ్చు మహాభాగ్యము చూఱఁగొను వదాన్యు లుండుట యరుదు.

ఋగ్వేదయజుర్వేదములందు నిష్ణాతులై యధ్యయనాధ్యాపనముల నాఱితేరిన మహావిద్వాంసులు బ్ర॥శ్రీ భ. సత్యనారాయణమూర్తి అవధానులుగారు ప్రతిగ్రహీతలు.

అట్టిసత్పాత్రినుగుఱించి దానమొసఁగుమహాభాగ్యము కైవసము గావించుకొనిన వెంకటేశ్వర్లుగారు దాతలు. ఇట్టి సన్నివేశ మెచ్చటనో గాని సంభవింపదు ఈదాతృప్రతిగ్రహీత లుభయులు ధన్యులు శాశ్వతయశోభాజనులు. వెంకటేశ్వర్లుగారు కావించిన యిట్టిసత్కార్యములు భావిపౌరులకెల్ల నాదర్శ భూతములు కాఁగలవు. వదాన్యతకుఁబుట్టినిల్లైన శ్రీ వెంకట సూర్యనారాయణమూర్తిగారును తండ్రిగారియడుగు జాడల నతిక్రమించక విశ్వవిఖ్యాతఖ్యాతి నార్జింపఁగల్గుదురనుట నిస్సంశయము. తండ్రిగారివలన గృహదానము కైకొనిన యవధానులుగారికి వెంకటసూర్యనారాయణమూర్తిగారు 1-50 సెంట్లు భూదాన మొసంగి తండ్రిగారిదానమునకువన్నెఁ గూర్చిరి. వెంకటేశ్వర్లుగారేకాక వారి కుమారులు సైత మింతవదాన్యు లగుట కేవల మావంశము కావించిన పూర్వపుణ్యవిశేషము. శ్రీవెంకటసూర్యనారాయణమూర్తిగారితోఁ దీర్ఘాయురారోగ్యభాగ్యాదికములతో విలసిల్లునట్లు శ్రీధన్వంతరి దేవదేవుఁ డనుగ్రహించుగాత.

ఓమ్

శ్రీమద్ధన్వంతరయేనమః

# శ్రీ ద్విభాష్యం వెంకటేశ్వర్లుగారి జీవితచరిత్రము.

## పదునైదవ ప్రకరణము.

(అధ్యాత్మవిచారము, మోక్షప్రాప్తి.)

వెంకటేశ్వర్లుగారికి సర్వధారి సం॥ర శ్రావణమాసమునకు అఱువదియాఱు సంవత్సరములు పూర్తియైనవి. ఆసం॥ ర మాఘమాసమందే జగద్గీయమానముగా మనుమరాలివివాహమహోత్సవము గావింపఁబడియెను. అప్పటికే శరీరమునఁ గొంచెయస్వస్థత యేర్పడియెను. అయినను వేయికన్నులతోఁ గనిపెట్టుచు సర్వలక్షణోపేతముగఁ గార్యము నిర్వహించిరి. జీవితకాలములోఁ దాము గావింపఁదలఁచిన సత్కార్యములు శుభకార్యములు సకలజనసన్నుతములుగా నెరవేర్పఁజాలిరి.

పరోపకారనిరతులై వైద్యచికిత్సలు కావించిరి. ధర్మవశంవదులై యనేకధర్మములాచరించిరి. త్యాగతత్పరులై ధనసంపాదనము చేసిరి నిత్యసత్యవ్రతులై మితభాషణ మలవఱచుకొనిరి. సదాచారపరాయణులై యాదర్శజీవన మొనరించిరి. వంశాభివృద్ధికరులై సత్సంతానము వడసిరి. గృహస్థధర్మము లెల్ల సమగ్రములుగా నిర్వహించుకొనిరి. చరకసంహితములోని "తిస్రైషణీయాధ్యాయము"లోఁ జెప్పఁబడిన త్రయమందును ద్వయము పూర్తియైనది. పరలోకైషణ మొక్కటియే మిగిలియున్నది, అది యధ్యాత్మవిచారణమునఁ గాని

సాధ్యము కాదు. ఈవిచారణమందుఁ బరినిష్ఠితు లైనవారలకు గమ్యస్థానము మోక్షపదప్రాప్తి. ఇదియే కైవల్యము. నిరతిశయానందసామ్రాజ్యము.

"సుఖం మే భూయాత్ దుఃఖం మే మాభూత్"

(నా కెల్లపుడు సౌఖ్యము కలుగుగాక. దుఃఖము లేక పోవుగాక) అని ప్రతిప్రాణియు సంకల్పించును కాని యందులకై వలయుకృషి సేయువారలు కోటి కొక్కరుగా నుందురు. ఐహికసౌఖ్యమే నిరతిశయానంద మని భ్రాన్తిపడువారలు పెక్కురు. నిరతిశయానందము త్రికాలాబాధ్యము, శాశ్వతికము, జీవబ్రహ్మైక్యజ్ఞానమాత్ర సాధ్యము, నైకజన్మకృతసుకృతపరిణామలభ్యము నైయుండును. ఏతాదృశసౌఖ్య మభిలషించుప్రాజ్ఞశిరోమణులు సాధనచతుష్టయసంపన్ను లై యుండవలయును.

౧ నిత్యానిత్య వస్తువివేకము.

౨ ఇహాముత్ర ఫలభోగ విరాగము.

3 శమాది షట్క సంపత్తి.

౪ ముముక్షుత్వము. అనునవి సాధసచతుష్టయ మనఁబడును.

"బ్రహ్మ సత్యం జగన్మిథ్యా"

అను వచనార్థమెఱింగి దృశ్యమాన పాంచభౌతిక ప్రపంచకమెల్ల ననిత్యమనియు సచ్చిదానంద స్వరూపమై యంతటనిండియుండిన బ్రహ్మమే నిత్యమని తెలిసికొనుటయే నిత్యానిత్య వస్తు వివేకము,

సార్వభౌమాంతమగు నిహలోక సౌఖ్యములందును బ్రహ్మపదమువరకుఁగల పరలోకసౌఖ్యములందును గోరికలేక యుండుటయే యిహాముత్ర ఫలభోగ విరాగము.

౧ శమము ౨ దమము ౩ తితిక్ష ౪ ఉపరతి ౫ శ్రద్ధ ౬ సమాధానము అను నాలుగుణములు కలిగియుండుటయే శమాది షట్క-సంపత్తి. సంసారబంధవిమోచనము కావించు కొనుటకై తీవ్రమగు కోర్కెయే ముముక్షుత్వము. వెంకటేశ్వర్లుగారి కీసాధనచతుష్టయము పురాకృతసుకృతబలంబువలనను సజ్జనసహవాసంబునఁజేసియు లభ్యమైనది. అందువనే వారి మనస్సు విషయపరాఙ్ముఖమై యధ్యాత్మ విచారణాభిముఖమైనది. ప్రాజ్ఞశేఖరుఁడగు కుమారుఁడు వెంకటసూర్యనారాయణమూర్తిగారికి వేంకటేశ్వర ఆయుర్వేదనిలయ కార్యభారముతోఁ గుటుంబభారమంతయు నప్పగించి నిశ్చింతులై సర్వదా భగవద్గీత, ఉపనిషత్తులు, భాష్యములు శ్రవణముసేయుచు, నావిషయములే మననమొనరించుచు సంతతము నిదిధ్యాసములోనుండఁగల్గిరి. ఉత్తమజన్మము సంభవించినందులకు సార్థక్యమిదియే. గమ్యస్థానమిదియే. క్రిమికీటకాది జన్మములనుండి మానవజన్మమందు వరకెన్నిలక్షల జన్మములైనవో. మానవులందును నిట్టియుత్తమజన్మమొందుట కెంతకాలము పట్టినదో. జ్ఞానప్రధానమగు నుత్కృష్టమానవ జన్మము లభించినను బరసాధనకై కృషిచేయనివాఁడు వ్యర్థజీవనుఁడు.

"పునరపి జననం పునరపి మరణం
పునరపి జననీ జఠరే శయనమ్"

అను రీతిగా నపారసంసార మహాసాగరతరంగములలో మునుగుచుఁదేలుచు దరిచేరు సాధనపరంపరలం గనుంగొనక దేవురులాడు వారలకన్న నజ్ఞానులుండఁబోరు. ప్రబలమైన యవిద్య యావరించియుంటచేఁ గైవల్యమందరానిపండుగానుం డునేకాని ఆయావరణము భేదిల్లునంతనే కరతలామలకమైయగు పట్టును. అవిద్యావరణము భేదించుటకై సాధనచతుష్టయము, సజ్జనసహవాసము శ్రవణమనన నిదిధ్యాసనములు యమనియ మాదికాత్మగుణసంపత్తియు ముఖ్యసాధనములు. ఆవరణశక్తి నశించుటతోడనే విక్షేపశక్తి తనంతఁదానే యుపశమించును.

రజ్జువు చూచి పామని భ్రమపడినపుడే భయము కంపము మున్నగు విక్షేపములు కలుగును. ఆభ్రాంతితొలఁగి రజ్జువను యథార్థజ్ఞానముదయించినంతనే యంతకుమున్ను కలిగిన విక్షేపములెల్లఁ దమంతఁదామే నశించుట యనుభవసిద్ధమే కదా? తాను కాని దేహేంద్రియాదులను దానని భ్రమించి తజ్జనితసుఖ దుఃఖాదికమెల్లఁదనదిగా భావించుట యవిద్యావరణమూలకము. దేహేంద్రియమనోబుద్ధ్యాదికములకు వేత్తయైయుండు సాక్షిభూతకూటస్థచైతన్యమే తానని గుర్తించి యనుభవించిన జ్ఞానిశేఖరుని యెదుట నాయావరణశక్తి నిలువనేరదు. ఆవరణశక్తి దూరముగాఁదొలఁగినంతనే విక్షేపశక్తియు నశించి

"సర్వం ఖల్విదం బ్రహ్మ"

అనుజ్ఞానసహకృతమై బ్రహ్మసాక్షాత్కారము కల్గును. అట్టి బ్రహ్మసాక్షాత్కారమందిన మహనీయుఁడే జీవన్ముక్తుఁడై పునర్భవరహితమగు శాశ్వతపదమంది విరాజిల్లును.

"తద్విష్ణోః పరమం పదమ్॥"

అని శ్రుతిచే వర్ణింపఁబడిన పరమపద మదియే, శుక ప్రముఖు లగు మహర్షివర్యులు జనకముఖ్యు లగురాజర్షిసత్తము లును గాంచఁగలిగిన మహోత్తమస్థాన మిదియే యని పురాణ వచనములవలన విదితమగును

వెంకటేశ్వర్లుగా రట్టిమహాపురుషు లాదర్శభూతులుగా జీవితమంతయు నిర్వహించుకొనినవారగుటచే సంతపరకత్వా సక్తియున్నవారుగాఁజూచి నడపిన వైద్య తదితరవ్యాపారము లన్నియు నొక్కక్షణములో విరమించి కొని యధ్యాత్మవిచార ణాభిముఖులైరి. నారాయణస్మరణ మొనరింపని క్షణములేదు. వేదాంతశ్రవణము సేయనిగడియ లేదు. అంతలో నంతర్ముఖత్వమేర్పడినదా? యని వింతపడువా రుండవచ్చును. జ్ఞానుల వర్తనము లజ్ఞానులకు గోచరములు కావు బహిర్ముఖత్వము పూర్తిగా నుజగించి సంతతపరమాత్మ ధ్యాననిమగ్నులై బ్రహ్మానన దసామ్రాజ్య పట్టభద్రులైనవారి ప్రవర్తనము దురంత నిరంతర సాంసారిక చింతా దంతురితాంతరులైన విషయలోలు పులకు గోచరింపకపోవుట వింత కాదు.

అస్వస్థత యానాఁటికానాఁడు హెచ్చుఁజొచ్చెను. కాని వెంకటేశ్వర్లుగారి నోట నొక్కపరిదేవనవాక్యము కూడ వెలు వడ లేదు. నారాయణ అనుమాట యెన్నికోట్లావృత్తమైనదో! మాఘమాసము మొదలు జ్యేష్ఠబహుళము వరకు రమారమి గా నైదుమాసము లస్వస్థులుగా నుండిరి. కాని రోగబాధ యిట్టిదిగానున్నదని తెలుపలేదు బాధ ననుభవించుచున్నవారి

వలె వర్తింపలేము. వారిస్థితప్రజ్ఞ యెంత నిరూఢమైనదో. స్నానసంధ్యాది నిత్యకర్మానుష్ఠానము యథాపూర్వముగ జరుగవలసినదే. వేదాంతశ్రవణము నియతకాలమునందు నడువవలసినదే. తుదిరోజునఁ బ్రాణప్రయాణదినమునందును స్నానసంధ్యాదికము యథావిధిగ నిర్వర్తించికొని రన్నచో వారిధర్మదీక్ష, యచంచలాత్మానుభవపారవశ్యము లెట్టివో విజ్ఞు లగు పాఠకులే తెలిసికొనఁగలరు.

దేహాత్మలకు భిన్నత్వమే కాని యేకత్వము లేదను ననుభవము దృఢముగా నున్నవారికిఁ దక్క యన్యుల కిట్టి యాచరణము సాధ్యము కాదు. సుఖదుఃఖాది ద్వంద్వాతీతమై యవస్థాత్రయ సాక్షియై వాసనాత్రయ రహితమై తాపత్రయాతీతమై బాల్యయౌవనాద్యవస్థా చతుష్టయానుగతమై అన్నమయాది పంచకోశాతిరిక్తమై షడూర్మి దూరమై సప్తధాతు భిన్నమై వెలుఁగొందు ప్రత్యగాత్మకును, సజాతీయ విజాతీయ స్వగతభేదశూన్యమై యవాఙ్మనసగోచరమై త్రికాలాబాధ్యమై సత్యస్వరూపమై చిదాకారమై యానందమయమై పరాత్పరతరమై మెఱయు పరమాత్మకును భేదరాహిత్య మనుభవపూర్వకముగా నెఱుంగఁజాలు జ్ఞానశేఖరుల యాచరణములనన్యసాధారణములుగా నుండును.

౧. ప్రజ్ఞానం బ్రహ్మ ౨. అహం బ్రహ్మాస్మి
3. తత్త్వమసి ౪. అయ మాత్మాబ్రహ్మ,

అను వేదచతుష్టయప్రతిపాదిత మహావాక్యముల భావమనుభవములోనికిఁ బరిణమింపఁజేసికొనినవారల కవిద్యావరణసంపర్కలేశము కూడఁ దగులఁబోదు.

ఆకాశము ఘటాద్యుపాధివశమ్మున ఘటాకాశాదినామ ములచే వ్యవహరింపఁబడునట్లుగాఁబరమాత్మయొక్కఁడయ్యును మనుష్యాద్యుపాధిగతంబై తత్తన్నామములచే వ్యవహరింపఁ బడుచున్నది. ఘటాద్యుపాధి విలయము సంభవించినపుడు తత్తదాకాశములు మహాకాశముతో నైక్యమందునట్లు మను ష్యాద్యుపాధి వినాశము కలుగుటతోడనే విశుద్ధ మగుప్రత్య గాత్మయును బరమాత్మలో లీనమగును. ఇదియే సర్వవేదాన్త సిద్ధాన్తరహస్యము. ఆయీరహస్యమెల్ల గుర్తెఱింగి దేహేంద్రి యాద్యభిమానము విసర్జించి కేవలాత్మస్వరూపావస్థాన మందఁ గల్గినవారే స్థితప్రజ్ఞులు. జీవన్ముక్తులు. వెంకటేశ్వర్లుగారిట్టి స్థితప్రజ్ఞులు. జీవన్ముక్తులునని వారియాచరణ మెఱింగినప్రాజ్ఞ లకుఁ దెలిసినదే. ఇట్టిమహాపురుషులవలననే భారతదేశమున కితర దేశములకులేనిఘనతచేకూరినది. వేద వేదాంగములన్నియు నాకళించుకొని భాషాంతరీకరించిన జర్మనీదేశస్థుఁడగు

"మ్యాక్సుమిల్లర్" మహాపండితుఁడు తనకుఁ బునర్జన్మ మున్నచో నది యీభారతదేశమందే యగుఁగాక యని భగ వన్తునుద్దేశించి తనయన్తిమప్రార్థనము కావించె ననఁగా మన భరతఖండప్రాశస్త్యము విదేశీయులు గ్రహించినంతమాత్రము కూడ మనయధునాతనులు గ్రహింపలేదని తోఁచుచున్నది.

వెంకటేశ్వర్లుగారఖండాద్వితీయ సచ్చిదానందబ్రహ్మ సాక్షాత్కారసంపన్నులై తమయుభవదియేడవయేట విరోధి సంవత్సర జ్యేష్ఠబహుళ పంచమీతిధియందు (15-6-1949) పాంచభౌతిక దేహము వీడి విదేహకైవల్యమందిరి. వినాశ

రహిత మగుపద మందిరి. మోక్షసామ్రాజ్య పట్టభద్రులైరి. నశ్వరమగు వారిభౌతిక దేహము లయ మందినది. కాని వారి యాత్మ యవినశ్వరమై జరామరణాదిరహితమై శాశ్వతిక మగు నుత్తమస్థానమున విరాజిల్లుచున్నది. విరాజిల్లఁగలదు. బ్రహ్మైక్యమంది ప్రశాంతమైన వెంకటేశ్వర్లుగారియాత్మ శ్రీ వెంకటసూర్యనారాయణమూర్తి గారి కుటుంబ మాయురారోగ్యభాగ్యములతో నాచంద్రార్కస్థాయిగ విలసిల్లు నట్లాశీర్వదించుగాక.

స్వస్తి సమస్తసన్మంగళానిభవన్తు.

శ్లో॥ అఖండం సచ్చిదానందం
కాలత్రితయభాసురమ్।
కాంతం శాన్త మనాద్యన్తం
పరం జ్యోతి రుపాస్మహే॥

శ్లో॥ స్వస్తి ప్రజాభ్యః పరిపాలయన్తాం
న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః।
గోబ్రాహ్మణేభ్య శ్శుభ మస్తు నిత్యం
లోకా స్సమస్తా స్సుఖినోభవన్తు॥

శ్లో॥ కాలే వర్షతు పర్జన్యః
పృథివీ సస్యశాలినీ।
అధనా స్సధనా స్సను
జీవన్తు శరదాం శతమ్॥

ఇది వ్యాకరణాచార్య, విద్వత్కవిశేఖర ఓలేటిస[illegible] నారాయణశాస్త్రి విరచితంబగు శ్రీద్విభాష్యం వెంకటేశ్వ[illegible]జీవితచరిత్రంబు సర్వము సమాప్తము.

వెంకటేశ్వర్లుగారి నిర్యాణవార్త విని యాంధ్రదేశ మెల్ల విచారభరితమైనది. వారు కైవల్యసామ్రాజ్యమందు వెలుగొందుచున్నారు. కాని వారులేని లోటీయాంధ్రదేశమున కెప్పటికిని తీరనిది. ఆంధ్రదేశమందలి కవులు పెక్కురు పద్యములు వ్రాసి పంపిరి.

మద్రాసుప్రభుత్వ ప్రథమాంధ్రాస్థానకవులు కింకవీంద్రఘటాపంచానన, విద్వత్కవి, బాలకలానిధి, బాలసరస్వతి శతావధాని చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు వ్రాసినది.

“విచారకరమైనమీ కార్డు నేఁడే అందినది. కాని యెంతపరిశీలించినా యింతసవ్యమైననిర్యాణము కనపడనేలేదు. మనశాఖలోనే కాదు. ఇతరులలో కూడ నింతటి ధన్యుఁడు లేఁడు.

మ. కృతు లందె న్నుడి గట్టెఁ బంక్తి నతిథి
శ్రేణు ల్సదా మడ్రిప
స్తృప్తిగా భోజన మాచరింప నియతిన్
బోసేసె, సర్వంబు స్వా
ర్జిత మే ధన్యుఁడు వేంకటేశ్వరుఁ డహో
వృద్ధే చనె న్నాకమున్
స్తుతి కా దిద్ది యథార్థ మీతనికి నే
జోహారు లర్పించెదన్॥

వెం॥ శా॥ శతావధాని.”



కాకినాడ : బార్జిప్రెస్‌యందు ముద్రింపఁబడెను.

'కవికిశోర' వేదాంతం వేంకటసుబ్రహ్మణ్యశర్మగారు
కవితాసంస్థానము, విజయవాడ.

---

మ॥ అరె! యేమీ! నిజమేన స్వామి యిది? యా
హా! యెన్నిసంసారముల్
దరిలేనట్టి విషాదవైతరణి మ
ధ్యన్ మున్గిపోచున్నవో
కఱవైపోయెఁగదే ద్విభాష్యకుల భా
గ్యప్రౌఢుఁడౌ వేంకటే
శ్వరుఁ డింకన్ మనకట్టిదాత కతవ
ర్షశ్రేణికిన్ బుట్టునే?

19-6-49. 'వేదాన్తకవి'

# అనుబంధము.

## ఉత్పలమాలిక.

### శ్రీ చెళ్ళపిళ్ళ దుర్గేశ్వరశాస్త్రిగారు.

ఇక్కడనొక్కమాటవచియింపక తీరదు పూర్వకాలమం
దక్కమనీయమూర్తి భరతాన్వయరక్షణకోసమై ధరన్
జిక్కిచరించె దేవుఁడయి చేవగలాఁడయి కాశివంటి బల్
చక్కనిపుణ్యతీర్థమున సంగతమియ్యది కాని చింతలూ
రెక్కడ ? పట్టణంబయినది ? యింతకునిక్కడపట్టుమున్న చో
లెక్కకునైదువేలయిన లేరుమనుష్యులు పుణ్యతీర్థమా ?
ఇక్కడఁజెప్పఁబోఁదగిన యేమహనీయునియాలయంబుఁ బెం
పెక్కకనంగరాదు మఱియేమిటికిం చువసించినాఁడొ ? యీ
ప్రక్కన వైద్యదేవుఁడు ద్విభాషికులుండగు వేంకటేశ్వరుం
డిక్కడనుండుటేయగునొ ? యీతనివైదొలఁగంగ కోరకే
చక్కనిపాలరాతిపయి స్వచ్ఛతమున్ దలయొగ్గి భక్తికిన్
జిక్కివసించుకారణము చిన్నదికాదది పెద్దదేసుఁడీ !
ఒక్కనిశీథమందునయియుండఁగనొప్పు కలన్ వినమ్రుఁడై
మ్రొక్కి స్వయంబుగా బహుళభూతలరోగములన్ గుఱించి స
మ్యక్కథనంబొనర్చి గుడియందువసింపఁగఁ జేసె నీతఁ డిం
కొక్కవిశేషమున్ గలదు యుక్తివిశిష్టుఁడు వేంకటేశ్వరుం
డొక్కహరుండె కాదు హరియొక్కఁడె కాదు శివుండు విష్ణువై
యిక్కలికాలమందు నొకఁడే విభుఁడాతడు వేంకటేశుఁడన్
వాక్కునుమే లుదాహరణవర్తనుఁడైనక తాన-వైద్యరా
ట్టక్కడ నేమనన్ బెసఁగినట్టులు కన్పడబోదు-మానినై

చక్కఁగ శంఖమూది ధృతిచాలి చరించెడు వ్యాధిలోకమున్
గ్రక్కున మేలుకొల్పి తొలఁగన్ దగు హెచ్చరికన్ బొనర్చి-యా
ఫక్కికి సన్యధాజరువు పట్టునఁ జక్రముఁజూపి కుత్తుకల్
ముక్కలుగాపడన్ నరకిప్రోవులు పెట్టుమనన్న భావమున్
తక్కనఁజూచువారల కెడందలఁదోఁపఁగ-పైకిమాత్రమిం
పెక్కనమోహనాకృతి, అహింసకు పెద్దకుమార్తయై నలుం
దిక్కులవారికిన్ శమన దేవతయై యలరార "వైద్యరా
జిక్కడ వెంకటేశ్వరుఁడు-ఈతఁడు నాసుతులందొకండు-స
మ్యక్కృత కర్మకుం డమృతహస్తుఁడు-ఆశ్రితపక్షపాతి-మా
జక్కులతేవియంత ధనసంచయమున్ గలవాఁడు-మిక్కిలిన్
ఆకలతేనిబోల్కడుకు ఆకలఁబోలెడిమన్మరాండ్రు-బల్
మక్కువగల్గుభార్య-బహుమాన్యచరిత్ర సుశీల కోడలున్
చక్కఁగదన్నుగొల్వ ననుచాలభజించుచునుండ నింక నే
నెక్కడఁబోగలాఁడనని-యిక్కడ నేవసియించియుండె నీ
ధిక్కృతరోగవైరి సముదీర్ణపరాక్రమచక్రి-భేషజం
బెక్కడ లేనివాఁడు-భజియించెడి దైవతకోటివాఁడు-పెన్
దిక్కయి యీసమస్తజగతీతలమేలెడివాఁడు-మృత్యువున్
ద్రొక్కి, అఘంపుసంచయముఁద్రోచి, భయంబును గెంటి, నిచ్చలున్
చక్కని చల్వకన్నులఁ బ్రసన్నతఁజూచెడి దేవదేవుఁడే
యిక్కృతికి కర్తృభర్తల సహీనగుణాఢ్యులఁ జేయుగావుతన్."

సూచన :—167 పుటలో 'ధన్వంతరి' గ్రంథకృతి ప్రశంసను
ముందు చదువఁదగినది.

హరిహరదేవాయనమః

శా. శ్రీమంతం బగుచింతలూరుపురి నిక్షేపించి ధన్వంతరి
స్వామిన్ నిత్యమునమ్మిగొల్చెడుద్విభాష్యం వేంకటేశ్వర్లను
ద్భావియీదేవుఁ డదిష్టదైవతమె సంతోషించిపోషించు భో
గామేయాయు రనామయం బిడి తదన్యాభ్యర్థనం బేటికిన్.

చ. నరచిరజీవనోపకలనల్ గడియమ్మునఁ జింతలూరులో
దిరుపతిలో వసించుచు విధింతురు సత్కృతిదానభేష జా
దరణ కృపాప్రసారణ విధానములన్ ముగురైన వేంకటే
శ్వరులు: తదాత్మబాంధవత వర్ధిలునేన యదృష్టవంతుఁడన్.

మ. కరుణాసాంద్రుఁడు దానశౌండుడు కలాకల్యుండతుల్యుండు సు
స్థిరసంకల్పుఁడు శాంతిశీలు డధికశ్రీకుండు సత్కీర్తి బం
ధురు డత్యాదృతబాంధవుండు జనమాన్యుండైన మా వేంకటే
శ్వర భూమీసురమౌళి కీతఁడౌతలంపన్ సాటి వేయేటికిన్.

శా. దేవాదాయములాక్రమించుకొనుమందీభూతచేతోగతుల్
దేవానాంప్రియు లుద్భవించి ఘనులైదీపించు నీనాఁడహో!
దేవాగారవరప్రతిష్ఠ నమితాస్తిక్యంబుఁ జాటించె భూ
దేవాగ్రేసర వేంకటేశ్వరుఁడు సాధీయోగుణోపేతుఁడై.

చ. పుడమిఁ బురాతనాచరిత పుణ్యవిశేషము చేతఁ గోటికిం
బడగల నెత్తినట్టి ధనవంతు లనేకు లెసంగుచుందు ర
క్కడ కసమానబాంధవులుగాని యనర్థులుగాని చేరుచో
బెడిదమనాదృతిత్వమె లభించును, నీవలెనాదరింతురే ?

మ. కృతిఁగొన్నాఁడవు కావ్యయుగ్మమును సత్కీర్తుల్ వ్రాయింప, స
న్మతిఁగొన్నాఁడ వనేక వైద్యసభలందున్, వేదశాస్త్రిళికిన్
గతికల్పించితి వింజరంబనెడు సద్గ్రామంబునన్ జీర్ణమై
యతిదీనం బగుపాఠశాలకు బునఃప్రాణప్రతిష్ఠాకృతిన్.

మ. ఉనికిన్ వీడకయేయయారె! భవదాయుర్వేదవైద్యాలయం
బునకున్ శాఖలనిల్పి బంధుజనతం బోషించుచున్నాఁడ వీ
తెనుగున్నేల ననేకసీమల "స్వయంతీర్ణః పరాంస్తారయే".
త్తను నార్యోక్తుల నాకళించుకొని తత్సార్థక్యసంధాతవై.

మ. అనుకూలాంగనయుంట సద్గుణగణఖ్యాతానుజుల్ గల్గుటన్
తనయుండన్నిట నిన్ను మించి వినయాస్తంద్రాఢ్యుఁడై యుంటఁ బ్రా
క్తనవైద్యానుభవాత్తవిత్త ముచితత్యాగంబు నీకబ్బుటన్
నినుబోలంగ నదృష్టశాలి యిలలేనే లేఁడు ముమ్మాటికిన్.

తే, గీ. అతిశయోక్తి స్వభావోక్తులందు కవుల
కెల్లఁ దుల్యాదరోన్నతి పల్లవించు
గాని మాకు స్వభావోక్తికలనయందె
విపులతరపక్షపాతధీ వెల్లివిరియు.

సర్వజిత్కార్తీక బహుళ
త్రయోదశి
తుల్యారామేశ్వరము.

విధేయుఁడు
కవికంఠీరవ, కవిమూర్ధన్య,
కాకరపర్తి కృష్ణశాస్త్రి.

# బాష్పాంజలి.

క॥ సిరిసంపదలకు తావై
వరలు ద్విభాషాన్వయుండు ప్రఖ్యాతభిష
గ్వరుఁడైన వెంకటేశ్వరుఁ
డరిగెన్మము నెల్ల వీడి యకటా దివికిన్॥ ౧॥

సీ॥ భరియించినాఁడుగా బహుకుటుంబమ్ముల
ననుకూల జీవనోపాధు లొసఁగి
వెలయించినాఁడుగా వేదశాస్త్రములు విం
జరపురమ్మునఁ బాఠశాల నిల్పి
నిలఁబెట్టినాఁడుగా నిగమోక్త ధర్మంబు
దేవాలయాదిప్రతిష్ఠ సేసి
చదివించినాఁడుగా ఛాత్త్రుల నన్నవ
స్త్రంబులు "స్కాలుజీతంబులిచ్చి"

గీ॥ ఆశ్రితజనౌఘపోషకుఁడర్థిలోక
కల్పభూజమ్ము ధార్మికాగ్రణి వదాన్య
వరుఁడు మా వేంకటేశ్వరవైద్యరాజు
పోయె మమ్మెల్ల దుఃఖాబ్ధి ముంచి దివికి॥ ౨॥

సీ॥ రచియించినాఁడను రమ్యమౌభంగి ధ
న్వంతరిచరిత కావ్యంబు గాఁగఁ
గావించినాఁడను గమనీయశైలి ధ
న్వంతరిదండక ప్రవర మొందు

విరచించినాఁడను విపులమౌ భారత
స్వాంతరిశతకమ్ము భక్తియుక్తి
నిర్మించినాఁడను నిర్మలమైన త
ద్దివ్యచారిత్రంబు భవ్యముగను
గీ॥ పండితుఁడ నని కవి నని బందుగుఁ డని
గౌరవం బందియుంటి నేఘనునివలన
నలభిషగ్రాజ దేవేంద్రుఁడైన వేంక
టేశ్వరుం డక్కటా దివి కేఁగె నేఁడు॥ ౩॥
మ॥ తిమిరం బెల్లెడ నావరించుటను గా
త్రింబాసెఁగా యాయురా
గము మంచుం దలపోసి యశ్వినులె యే
కంబైన రూపంబు దా
నమరంగా భువి వేంకటేశ్వరునిదా
యాకార మేపార జ
న్మము దా మంది రటంచుఁ దెల్పెదను త
న్మాహాత్మ్య మూహించుటన్॥ ౪॥
మ॥ అల నాసత్యులమూర్తి యాకృతిన వై
ద్యాగ్రేసరుండౌ ద్విభా
వ్యలసద్వంశ్యుని వేంకటేశ్వరుని స్వీ
యాస్థాన వైద్యుండుగా
వెలయం జేయఁదలంచి కావలయు దే
వేంద్రుండు స్వర్గానకున్
బిలువంబంచెను లేకయున్నను మమున్
[illegible] పీడంగ [illegible]కించునే॥ ౫॥

మ॥ తన తేజంబు సనాతనం బగుపరం
ధామమ్ముతో నైక్యమున్.
గనఁగాఁ జేసి యనంతమోక్షపదమున్
గన్నాఁడు ధన్యాత్ముఁ డా
తనిఁ బోలంగల వైద్యశేఖరుఁడు వి
ద్వాంసుండు గానంగరాఁ
డనిమాత్రిమ్ము విచారసాగరమునం
దల్లాడఁగా నయ్యెడున్॥ ౬॥

గీ॥ తిరము గానట్టిపాంచభౌతికశరీర
మద్ది విడనాడి సుస్థిరం బైనదివ్య
దేహముం దాల్చి ముక్తిసద్గేహిని తను
గొలువ మా వేంకటేశుండు వెలయు నెపుడు॥ ౭॥

ఉ॥ ఆయతబుద్ధివైభవస
మంచితుఁడంచితవర్తనుండు వి
స్ఫాయదరీణభావుఁ డని
వన్నియు నన్నిటఁ గన్న సూర్యనా
రాయణమూర్తి సర్వసుగు
ణాన్వితుఁడై పిత వేంకటేశ్వరుం
డేయెడ లేనిలోటు కన
నీనగతి న్విలసిల్లుఁ గావుతన్॥ ౮॥

18-6-49. ఇట్లు, విద్వత్కవిశేఖర

# ముద్రాప్రమాదములు.

| పుట | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 2 | 3 | లనుత్రిలింగ | లను క్షేత్రములందలి త్రిలింగ |
| 5 | 14 | వైదికర్మ | వైదికకర్మ |
| 18 | 20 | బుచ్చెయ్య | బుచ్చయ్య |
| 19 | 21 | కుమారిత | కౌమారిత |
| 20 | 3 | వాస్తవ్యఅగు | వాస్తవ్యులగు |
| 24 | 12 | విదితబగు | విదితంబగు |
| 35 | 22 | ధనేవవాః | ధనేవవా |
| 42 | 16 | వెంటే | వెంకటే |
| 45 | 14 | ఏకాం | ఐకాం |
| 70 | 2 | బెడవాడ | బెజవాడ |
| 94 | 3 | మండలాతర్గత | మండలాంతర్గత |
| 103 | 6 | దైవసృష్టమగు | దైవసృష్టమగు |
| 106 | 18 | కునవయనము | కుపవయనము |
| 111 | 20 | మేధావులు | మేధావులు |
| 116 | 1 | దిస్వభావ్య | సద్విభావ్య |
| 127 | 7 | గాల మెతయో | గాల మెంతయో |
| 132 | 2 | పట్టణములు | పట్టములు |
| 137 | 9 | యుతమ | యుత్తమ |
| 142 | 15 | ఆయ | ఆలయ |
| 148 | 3 | దరిడ్రో | దరిద్రో |
| | 5 | దరిద్ర్య | దారిద్ర్య |
| | 6 | ముచ్ఛేచుదిం | ముచ్ఛేదించు |
| 151 | 4 | వేకటేశ్వరు | వేంకటేశ్వరు |
| 168 | 11 | చెల్వపిళ్ల | చెల్వప్పిళ్ల |
| | 14 | విన్నవింపనె | విన్పింపనె |
| 189 | 20 | కెదఱకో | కెందఱకో |
| 199 | 5 | విహత | విదిత |

న, ప, స, లొకదానికొకటిపడినవి. కూచిభట్ల-కూచిభొట్లగను కుమార్తె-కొమార్తెగను సవరించుకొనందగును. అరసున్నలొకచో నిండుసున్నగబడినవి.